# అనాథ

*[ BARRICADES IN BERLIN ]*

అనువాదకులు

అశ్వినీకుమార్ శాస్త్రి

# రెండు మాటలు

ంథకర్త:—క్లా న్యూ క్రాంజ్

జననం ధనాఢ్యుల యింట్లో. చిన్నతనములోనే యువ ోద్యమంలో తీవ్రంగా పనిచేశాడు. 1914 లో వాలంటీరు— 4½ సంవత్సరాలు యుద్ధంలో పనిచేశాడు. 1919 వ సంవత్సరం వసంత ఋతువులో జీవితంలో ప్రథమ పర్యాయం సోషలిజాన్ని గూర్చి ఫ్యూగో హాసీ గారి వలన తెలిసికొనినాడు. అటు తరువాత అనేక గ్రంథాలు చదివేడు. అనేక వృత్తుల నవలంబించి 1923—25 సంవత్సరముల మధ్య జర్మనీలో కమ్యూనిస్టుపార్టీ నిషేధింపబడిన కాలంలో కమ్యూనిష్టయ్యాడు. ఆనాటినుండి విప్లవకర శ్రామికవర్గానికి అత్యద్భుత సేవచేయుచు వెల్టుయామ్ యబెండ్ (బెర్లిన్ కార్మికుల సాయంకాలపత్రిక) యొక్క సంపాదకీయవర్గంలో సంపాదకుడుగా పనిచేశాడు. అటుపైని సోవియటురష్యాలో చాలకాలముండి బెర్లిన్‌కు తిరిగివచ్చి వర్కరుగా పనిచేయుచున్నాడు. వీరికి విప్లవానుభవము చాల కలదు. వీరివ్రాతలు కార్మిక వర్గపు పోరాట ఎత్తుగడలను సూచించుతూ మార్గదర్శకములుగా వుంటాయి.

# నవల:

ఈ నవలలో ఉదహరింపబడిన వ్యక్తులుగాని, వారు చేసిన కృత్యములుగాని, సృష్టింపబడినవికాక, 1929 మే దినములలో కోలిన్‌స్ట్రాసీలో జరిగిన వాస్తవిక సంఘటనలనుండి గైకొనబడినవి. వర్గన్యాయముపేరిట యిటుపైని యీ చారిత్రక నవల నాధారముగా తీసికొని కొందరు వ్యక్తులకు హాని కలిగింప బడవచ్చునను భయముతో కొన్ని పేర్లు మాత్రము మార్పుచేయబడినవి. ముఖ్యముగా దీనిలో వర్ణింపబడిన పోలీసుల దాడులు ఇన్వెస్టిగేషన్ కమిటీవారి డాక్యుమెంట్లు నాధారముగా తీసికొని వ్రాయబడినవి.

అనువాదకుడు

# "అన్నా!"

"నెటిల్ బెక్ ప్లాజ్......"

ట్రామ్ కారులో సాయంత్రం ఒక యువకుడు కూచున్నాడు. అతనికి నిద్ర కూరుకు వస్తోంది. ట్రాంకారు కిటికీ గుండా తొంగిచూశాడు.

"ఆపత్రిక మీదేకాదూ?" అని, అతని పాదాల దగ్గర పడియున్న ఒకపత్రిక కేసి చూపించి అడిగింది ఒకయువతి.

దానిని తీసి మడచి జేబులో పెట్టాడు. మరుక్షణం లోనే ట్రాం దిగాడు.

గాలీ, వర్షం జోరుగా ఉంది- రోడ్డుమీద నిలచిన నీటిలో గ్యాసు దీపాల పచ్చటికాంతి ప్రతిబింబిస్తోంది- చలితో వణకి పోతున్నాడు. ట్రాములు ఆగే ప్రదేశము దగ్గరనున్న కాఫీ హోటల్‌లోని రేడియోధ్వని వినిపిస్తోంది. తన కోటుకాలరు

పైకి త్రిప్పుకుంటూ "ప్రతిమనిషికీ ఒక్కొక్క కోవేనా ఉండి తీరవలసిందే" అని అనుకొంటూ చేతులు జేబులలో పెట్టు కొని యింటివైపు నడువసాగాడు.

ఫ్రాంక్ స్ట్రాస్సేలో ఒక చీకటి సందులో ఉంది అతని యిల్లు. వీధిలో పెట్టెదుకాణాలన్నీ అప్పుడే మూసివేశారు. నర సంచారం లేదు. గ్యాసు దీపాల వెలుగు కూడ అస్పష్టంగా ఉంది—వీధిలో మలినమైన పొడుగాటి యిళ్లే అన్నీ. ఆయిళ్ళ కిటికీలకు తెరలులేవనే చెప్పొచ్చు. గదులలోని నూనె దీపాలు మిణుకుమిణుకు మంటూ కిటికీలలోనుండి కనుపిస్తున్నాయి — అతను నడుస్తూనే ఉన్నాడు. కొన్ని ఇళ్లు దాటిన తరువాత ఉతికిన బట్టల బాపతు కమ్మని వాసన తగిలింది. తరువాత కొంత దూరం నడచి తనయిల్లు చేరుకున్నాడు.

ఇంటి గేటు దగ్గర ఇద్దరుస్త్రీలు కనుపించి పలుకరించా రతన్ని. తల ఊపి గొందిలోకి చరచరా నడచిపోయాడు. గవా క్షంలోంచి తనగదిలోనిదీపం కనుపించింది. "అమ్మయ్యా!... అన్నా ఇంటి వద్దనే వుంది" అని నిమిత పడ్డాడు. డస్సిపోయిన ముఖం తుడుచుకున్నాడు. ప్రతిరాత్రీ దోవలో నడుస్తూ వున్న ప్పుడు తన కిటికీలోంచి దీపం కనుపిస్తూ ఉండేది. అతను వచ్చే సరికి అన్నా యింటి దగ్గర ఉంటే అతనికి అపరిమిత ఉత్సా హం పొంగివస్తూ ఉండేది.

# "అన్నా!"

తడుముకుంటూ ఇరుకైన మేడ మెట్లెక్కి వెళ్లి తలుపు తెరచాడు. అన్నా నవ్వుతూ కనుపించింది.

"యీవెనింగ్ అన్నా!" అని పలుకరించాడు. "గుడ్ యీవెనింగ్ కర్ట్" అని ఆమె సమాధానం ఇచ్చింది.

నెత్తినున్న టోపీ తీసి చిలక్కొయ్యకు తగిలించి కుర్చీలో కూలబడ్డాడు. యువకుని పేరు కర్టుజిమ్మర్‌మాన్. సిమెంటుమోతపని-

వంటయింట్లో మేజాబల్ల వద్ద కూర్చునుటకు ఇద్దరకే చోటుంది. సెగడి కూడ పక్కనేఉంది బల్లమీద కాళ్లు జాచుకొని అన్నా కేసి చూస్తూ కూచున్నాడు. అన్నా వడ్డన చేస్తూంది. ఏపని చేసినా చాలా చాతుర్యంగా చేస్తుంది అన్నా. ఆచాతుర్యం చూస్తే కర్టుకు వళ్లు పొంగిపోతుంది. వంటకాల సువాసనకు ఆకలి ఎక్కువైపోతోంది. ఎన్నో రోజుల క్రితం సినీమాకు తీసుకువెడతానని అన్నాకు చేసిన వాగ్దానము జ్ఞాపకం వచ్చింది. "ఈనాడైన మేము సినీమాకు వెళ్లాలి" అని కునికిపాట్లు పడుతూ అన్నాడు. అతని కంత బడలికగా ఉండకపోతే అన్నాకూడ అంగీకరించేదే పాపం........"

............ఫోర్మన్ నానాటికి మరీ దారుణంగా ప్రవర్తిస్తున్నాడు. రేపు కంకరను ఇంకొక అంతస్థుపైకి మోసుకొని వెళ్లాలి........................

"అన్నా!"

అతని కళ్లు మూతలుపడ్డాయి—"వడ్డన అయిపోయింది. భోజనంచేయండి............"

"కర్టూ! కర్టూ!.........నిద్రపట్టేసింది అప్పుడే" కంచం ముందుకుతోసి, బుజంతట్టి కర్టును లేపింది. ముఖం పైకెత్తి కళ్లూ పాలిపోయిన ముఖం చేతితో తుడుచుకొంటూంటే చూచింది అన్నా. ఎంతో అలసి పోయాడని గుర్తించింది—ఇప్పుడు చేస్తూన్నయింటిపని పాౖరంభించక ముందు 6 నెలలు అతని కేమీపని దొరకలేదు. ఇప్పుడు చేస్తూన్న పనిలో తొందర ఎక్కువ చేస్తూంటే పనిథాకాకు నిలవ లేకపో తున్నాడు.

"అబ్బే" అని నీరసంగా నవ్వుతూ "నిద్రపోవడంలేదు" అన్నాడు- తిండి తినడం ప్రారంభించాడు. బల్లకు రెండోపక్కని కర్టు కెదురుగా కూచుని చూస్తోంది అన్నా. అతని అరచేతులు చాలా వెడల్పు మోటుగా ఉన్నాయి. కప్పులోని హారం చెమ్చాతో గభగబా తినేస్తున్నాడు. అతనికి అలసట ఎక్కువైన నాడు ఇంకా మోటుగా కనిపిస్తాడు. జాలివేసి నవ్వింది అన్నా.

కర్టు చాలా మంచివాడు. అయినా ఒక్కవిషయంలో మాత్రం అతనికి చాల కోపం వస్తుంది. అన్నా కూడ ఆ ఒక్క విషయంలోను చాలజాగ్రత్తగా నడుచుకుంటూ అవసరమైనంత వరకే తన అభిప్రాయాన్ని పైకి చెప్పుతూఉండేది- శాస్త్ర కాళీ

ఉంటే కార్మికోద్యమానికి, దాన్ని వినియోగిస్తాడని తెలిసి అతన్నే పెళ్ళిచేసుకుంది అన్నా. పెళ్ళిఅయి రెండుసంవత్సరా లయింది. ఉద్యమాన్నిగూర్చి అతనితో ప్రసంగించిన ప్రయో జనంలేదు. ఎంత నీరసంగా ఉన్నా, ఆఖరికి సోషవచ్చి పడిపో తూన్నా, ఏదైనా సభ ఉన్నా, పని ఉన్నా ఆరాత్రి ఆపని అయిపోయేవరకూ నిద్రపోడు-మళ్ళీ ఉదయాన్నే అయిదున్నర కల్లా లేచి పనికి పోయేవాడు. లేకపోతే కాకులవలె కనిపెట్టు కొనియున్న పనిలేని కూలీలు చాలామంది యుండుటచే వారె వరో ఆపనిలో ప్రవేశిస్తారు. అతనికి పని దొరకదు. అతని బల మంతా యీలాగున నశిస్తే లాభమేమిటి? ఇతరవిషయాలలో వేటిలోనూ ఆమె అతన్నేమీ కోరేది కాదు. ఆమెకూడ ఒక "కూలీ" స్త్రీ గనుక తృప్తిఅంటే ఏమిటో ఎరుగును- రాత్రి కూడా ఎక్కడికైనా వెడతాడేమో? ఏమెరుగును?

"కట్టూ! ఇంత అర్థరాత్రివేళ ఎక్కడికైనావెళ్ళాలా?" అని అన్నా అడిగింది.

"ఊంహుఁ!" తిన్నగా పక్కమీదికే......నువ్వు... నీకు సినీమాకు వెళ్ళాలని లేకపోతేను. నీకు సినీమాకెళ్ళా లని వుంది కాదూ? వుంది..."

"లేదు. అల్లా మీకే ఉంది" అంది నవ్వుతూ, కట్టు అల్లా అడిగినందుకే పొంగిపోయింది. అన్నా లేదు అని అందేగాని.

అతన్ని ఒప్పించ లేకపోయింది — వారెప్పుడూ అంత అన్యోన్యంగా వుండేవారు. కాని యీరాత్రి ఆమె ఆందోళన పడుచున్నది. కష్టతరమగు పని అతన్ని ఎల్లా పిప్పిచేయుచున్నదో గమనించింది. తన మాటవింటే అతని కష్టాలు పోతాయను కొన్నది.

వివాహానికి ముందు చాలాకాలం ఆమె ఒకఫ్యాక్టరీలో పనిచేసింది. ఆమెకష్టజీవి. జీవితమంటే ఏమిటో ఆమె అర్థం చేసుకొన్నది.

ఇంతలో భోజనం పూర్తిఅయింది. కర్ర కంచాన్ని వెనక్కి గెంటి త్రేన్చి, "కాఫీ ఇంక కొంచముందా?" అని అడిగాడు.

అన్నా పెదిమె విరచి "ఇంకపడుకోండి, పొద్దున్నే అయిదున్నరకేలే వాలి" అంది. అతను లేచి వళ్ళు విరుచుకున్నాడు.

"అబ్బ! పశుజీవనం" పని, భోజనం, నిద్ర! ఆరాత్రి ఏమీమాటెంగూ లేకపోవడం మంచిదే. అదీగాక భార్యాబిడ్డలను పగలుచూచే యోగ్యత లేదు.

మెల్లగా తన మురికి దుస్తులను తీయసాగెను "అన్నా! రేపు నాప్రాత చొక్కా తొడుక్కోవాలి చూడు. మళ్ళీ భుజాలవద్ద చిరిగింది.

అన్నీ మాసికలు వేసిన గుడ్డలు.

## "అన్నా!"

వారింటికి వంటిల్లుగాక మరియొక గది దానినంటేఉన్నది. అదేపడకగది. ఇరుకైన దారిగుండా తడుముకుంటూ ఆగదిలోకి పోయాడు. కట్టు మంచం ప్రక్క నున్న కుర్చీలో కొవ్వువత్తి దీపం వెలుగుతోంది. ఏంతో అవుసరమైనా కిటికీ తెరలింకా కొనుక్కోలేకపోయారు. ప్రతిరాత్రి ఎర్రటి పరుపుగలేబు కిటికీకి కట్టేది అన్నా. అన్నా మంచంమీద కుర్రాడు నిద్రపోతున్నాడు.

కట్టుపడకమీద చలితో పిడచగట్టుకు పోతున్నాడు. దుప్పట్లు తేమగా ఉండి కంపు కొడుతున్నాయి. ఇల్లూ, బెల్లులూడిన గోడలూ, అన్నీ అలాగే ఉన్నాయి.

బోరగిలపడుకుంటేనే ఎముకలు నొప్పిపెడుతున్నాయి. ఆనాడుకూడా 6 టన్నుల కంకర నిచ్చెనమీద పై అంతస్తులోకి మోశాడు. దెయ్యపుచాకిరీ! ఎంత పనిచేసినా జబ్బు చేయనంత వరకే.......అప్పుడు పనిపోతుంది.......వచ్చే బుధవారం వాళ్ళు పనికి వెళ్ళడంలేదు.......అది బాగానే ఉంది....... రేపో సభ వుంది ....... పైనున్న వైర్లెస్ నోరుమూసుకు పడి ఉంటే!.........

అన్నా గడియారానికి కీ ఇచ్చి అలారం పెట్టి కుర్చీమీద పెట్టింది. కుర్చీమీదనున్న కొవ్వొత్తి ఆర్పేందుకు వంగింది.

---

# "ఆనాశ!"

వీధిసద్దు అణిగింది. అచ్చటనుండే కొద్ది మసగ్ దీపాలూ ఆ వీధి నిర్జనత్వాన్ని అభివృద్ధిచేశాయి. సత్రములన్నీ మూసివేశారు. ఎక్కడో ఒకచోటనుండి, పలుచని కర్ర తలుపులు క్రిందకు దింపుతూ ఉన్నట్లు కిర్రుధ్వని వినవచ్చింది. ఒకపిల్లి బెదరి వీధికడ్డముగా పరుగెత్తి అద్దం పగిలిపోయిన ఒక కిటికీ సందులోదూరి మాయమయింది.

నెటిల్ బెజ్ ప్లాక్ స్టేషన్ కు వచ్చే ఆఖరి రైళ్ల హాహూ ధ్వనీ వినవచ్చింది. కిటికీలో అక్కడి అద్దె యిళ్ల ఆకారం అస్పష్టంగా విచారసూచకంగా కనుపించింది. ఒకదాని తరువాత ఒకటి దీపాలన్నీ మెల్లగా ఆరిపోయాయి. వెడ్డింగ్ ప్రదేశంలో రాళ్ల అగాధంలో త్వరగా చీకటి పడుతుంది. కార్మికునికి రాత్రి చాల తక్కువగా ఉంటుంది.

గస్తీ తిరిగే పోలీసుల బూటు కాళ్ల టక్ టక్ ధ్వని మాత్రమే వినిపిస్తో ఉంటుంది. వారు ముగ్గురు ముగ్గురు జట్లుగా తిరుగు తూంటారు. మురికి గోడల మధ్య సందులలో మురుగు నీరు ప్రవహిస్తూ ఉంటుంది. ఫ్యాక్టరీ దగ్గర మురుగు నీటిగుం

టల్లోనే స్నానం పిల్లలకు వేసవికాలమంతా. అప్పుడే ఏప్రిల్ నెల. ఆకాశాన మేఘాలేమీ లేవు. చలిమాత్రం ఎక్కువగా ఉంది. ఇటువంటి రాత్రిపూట కూడా ఆయనికి గుంటలోని నీళ్లల్లో నక్షత్రాలేనా ప్రతిబింబించటంలేదు.

వళ్లు బిగిసిపోయేటట్లా చలిగాలి వస్తోంది. గాలికి అడ్డంలేని కిటికీ గదులలో అనేక మంది మానవులు జీవిస్తున్నారు. నిద్రిపోయే వారిముఖాలను దుర్గంధపూరితవాయువు లావరించియున్నవి. అంతస్తులు, మార్గాలు, పడకగదులు, దొడ్లు, భరి ...నికిపీలులేకుండా క్రిక్కిరిసిపోయాయిజనంతో. అడ్డగోడల ... బూడి పోయినవి. గోడలన్నీ బీటలుదీశాయి. పైన కంపుగొ... న్నాయి. కాపురాలు చేసే యిండ్లల్లోని పెంటంతా వీధుల్లో నిలవయియుంది. అన్నిటినీమించి, వీధుల నిండా పిల్లలు. నున్నగా ఉన్న కుర్రవా డొక్కడూ కనుపించడు. ఇదీ, పేరు గన్న బెర్లిన్ నగరములోని ఆకలి. బీదరికం. ఇళ్లు వాకిళ్లు లేని నిర్భాగ్యులు మెట్లమీద దొర్లుతున్నారు పోగులు పోగులుగా బడి నిద్రిస్తున్నారు. వాళ్ల ఆదర్శాలు, ఆశలకు అనుకూలముగా బాధకరముగు కలలు గంటున్నారు.

ఒకదొడ్డిలోని విశ్వబ్దాన్ని అచ్చుటిక్షయరోగి దగ్గు భంగపరుస్తోంది- నాల్గవ అంతస్తులోని గదిలో దీప మారిపోయింది. ఆ వంటింటిలో ఒక ముసలమ్మ పడుకుంది. ఎంత ప్రయత్నిం

ఛినా ఆమెకు కునుకు రావడంలేదు. ఆయింటిలో రోడ్డుపని చేసే ఒకకూలీ యువకుడున్నాడు. తన వద్దనే పరుండియున్న ప్రియురాలి వేడి నిశ్వాసలే అతనికి వెచ్చ గలిగిస్తున్నాయి. గోడ వెనుక వైపున వైర్లెస్‌లో నృత్యగీతవాద్యాలు వినిపిస్తూనే ఉన్నాయి.

ఒక గృహప్రాంగణంలో కిటికీ అద్దం కిటకిట లాడింది. అక్కడొక తాగుబోతు తందనా లాడుతున్నాడు. చుట్టుపట్లనున్న జనమంతా ఆగోడవ విని "అబ్బా! ఫ్రాంజు మళ్ళీ తాగాడు" అనుకొన్నారు.

అసలే ఇరుకు. కాస్త గాలేనా రావాలా? బోనులోనున్న జంతువుకేనా కాస్త చోటూ, కాస్త గాలీ ఉండాలి. ఈ ఇరుకులో కనపడ్డ గోడల మీదకి, మనుష్యుల మీదకి దూకుతూంటే ఎంత బాధ? ఫ్రాంజు ఇంటికి వచ్చి గంద్రగోళం చేస్తూ వస్తువులన్నీ పగులగొడతా నంటాడు.

రాత్రులు కూలీల కలలు విని తీరాలి. విశాలమగు రమ్య హార్మ్యాలలో నిద్రించే శ్రీమంతుల కలలకు వాటికి ఎంతో వ్యత్యాసం ఉంది. తాకట్టుపై అప్పు లిచ్చే వారి దబాయింపులు, సత్రపు అధికారుల పిశాచపు టరుపులు, కూలీలను మార్చే జగడాల కోరుల మోసము, యంత్రాగారపు పోర్ట్లర టక్కరి, యజమానుల ధుమ ధుమలాడే మొగాలు, యీవిధ

మగు బాధాకర స్వప్నాలు, హడలెత్తించే శత్రుముఖాలు, వికృతమైన పిశాచ పీడ, నిద్రలో కూడా పాపమా కూలీలను వదలడం లేదు. ఆ కలలలో కూలీలకు వళ్లు గగుర్పొడుస్తూ ఉంటుంది. గర్జిస్తూ ప్రపంచాన్ని కూడ పొడుము చేసే ఆవిరి సుత్తులు, దిక్కులు పగిలేలా శబ్దం చేస్తూన్న ముద్రాలయాలు; మొదలగు పగటి విషయాలన్నీ కార్మిక లోకానికి రాత్రులందు కలలోకి వస్తూ ఉంటాయి. గూడుకట్టి మాని మచ్చ పడిన గాయాల బాధ మూలాన్ని స్త్రీలు నిద్రలో మూలుగుతూనే ఉంటారు. అప్పుడే జీవకాంతి నశిస్తూన్న యువకులు అల్ప ఐశ్వర్యాలను గూర్చి కలలు గంటారు. ఎత్తగు మేడలు వెల్లవేసిన గోడల గది, పెద్ద గ్యాసుదీపాలు, ఆదివారం నాడు సుందరులతో షికార్లు, ఇవీ వాళ్ళ కలలు. సాయంత్రం ఎర్ర కాగితపు దీపాలు, కొత్త బూట్లు, పళ్ళబుట్ట బుట్టలోని రుచి గల పండ్లూ మొదలగు సరదా కలలు కంటూంటే ఇంటి కప్పు నుండి కూడా నల్లులు రాలుతూ బాలుర మృదువగు దేహాలను పొడిచి వేడి నెత్తురులు త్రాగుతుంటాయి.

ఇల్లంతా ప్రతిధ్వనించే లాగున ఎవరో, ఒక గది తలుపు కొడుతున్నారు ప్రక్కనున్న గదుల లోని వారందరు ఉలిక్కిపడి లేచారు. ఇల్లు ఖాళీ చేసి వెళ్ళి పొమ్మన్నట్లో, సోదాకై పోలీసులు వచ్చినట్లో మెలకువ వచ్చిరానివారు కలలు కని తెల్లబోతూన్నారు.

ప్రశ్న

తలుపు చప్పుడు విని కలలో మెలకువ వచ్చి గదిలో నిద్రపోతూన్న వాడు లేచాడు. వళ్లంతా చెమటతో తడిసింది.

"ఎవరది"........?

"తలుపు తెరు, పాల్......నా తాళంచెవి మరచి పోయాను"

అతనచట నివసించే వాడే. చుట్టుపక్కల గదుల లోని వారు మళ్లా పడకల మీదకి ఒరిగారు—ఒక్కొక్క విష యంగం—ఇక్కడిది.

శ్రీమంతులు, హర్మ్యాలలో విశాలమైన గదులలో మెత్తని పరుపుల మీద వెచ్చగా గుడ్డలు కప్పుకొని నిద్రిస్తారు. తెరచి ఉన్న కిటికీల గుండా పూల తోటలనుండి కమ్మని గాలి వేస్తూ ఉంటుంది. సాయంత్రం పడుకోబోయే ముందు వారు ప్రార్థన చేస్తారు.

"అలసి సొలసి పడుకుంటున్నాను. నాకళ్లు మూతబడి నాకు సుఖనిద్ర కలుగుగాక! ఓ విశ్వవ్యాపీ! జగత్పితా! భగవానుడా! నేను లేచేవరకు నన్ను కాపాడుము" ఇల్లా ప్రార్థించి భగవంతుడు ప్రత్యక్షమైనట్లు, విమానం మీద, తమను నక్షత్రమండలం దాటించి స్వర్గం చేర్చినట్లు, అచట రం

భాద్యపస్సరసలు నాట్యా మాడుతూన్నట్లు అందోకతే తన్ను వలచినట్లు తానామెతో భోగింపుచున్నట్లు, కలలు కంటూ ఉంటారు వారు.

వెడ్డింగ్ సందులోని దొడ్లన్నీ చాలా ఇరుకుగా ఉంటాయి. "హైడి" అనే అమ్మాయి తన కిటికీలోంచి తొంగి చూస్తే నక్షత్రమే కనుపించ లేదు.

ఆ వీధిలో పిల్లలు లగాయితు పెద్దలవరకూ చేతులు జోడించే అలవాటే లేదు. పిడికిలి బిగించి "రెడ్ఫ్రంట్" అనడమే. చిన్నప్పటినుండి అల్లా అలవాటు చేశారు—చేస్తారు. పెద్ద వాళ్ళందరూ ఆ వీధి అంతా విప్లవకారులే.

మేడే ఇంకా నాలుగు రోజులుంది. ఆ ఊరేగింపును గూర్చి, ఆ ఉత్సవాన్ని గూర్చి ఆ వీధిలోని వారంతా కలలు గంటున్నారు.

ప్రతిరోజూ తెల్లవారు ఝామునే 5 గంటలకు లేచి మూటలు చంకల క్రింద పెట్టుకొని జోగుతూ చలిలో వణకి పోతూ కూలీలు పనికి బయలుదేరుతారు. వెడ్డింగ్ స్టేషన్ నుండి బయలుదేరి రైళ్ళెక్కి కూలీలు సీమెంటాట్ రమ్మెల్సు బర్గు, రీనికెండార్ఫులకు సాగిపోతారు. అవన్నీ ఆప్రాంతాలలో పారిశ్రామిక ప్రదేశాలు.

---

# ఆనాప

సరిగా పది గంటలకు ఆనాడు ఉదయాన్ని లావాటి పొట్టి మనిషి నల్లని దస్త్రాలు చంక బెట్టుకొని వచ్చి నాల్గవ అంతస్థులోని మూడవ నెంబరు గది తలుపు తట్టాడు. ఎవరూ పలుకలేదు. మళ్ళీ గట్టిగా కొట్టాడు. ఎదుటి వైపు నుండి ఒక ముసలి అవ్వ తలుపు కొంచెం తెరచి ఆవచ్చిన మనిషిని, అతని దస్త్రాలను సందులోంచి చూచింది. ఆమెకు అనుమానం కలిగింది.

"వాళ్ళతో నీకేం పనుందయ్యా...?"

అపొట్టి మనిషి వెనుకకు తిరిగి "శ్రీరంగన్ భార్య, వెల పలికి పోయిందో, ఇంట్లో ఉందో చెప్పగలవా?"

ఆముసలమ్మ ఆమనిషిని ఎగాదిగా చూచి కోపంతో ధడాలున తలుపు వేసుకుంది. అతడు ఉలిక్కిపడి "మంచీ చెడ్డా లేదు. మృగాలు" అనుకున్నాడు.

మళ్ళీ ఇంకొకసారి అవతలి వైపుకు తిరిగాడు. గది తలుపు మీద ఒక నోటీసు అంటించి ఉంది. దానికి ఆఫీసు ముద్ర కూడా ఉంది.

"ఏమమ్మోయి! నీ అంతట నీవు తలుపు తెరువక పోతే నేను బలవంతముగా తలుపులు బద్దలుకొట్ట వలసి యుంటుంది సుమా!" అని అరిచాడు తలుపు వెనుక ఒక శిశువు ఏడుపు ప్రారంభించింది. అడుగు నుండి తలుపు కిర్రుమంది. మేడ మెట్ల మీదనుండి ఎవరో వచ్చారు. అతడొక కార్మికుడు. ఈ లాంటి మనిషిని చూచి ఆగాడు.

"ఓహో!......నీవా! ఎందు కంత గొడవ చేస్తున్నావు. నా భార్యకు చాల జబ్బుగా ఉంది." అంటూ చిరచిరలాడుతూ కిందికి వెళ్ళిపోయాడు ఆతర్వాత దొడ్లో పరుగెత్తుతూన్నట్లు వినపడింది.

ఆలావు మనిషికి ఏమీ తోచడం లేదు. ఏమీ దార్జన్యా న్నుపయోగించ కుండా గదిలోకి వెళ్ళాలను కుంటాడు. తలుపు బద్దలు కొడితే చాల అపాయ కరంలా కనుపిస్తోంది.

"దిక్కుమాలి ఉద్యోగంరా దేవుడా! వాళ్ళ ఆజ్ఞలు నెరవేర్చాలి." అనుకొని దస్త్రాల సంచి తడిమాడు. భార్య జాగ్రత్తగా కట్టి ఇచ్చిన ఫలహారపు పొట్లం చేతికి తగిలింది.

తలుపు సందులోంచి తొంగి చూచి "ఏమమ్మా! నా మాట విను. తలుపు తియ్యి. ఏఉపాయముందో చూద్దాం!" అన్నాడు.

# అన్నా

హఠాత్తుగా తలుపు తెరచే టప్పటికి హాడలి వెనక్కి ఎగిరి పడ్డాడు.

బూడిద రంగు చింకి గుడ్డలు కప్పిన శిశువును చంక బెట్టుకొని గుమ్మంలో ఒక యువతి నిలబడింది. వీధంతా మారుమోగే లాగున కెవ్వుమంది.

అబ్బో! యీ జాతి వాళ్లని నేను బాగా ఎరుగుదును" అని అనుకున్నాడు. గదిలో ఆవిడ ఒక్కత్తే ఉంది. అది చూచి స్థిమితం తెచ్చుకొని ఆమె నోక పక్కకు నెట్టి లోపలి కెళ్లాడు. ఆవేశం విచారం కూడ ఆవేశించి మనసు మనసులో లేదు ఆమెకు. ఆఫీసరు తన అధికారాన్నంతా వెళ్లగక్కు తున్నాడు. "ఎన్ని పర్యాయాలు చెప్పినా బకాయి పడ్డ అద్దె చెల్లించావు కాదు. అది అప్పుడే 47 మార్కు లయింది. నీకు వచ్చే భృతి యీ వారానికి 8 మార్కులు మించదు. అందుచే యిల్లు నీవు తక్షణం ఖాళీ చెయ్యాలి! ప్రభుత్వ ఆర్డరును ధిక్కరించి ఆ నేరం కూడా చేయకు. నీవు చెల్లించ లేదు గనుక నిన్ని యింట్లోనుంచి గెంటి వేసే పని నామీద పడింది—నీ మూటా ముల్లె సర్దుకో, వర్కుహౌసుకు తీసు కెడతాను. సైసు కూడా అట్టే లేదు. త్వరగా!" అంటూ ఆమె వైపు చూడ కుండా వెనుకకు తిరిగి తలుపులు దగ్గరగా వేశాడు. గదిలో సామాను కూడా ఏమీ లేదు. "పైకి ఎంత

బండారంగా కనుపించినా లోపల లొటారమే. లోపల పిల్లలు తప్ప మరేమీ ఉండవు. పడుకొనేందుకు బొంతైనా లేదే, తినేందుకు మెతుకే లేదు. ఇంత దరిద్రం ఇక్కడ మూర్తీభవించి ఉందని ఎవ్వరూ అనుకోనైనా లేదే" అనుకొన్నాడు.

ఇంతలో హీన స్వరంతో మూలుగు ఒకటి వినిపించింది. చూచేసరికి నేలమీద పడుకొని తూట్లుపడి పోయిన దుప్పటీ కప్పుకొని పడుకొని ఉంది. ఒకపిల్ల. ఎముకలు బయట పడి ఉన్నాయి. మొహముంతా పాలిపోయింది. కళ్లూ దవడలూ గుంటలడి వున్నాయి—కోడి మెడ పడి పోయింది. అంతా ఎముకల పోగు తప్ప మరేమీ ఆపిల్లలో కనుపించడం లేదు.

"అబ్బా! యీ పిల్ల ఇంకేమి బతుకుతుంది! చెప్మా! భయంకరం. యీ పని ఎంత తొందరగా తెమిలి బయట పడితే అంత మంచిది" అని గొణుక్కున్నాడు విచారంగా కిటికీ తలుపులు తెరచి తొంగి చూచాడు. ఆప్రదేశము రూపే మారి పోయింది. తాను మొదట వచ్చే సరికి ఒక్క పిట్టైనా లేదు. యిప్పుడో ఉద్రేక పూరితులైన యువతులతో నిండి పోయింది. బరువు మోసే కూలీలను వాళ్లు హెచ్చరిస్తున్నారు. కూలీలు వాళ్ళకేమీ సమాధానం చెప్పటం లేదు. ఆఫీసరు తొంగి చూచే సరికల్లా "అడుగో! వాడే!" అని అందరూ పైకి

చూచారు. "వీడి దుంప తెగా!.........ఫో!.........అవత లికి దుర్మార్గుడా!" అన్నారు అందరూ ఒక్కసారిగా.

"ఈవుద్యోగం చేస్తూన్నందుకు సిగ్గేనా లేదేమిటి వాడికి?."

భయంతో అడుగు వెనక్కేసి "యిల్లంతా యింత గంద్ర గోళంగా వుంది. ఒక పోలీసు నేనా కూడా తీసు కొచ్చాను గాను. మంచి తనానికి రోజులు కావు. దైవమా!" అనుకొంటున్నాడు. తన కాళ్ళ దగ్గర నున్న రోగి ఇంకా మూలుగుతోనే ఉంది. స్పృహ ఉందో లేదో!" తోచటం లేదు.

ఇంతలో "ఆముండా కొడుకుని అవతలికి గెంటండి!" అనే శాపనార్థాలు వినపడి వెనక్కి చూచాడు" వాళ్ళం దరూ దగ్గరకు వచ్చేశారు." రాళ్ళు విసురుతా రేమోనని భయంతో వళ్లు నిలువునా నీరై పోయింది. ఇక్కడి నుండి బతికి బయట పడితే చాలనుకొన్నాడు. కాని అంతపెద్ద మూక లోంచి తప్పించు కొని పోవడమెల్లాగ? మెట్ల మీద నుండి మనుష్యులు పైకి వస్తున్నట్లు వినిపించింది.

"వాళ్లు వస్తున్నారు" అనుకున్నాడు మెల్లగా. "భయ ము లేదమ్మా! రండి." అంటూ ఒక యువకుడా స్త్రీల నందరినీ తీసుకువస్తూంటే అంతా బిలబిల లాడుతూ వచ్చేశారు. తలుపు తెరచాడు.

లోపల ఆఫీసరు దస్త్రాల సంచి గుండెల కదిమి పట్టు కున్నాడు. కొయ్యి అయిపోయాడు. కంగారుతో నోరు మూత పడ లేదు.

కార్మికుడు లోపలికి వచ్చాడు. విశాలమైన ఛాతీ. దుమ్ము కొట్టుకుంటూ జుట్టు. 35 ఏళ్ళుఉన్నాయి అతనికి. క్రింద ప్రాణావశిష్టయై పడియున్న రోగిని చూచి జాలి పడ్డాడు. సామాన్లు మోసే కోర్టు జవాన్లు ముగ్గురూ లోపలికి వచ్చారు.

లోపలికి వచ్చిన కూలీ నెమ్మది చూచి ఆఫీసరు ప్రాణాలు కుదుట బడ్డాయి. అతడు ఒక నాయకుడని అనుకొని అతనికి నమస్కారం చేసి ఒక అడుగు ముందుకు వేసి "నా పేరు బెండో విస్కీ అండీ... బెండోవిస్కీ ......" అన్నాడు. "నాకే చాల విచారంగానూ కష్టంగానూ వుంది......... ముఖ్యంగా ఆపిల్లని చూస్తే మాత్రం...అబ్బ...దుర్భరం... ఎంత పాపిష్టి రోజులూ!...... కాని నాకింత కంటె గత్యంతరం లేదు." అన్నాడు- గబ గబా దస్త్రపు సంచీలోంచి ఒక నోటీసు పైకి తీశాడు.

కార్మికుడు చెయ్యి అడ్డంగా తిప్పి, "బాగుందంతా!......నీవేం చేస్తున్నావో నీకు తెలుసు......దుండగీంద్ర పనులను చేసి పెట్టేటందుకు పూనుకొనేహాడూ వారితో పాటే!" అని చరాలున వెనక్కి జవాన్ల వైపు తిరిగాడు.

"కాని మీరు........మీరూ బీదవాళ్లే మాలాగనే. వాళ్ళు మీ కే కాస్నిడబ్బులో పడేసి మిమ్మల్ని మీవర్గానికే శత్రువులుగా చేసేస్తున్నారు. ఇదిగో! ఇల్లా తిరిగి చూడండి. సహచరులారా! రెండేండ్ల నుండి యీ యింటి యజమానికి పని లేదు. అతనికి క్షయరోగం. అందుచే అతనికి నిరుద్యోగ భృతి కూడా రావడం లేదు. ఇంక ఈ అమ్మాయిని చూడండి ఒక సంవత్సరం నుండి తీసుకొంటోంది. ఈ యింట్లో ఉండే నలుగురికి ప్రజా సహాయ సంఘం వారు నె 1 కి 32 మార్కులిస్తారు. క్షయ రోగ నివారణ సంఘం వారు 1 సీసాడు మందిస్తారు. రెండు నెలల క్రితం అతని కడుపులో నుంచి బయటకి మందు తీశారు. దానితో అతనికి నీరసం హెచ్చిపోయింది. ఒక అర్థణా డబ్బులు సంపాదిద్దామని ప్రయత్నిస్తాడు పాపం. యీ గుహకు నె 1 కి 25 మార్కులివ్వాలి పాపం వాళ్ళు అద్దె క్రింద, పండగలికీ, వస్త్రాలకీ, తిండికి మిగిలింది వాళ్ళకింక 7 మార్కులు మాత్రమే. ఆ పాత గుడ్డ పీలికల్ని, చింకి చాపల్ని, కర్రల్ని, అన్నిటికన్నా ఈ రోగిష్టి పిల్లనీ, వీధిలో పడేసేందుకు మీ మనసెల్లా ఒప్పుతుంది? ధైర్యమేమన్నా మిగిలుంటే మీగుండెలు రాళ్లైతే పడెయ్యండి చూద్దాం.

పడేయ్యండి........ చూస్తారేం?...... మేమూ చూస్తాం" అని వెనక్కి తిరిగి చూడకుండా గది నుండి బయటకి వెళ్లాడు—

ఒక్క క్షణం చీమైనా చిటుక్కు మనలేదు. ఆస్థూలకాయుడు అనుమానంతో చూచాడు జవాన్లకేసి. "నేను మాత్రం చేయలేను, చేయను. మేమంత పిల్లలు లేనివాళ్లమా? మృగాలమా! ఊఁ. హుఁ. మీరే చేయండి... అయ్యా!......అన్నాడు అందులో ఒక జవాను. మిగిలినవారిద్దరూ కూడా బుర్ర లూపారు. శవం వలె నున్న ఆ పిల్లకేసి చూసి వెళ్లి పోయారు.

ఆపిల్లా తనూ మిగిలారు. స్థూలకాయుడేమి చేస్తాడు? దారీ తెన్ను కన బడ్డం లేదు. బయట పడేందుకు దారి మొదలే లేదు. జవాన్ల తిరస్కారానికి మొగం చిన్న బుచ్చుకొన్నాడు. జవాన్ల జీతాలు ఎక్కువే. లాభ మేమిటి? చెయ్యనంటారు—! ఇంక తన అధికారము మాత్రం ఏం చెల్లుతుంది గడ్డలు—

అనవసరంగా లేని పోని సమస్యలతో కాలం వ్యర్థ పుచ్చే మనిషి కాదు అమీనా బెండొవిస్కీ. టోపీ నెత్తికి తగిలించి దస్త్రాల కట్ట చంక నెట్టి వెనుకకు తిరిగాడు. ఇవతల ఇదివరకటి కూలీ లంతా ఉన్నారు. వెళ్ళిపోవడం మాత్రం

ఎల్లాగా? "అయ్యా! క్షమించండి! మీపేరు......? నేను తిరిగి వచ్చే వరకూ యీ యింటిని జాగ్రత్తగా చూస్తూ ఉండండి." అంటూ వినయ విధేయతలుట్టి పడ "నే నేం చేయను? ఇల్లాంటి వింకా అనేక నోటీసు లున్నాయి. యిను గో చూడండి పోసీ" అంటూ దస్తరాల కట్ట పైకి తీసి-చూపించాడు.

"నిన్నెవ్వరూ ఏంచెయ్యరు. నీ వేమీ కంగారు పడ నక్కర లేదు." ఇంకా వున్న ఆర్డర్ల సంగతి వినపడనట్టుగా నటించాడు. "వాళ్లు చాలా చేయ దలచు కొన్నట్లున్నారు." అని అను కొన్నాడు. మెల్లిగా యీల వేశాడు.

అంతస్థుల మీద నున్న స్త్రీలంతా హర్షధ్వను లతో ఆముగ్గురు జవాన్లకూ స్వాగత మిచ్చారు. ఒక ఆమె పెద్ద గ్లాసుల్లో కాఫీ, రొట్టెలు తెచ్చి పెట్టింది. కొందరు సిగ రెట్లు జేబులలో వేశారు. ఒకరితో వకరు హాస్యాలాడు కుంటున్నారు. ఆనందంలోనూ ఆవేశంలోనూ మునిగి పోయారు.

ఆ ముగ్గురు జవాన్ల ధర్మమా అంటూ అప్పటి కాపేట వారు ప్రభుత్వాధికారుల నోడించారు — అసలా ముగ్గురు జవాన్లూ నిరుద్యోగులగు కూలీలు. కార్మిక సంఘాధికార్లు

వీరికి పని చూపించారు. ఈ పనేమిటో తెలియకుండా వచ్చారు పాపం వాళ్లు.

అసలే నిరుద్యోగం ఎక్కువగా ఉంటే, అందులో ఇచ్చిన పని చేయక పోవడంవల్ల కూలీల కెంతో నష్టం. ఈ విధంగా పని దొరకిన నిరుద్యోగులు ఆపనిని సరిగా చేయక పోతే వారికి నిరుద్యోగ భృతి కూడా ముట్టదు అంతస్తు మీద నిలబడిన వారికీ వ్యవహారంలో ఒక విశేషార్థం కనుపిస్తోంది. అందులో, యిళ్ళు ఖాళీ చేసి వెళ్ల వలసిందని నోటీసులు చాలా మందికి వంటింట్లో పడి ఉన్నాయి. యిప్పుడు వాళ్లంతా ఏకమై ఒక మాట మీద నిలబడాలి.

"అదుగో! అక్కున్నాడు" అంటూ, కిందకి దిగడానికి సంకోచిస్తూ నిలబడి ఉన్న స్థూలకాయునికి చూపించింది ఒక ఆమె.

అతని కేసి అందరూ తిరిగే సరికల్లా మళ్లీ ఏదో మూడిందిరా అనుకున్నాడు అమీనా. శాపనార్థాలు ప్రారంభ మయాయి. కామ్రేడ్స్! అనాలోచితంగా ప్రవర్తించకండి. శాంతంగా అతని వెళ్లనివ్వండి అంటూ అమీనా వెనుక నిల బడ్డాడు కార్మిక నాయకుడు. నిశ్శబ్దంగా కూలీలందరూ దారి చ్చారు. దించిన మోమెత్తకుండా మెరుపు తీగలా పరిగెత్తాడు క్రిందికి అమీనా అదే పనిగా చూస్తూన్న ఆ నేత్రాగ్నిని

చూడలేక పోయాడు. దొడ్లో పరుగెత్తుతోంటే అతని వెనుక పూల కుండీ ఒకటి పడి పగిలింది—పిల్లలు ఊరికే యీలలు వేశారు.

నెట్టెల్ బెక్ ప్లాజ్ చేరుకొన్నాక పోలీసు మొగాలు కొన్ని కనిపించాయి. అప్పుడు తాను పరుగెత్తుతూన్నట్లు స్మృతి వచ్చింది. ఎవరైనా చూస్తే ఏమనుకుంటారు? అమ్మయ్యా! ఇంక భయంలేదనుకొని స్థిమిత పడ్డాడు.

కార్మిక నాయకుడు మూడవ అంతస్థు లోని గదిలో ప్రవేశించాడు ఆ తలుపు మీద అతని పేరుంది. పేరు హెర్మన్ సూడరప్. అతను కమ్యూనిస్టు. ఆ వీధి కమ్యూనిస్టు సంఘపు రాజకీయ నాయకుడు అతను—

——

# ఆన్నా

"The Red Nightingale" "రెడ్ నైటింగేల్"

"హ్హీ.........ఫ్రిట్జి, పట్టుకో ఆ అమ్మాయిని."

"ఆ తలుపు మూసి వుంచు!"

"హా...హా...చూడు. ఆ అమ్మాయి స్టాకింగ్సులో చిల్లుంది."

"దొరికావులే ఇప్పుడు......అబ్బ. ఆ పిల్లల కుక్క రక్కింది. చేతి మీద ఎర్రగా చీరుకు పోయింది—"

"కుక్కా గీరుతుందే.........పిల్లిలాగ!" విరగబడి నవ్వాడు.

"అంతా మురికి పీనుగులే." అని వగరుస్తూ బొబ్బ పెట్టింది. ఆ అమ్మాయికి నిజంగా అమితంగా కోపం వచ్చింది.

"ఓ!......కోపం వస్తోందేమిటి......గ్రేటీ! నీ అందం పోయిం దనుకుంటున్నా వేమిటి?" అని అంటూ అక్కడే తుబుక్కున ఉమ్మేశా డొక తప్పడ ముక్కు కుర్రాడు—

"ఏ పిల్లతో నైనా కాస్త వేళా కోళం చేస్తే సరి ఆడ పిల్లలు ఉడుక్కుంటారు!"

ఆ అమ్మాయి బుస్సు మని లేచింది. "ఇక్కడ మన మంతా మెరుపు వేసేసుకునే వున్నా మను కుంటున్నారు.

ఆటో ఒక క్షణం లేక పోతే పాలో మంటూ వీధిని బడి అల్లరి మొదలు. ఇంకేమీ పని లేదు మీకు.........వెడ్డింగులో వున్న పిల్లలకూ తక్కిన వాళ్ళకీ ఎంతో వ్యత్యాసం వుంది రాజకీయంగా పని చేసే టప్పుడు ఎవళ్ళైనా అసహ్యంగా ప్రవర్తిస్తే వాళ్ళ బుర్రలు మళ్ళేదాక అవతలకు గెంటేస్తారు.

"చూడు. అమ్మాయి కేసి......శాంతించింది".

"నిన్న......గ్రెటీ!

"నన్ను ముట్టుకున్నా వంటేనా'

"శాంతిద్దూ గ్రేటీ! ఉడుకోత్కకు నీవు చెప్పింది నిజం మేము మాత్రం తెలివి తక్కువగా ప్రవర్తించా మని చెప్ప బోతున్నాను" అన్నాడు ఫ్రిట్జి. మందుతోన్న గీరు మరచి పోయి. బలవంతంగా పట్టుకొనేందుకు ప్రయత్నించి నందుకు చాల విచారించాడు—తక్కిన పిల్లలు చీకాకు పడి వాళ్లల్లో వాళ్లు గొణుక్కున్నారు.

కొలిన్‌స్ట్రాస్సీ లోని యువకు లంతా సాయంత్రం రెడ్ నైటింగల్ లో కలుసు కుంటూ ఉంటారు. మామూలు ప్రకారం యీరాత్రి కూడా పాక శాలిన గదుల్లో ఏదో జరుగు తోంది. తక్కిన పేటలలో కంటె రెడ్ నైటింగేలులో కూలీలకు స్పష్టమగు రాజకీయ వాతావరణం వుందని అను కుంటూ వుంటారు—ఇక్కడి కార్మిక సంఘం కమ్యూనిస్టుల

పలుకుబడిలో ఉంది. అక్కడుందరూ ఒకరి కొకరు పరిచయమే ఏదేనా కొత్త ముఖం కనిపిస్తే ఇట్టే పసి గట్టేస్తారు.

ఒక సారి కొందరు సి. ఐ. డీ. లు ఇక్కడ ఒక చోట కూర్చుని జేబులలో నుండి "రోట్‌ఫానీ" ప్రతిని అందరికీ కనుపించే లాగున తీసి చదవ నారంభించారు. కోలిన్ లో వారి నందరూ ఎరుగరు. ఎవరు ఎటువంటి వారో తెలుసు కొనుటకు వారి వారి ప్రవర్తనలే సాక్ష్యం. ఎల్లా కూచున్నా రో, ఎల్లా తాగుతున్నారో, మాటల తీరు వెర్రిదైనా చూచే సరి కల్లా పట్టేస్తారు అచటి కార్మికులు. కొత్త వారెంత తీయని కబుర్లు చెప్పినా, ఎంత కులాసాగా కూచుని ఆచోకీ తీసు కుందా మనుకున్నా వాళ్ళ వాసనే వాళ్ళని పట్టిచ్చింది. సీ. ఐ. డీలకు బుర్ర తక్కువైతే కూలీలకు తక్కువౌతుందా? కొలది కాలంలోనే వాళ్ళ నందరూ బహిష్కరించారు. వచ్చిన వారు వచ్చి నట్టుగా మొగాలు వ్రేలవేసుకొని వెళ్ళా రు. భేధాలు కల్పించే టందుకు యీలాగున చాల మంది వచ్చి పరాభవమంది పోయిరి- ఆప్రాంతానికి చెందని వారందరూ బయట నుండవలసిందే!

దిన పత్రికలు, సచిత్రపత్రికలు మొదలగు అనేక కమ్యూనిస్టు పత్రికలు గోడకు క్లిప్పులతో వ్రేలాడ గట్టారు. కార్మిక వ్యాయామ సంఘ సభ్యుల బొమ్మలున్న

నోటీసు బోర్డులు కూడా చాలనున్నవి. ఒక వైపున, రకరకపు మాంసపు కూరల పళ్ళెములు మేజా బల్ల మీద ఉన్నాయి. దాని వెనుక పెద్ద అద్దాల బీరువాలో గ్లాసులు, బీరు బుడ్లు, సిగరెట్లు, సారాయి వున్నాయి. ఇంకో చదరపు బీరువా మీద కల్లు సారాలు కలియని చల్లని పానీయాలున్నాయి.

'గ్లాసు=పది పెన్నీలు.

మేజాబల్ల వెనుక రెడ్ నైటింగేల్ యజమాని బ్లాక్ విల్లీ నిలబడ్డాడు. అతడు సాధువు. మంచివాడు. అప్పుడప్పుడు కాతాలు చాలా పెరిగినా, ఒత్తిడి చేయకుండా మరకల పద్దు పుస్తకములో వ్రాసు కుంటూ ఉండేవాడు.

రెడ్ నైటింగేల్ గ్రంథ్రగోళపు గుహ కాదు — ఏమి త్రాగినను, త్రాగక పోయినను డబ్బున్నను లేక పోయినను అక్కడ కూచొని అక్కడ జరిగే చర్చలలో పాల్గొన వచ్చును. ఏమీ లేక పోతే చదరంగం గాని, పేక గాని ఆడుకో వచ్చు—కాని కార్మికుల సభా ప్రదేశమగు రిట్జు లోనికి మాత్రం ఎవ్వరూ రాకూడదు—అది "ఎర్రసందు" (రెడ్ లేన్) లో నున్నది—ఆయింటి వెనుక భాగమున హాలులో యువకు లందరూ సమావేశ మౌతారు—అక్కడ సమావేశ మయ్యే వారంతా బూడిద వర్ణపు యూనిఫారములు వేస్తారు. వారు "రెడ్ ఫ్రంటు ఫైటర్సు లీగ్" జంగస్టరం సంఘం వారు—

(రెడ్ ఫ్రంటు సైనిక దళము) చర్చ తీవ్రంగా జరుగుతోంది. యువ జన నాయకుడు "ఆటో" వచ్చాడింతలో.

"కామ్రేడ్స్, అందరూ అల్లా అరుస్తూంటే ఎవరికీ విని పించదు" అంటూ గొంతెత్తి అరచాడొక యువకుడు. ఫ్రిట్జి అతని వైపు తిరిగాడు

"కాని ఆటో—అది చాలా అసహ్యంగా నున్నది. ఎగుమతి దిగుమతి కార్మికులు రెండు పర్యాయాలు ఏకగ్రీవ ముగా "మేడే" జరుపుటకు నిర్ణయింపగా ఏవిధముగా అతడు దానిని నిషేధింప గలిగాడు? రైళ్ళు ఆగిపోతే పనేమి సాగు తుంది బెర్లిన్‌లో?" అతని కామ్రేడ్సందరూ పకపకానవ్వారు—

"ఫ్రిట్జు! నీవు తెలివైనవాడవు కాదూ? ఫ్రిట్జు! పోలీసు ప్రెశిడెంటు ఈ విషయమింకా వినలేదు. కాబోలు" (ప్రతిధ్వనించేలా నవ్వులు)

"సద్దు! సద్దు! కామ్రేడ్సు" ఆటో పెద్ద గొంతుకతో అన్నాడు. "ఫ్రిట్జు మాట్లాడుతోంటే అర్థం లేకుండా నవ్వొయ్యకండి. కొంత వరకు అతడు సవ్యంగానే చెప్పాడు, బుధవారం నాడు రైళ్లు నడవక పోతే మనకు విజయమే! అది పరిస్థితులను తారుమారు చేసి యీనగరపు రూపే మారు స్తుంది—గౌరవనీయులగు ప్రజలు ఉదయాన్నే లేవగానే, ఏదో జరుగుతోందికదా అని తెలుసు కుంటారు. "మేదినోత్సవం

ఊరేగింపు మీద నిషేధపుటాజ్ఞ దాని మీదే ఆధారపడి వుండ కూడదు. ఎంత మంది సోషల్ డెమాక్రెటిక్ కార్మికులు వారి పోలీసు ప్రెశిడెంటు తన అభిప్రాయాన్ని మార్చు కుంటాడని భ్రమచెందు తున్నారో చూపుతాను—వినండి''

జేబులో నుండి ఒక పత్రిను దీసి విప్పి చదవసాగాడు ''మే దినోత్సవంలో కమ్యూనిస్టులే కాక ఇతరులు కూడా పాల్గొంటారని కామ్రేడ్ జార్జిబెల్‌కు తెలియదా! విశ్వాస పాత్రులైన మన పార్టీ కామ్రేడ్సంతా మే దినోత్సవ సందర్భంలో ఊరేగింపు జరిపే హక్కును కాపాడు కొనేందుకు సిద్ధంగా వుంటారని తెలియదా? మన పార్టీ యొక్క నలభై ఏళ్ళ సాంప్రదాయాన్ని యీనిషేధపుటుత్తరువు భంగపరచిందని గుర్తించకుండునా ? బల్గేరియా, జుగోస్లేవియాలలోని తెల్లదారుణ దౌర్జన్య పాలన వలెనే తన పాలనను కూడ లెక్కేస్తారనే విషయాన్ని తలపోయలేదా? జార్జిబెల్‌కు ఇంతకుమించిన నిర్బంధవిధాన మగుపడలేదా?''

ప్రేక్షకులంతా నిశ్శబ్దంగా వింటున్నారు — కొందరు ముందు గది నుండి వచ్చి గుమ్మంలో నిలబడి వింటున్నారు— ఆపత్రిక అందరికీ కనపడేలాగున ఎత్తి పట్టుకున్నాడు ఆటో.

''అది వ్రాసిందెవరు? ప్రావెర్టాలో సోషల్ డెమాక్రటిక్ పత్రికేనా?''

ఫ్రిట్జు విజయ సూచకంగా కలయచూశాడు—అసలు కధ అదీ "నేను చెప్పలేదా?" ఆటో నవ్వాడు.

"ఒక్క నిమిషం ఫ్రిట్జు! అంత తొందరా? నిజమే సోషల్ డెమాక్రెటిక్ పార్టీకి చెందినచాలమంది సభ్యులు ఆవిధంగానే అనుకుంటారు. కాని కామ్రేడ్ పోలీసు ప్రెశిడెంటు వీళ్ళని లెఖ్కచేస్తాడనుకుంటే మనకంటె బుద్ధిహీనులుండరు. ఈఅతివాద సో. డె. పార్టీ పత్రికలు అన్నీ ఈనిషేధమొక అసహ్యమైన పన్నాగంగా భావిస్తూ ఉండడంచేత అల్లా వ్రాశాయి, నిజమే! కాని యీవిధంగా చేయడంలో వ్యతిరేక వ్యాఖ్యానమంతా వారి శ్రేణిని దాటి బయట పడకుండా చూస్తారు. అతివాద సోషల్ డెమాక్రాట్ల ఉద్యోగమిదే, ఈఅతివాదులు బుధవారంనాడు సిసలైన పార్టీ సభ్యులవలె ఉత్సవం జరిపే హక్కును నిలబెట్టుకొంటారో! అధికారుల కప్పజెపుతారో చూద్దాం! "ఈకళ్ళకీరెప్పలు దూరమవుతాయా?"

"కంస్టైరును మధ్య నుంచోబెడదాం" అని ఒక కార్మికుడు నవ్వాడు.

"కామ్రేడ్సు!" ఆటో ప్రారంభించాడు. "ఈపరిస్థితులలో సోషల్ డెమాక్రెట్టులు గాని ప్రభుత్వం గాని కమ్యూనిస్టు విప్లవ స్వభావంతో కూడుకొన్న ప్రజాసామాన్యపు

ప్రదర్శనాలను నేటినీ జరుగనివ్వరు. వాళ్ళు నిషేధించేందుకు కారణం అదే. ఆ ఆజ్ఞను వాళ్ళు తొలగించరు-"

ఇప్పటికీ ఫ్రిట్జు ఒప్పుకో లేదు. తక్కినవారందరూ మాత్రము అంగీకరించారు ఆటోతో.'

ఒక సో. డె. పార్టీ పత్రిక ఆవిధంగా వ్రాయడంలో చాలా అర్థం ఉందనుకొన్నాడు ఫ్రిట్జు. ఆనిషేధపుటాజ్ఞ తొల గిస్తారని దృఢంగా నమ్మాడు ఫ్రిట్జు. దాన్ని గూర్చి పార్టీ శల్లు నాయకుడైన హెర్మన్‌తో మాట్లాడేందుకు నిశ్చయించుకొన్నాడు. "నైటింగేల్"వద్ద ఆవీధి శల్లు మీటింగు ఒకటి జరుగుతుంది. హెర్మన్ కొత్త విషయాలేమన్నా చెప్ప వచ్చు.

హఠాత్తుగా తలుపు త్రోసి తెరచుకొని ఒక బాలిక పరిగెత్తుకొచ్చింది. ఆమె కోటు మీద 'యువ జన కమ్యూనిస్టు సంఘం' అని పేరున్న బాడ్జి ఉంది.

"ఆటో!......" అని తలుపు దగ్గర నుంచే అరచింది.

"బాడ్‌స్టాసీలో మన వాళ్ళని ముగ్గుర్ని నాజీ లెదుర్కొని దెబ్బలాడుతున్నారు వాళ్ళని రక్షించేందుకు పరుగెత్తండి" అంది.

ఈమధ్యని ఇట్టి సంఘటనలు చాలా జోరయ్యాయి వెడ్డింగ్ స్టాసీని దౌర్జన్య పద్ధతులతో హాడల కొట్టాలనే స్థిర

సంకల్పంతో కార్మికుల మీద పడి నాజీలు కొట్టడ మారం భించారు.

ఆఖాళీ గదిలో బ్లాక్‌విల్లీ వెనుక తట్టుకువెళ్ళి కిటికీ తలుపు తెరిచాడు. కుర్చీలు ముందుకు నెట్టి సర్దుతూ "ఫ్యాక్టరీ గొట్టాల లాగ పొగ ఊదుతూనే ఉంటారు" అంటూ సిగరెట్టు కొడి రాల్చే డబ్బాలన్నీ బాగు చేశాడు.

ముందు గదిలో కొందరు పెద్ద కార్మికులుకూడున్నారు. వారిలో "రబ్నరు" 60 వ పడి దాటినా వీధి శల్లులో చాల వుత్సాహంగా పని చేస్తున్నాడు. తల నెరసింది—నీలపు టోపీ పెడతాడు. వడలంతా ముడతలు పడి పాలి పోయింది. అతని కొడుకు ఒక సంవత్సరం నుండి నిర్వ్యాపారి. నలుగురు మనుమలున్నారు. పిల్లలకు కడుపు నిండా తిండి పెడుతూ తాను మాడుతున్నాడు. ఆకలికి పిల్లలు ఆగలేరు రక్త మాంసాలు నశించాయి, ఎముకలు బయట పడ్డాయి. అతను కర్ర మీద ఆనుకొని హోటలు యజమాని విల్లీ వైపు చూస్తున్నాడు విల్లీ మేజా బల్ల తుడుస్తున్నాడు.

"విల్లీ! యీవిషయాన్ని గూర్చి నీఅభిప్రాయమేమిటి?" హబ్నరు ఇంకా ఏమన్నా చెపుతాడేమో నని రెండు నిమిషాలాగి విల్లీ అన్నాడు "బాగుంది హబ్నరు బాబూ! ఇది అంత సులభం కాదు. బుధవారం నాడు రక్తం ప్రవహించి

దంటే పైనకూర్చున్న అధికారులకు తగినట్టే వుంటుంది. లేక పోతే వారు ఏవుద్దేశ్యంతో నిషేధించారు?"

హుబ్నరు తలపంకించి "కాదు. కాదు. నేనింకా నమ్మలేకుండా ఉన్నాను. నా జీవితంలో నేను కార్మిక సంఘంలో జేరిన నలభై ఏళ్లనుంచీ ప్రతి మే డే వుత్సవంలోనూ యీ వీధుల వెంబడి తిరిగాను. విల్లీ! మొట్టమొదటి సారి 1890 లో బెర్లిన్‌లో యిక్కడే ఎర్రబావుటాలు పట్టుకొని సుత్తి కొడవలి బిళ్లలు తగుల్చుకొని గొప్ప వుత్సవం జరిపాము. మే. డే. ఊరేగింపులు చూచి హడలి పోయి వాళ్లు బెర్లిన్ యజమానుల సంఘం పెట్టుకొన్నారు. పోలీసులు మనకి వ్యతిరేకంగా కత్తులు దూసి నందుకు పోలీసులు చేసిన సేవకుగాను వీళ్లు 3000 మార్కులు బహుమాన మిచ్చారు. కాని అది ఏమీ లాభం లేక పోయింది—

ఏమో ఆలోచిస్తూ ఒక క్షణం వూరుకొని "విల్లీ!... బుధవారం నాడు బెర్లిన్ ప్రెసిడెంటు చేసిన సేవకు కూడా ఏమైనా యిస్తారంటావా?" అని గది మధ్య తుపుక్కున ఉమ్మేశాడు. అతను ఈపని యిది వరకెప్పుడూ చేయలేదు. చేతులు వణికాయి. చేతినున్న కర్ర పిడి గట్టిగా నొక్కేస్తున్నాడు. "కాని, విల్లీ! నేనింటి దగ్గర వుండను" అన్నాడు మారి పోయిన గొంతుకతో కొంచెము భారకింపుగా వుండడం

చేత. రెండు డబ్బు లాకేబిలు మీాద పడేసి వెళ్లి పోయాడు మళ్లీ మాట్లాడకుండా. "హారి!" బ్లాక్ విల్లీ ఆశ్చర్యంగా ముసల్ాణ్ణి చూసి యీముసలివాణ్ణి ఎప్పుడూ ఇల్లా చూడలేను. ఆఁ! జర్మనీ మధ్య ప్రాంతాలలో 1921 లోని తిరుగుబాటును రక్తపు చేతులతో ముంచెత్తిన తరువాత సోషల్ డెమాక్రేటిక్ పార్టీని వదలి కమ్యూనిస్టు పార్టీలో చేరాడు. మే 1వ తేదీ ఉత్సవంలో పాల్గొన్న వారికి పోలీసుదౌర్జన్యాన్ని ప్రసాదించే పార్టీలో 32 ఏళ్లు సభ్యుడుగా వుండడం సామాన్య విషయం కాదు." చేతి లోని గుడ్డను మేజా క్రిందకి విసరి, "వెధవ పందులు......!" అని గొణిగి చిన్న హాలును సభకు రెడీ చేయడానికి లోపలి కెళ్లాడు.

## 145 వీధిశల్లు.

ఎనిమిదయింది. క్రమంగా ఒకరి తరువాత ఒకరు చిన్న హాలులో ప్రవేశించారు. మొత్తము మీాద వారందరు కార్మికులు. స్త్రీలు పురుషులు కూడ చాలా అనుభవజ్ఞులయినా, గుడ్డలు మాత్రం చింకిరివే! ఉదయాన జరిగిన అమీానా తంతు, జబ్బుపిల్ల స్థితి యింకా అనేక విషయాలను గూర్చి ఒకరితో ఒకరు మాట్లాడుకొంటున్నారు. ఒకరి కష్టాలు యింకొకరు ఎరుగుదురు.

తలుపు తెరచుకొని హెర్మన్ కరపత్రాల కట్ట ఒకటి చంకను పెట్టుకొని లోపలికి వచ్చాడు. హుషారుగా శాల్యూటు చేశాడు. "బాగుంది హెర్మన్! విశేషాలేమిటి?" యీ ప్రశ్న అందరికీ పరిపాటయింది. వాతావరణమంతా మారు మ్రోగుతోంది కార్మిక మారకపు కార్యాలయాల వద్ద, ఫ్యాక్టరీల లోను, ఒకటేమిటి ట్రాములలోను ఎక్కడ పడితే అక్కడే చోద్యమయిన వదంతులు. స్నేహితులో, శత్రువులో, ఏజంటు ప్రోవకేటరులో—ఏమీ తెలియటం లేదు. బుధవారంనాడు సైన్యం జోక్యం కలుగజేసుకుంటుందని పుకారు పడిపోయింది. వీధిపోరాటాన్ని గురించి పోలీసు ప్రెశిడెంటు ఒక ఆర్డరు యిచ్చాడు. తప్పక మే 1 వ తేదీని నిషేధము తొలగిస్తారు. రీచ్ బేనర్, స్టాలుహెల్మ్‌లను తీసుకొని వస్తారు మొదలగు పుకారులకు అంతూ ధరీ ఉండటము లేదు. టెంపో వార్వర్ట్స మొదలగు బూర్జువా పత్రికలు కడుపులు మండేటట్టి శీర్షికలతో బెర్లిన్ నగరాన్ని కలవరపెడుతున్నాయి. ఇందులో కల్లయేదో, నిజముయేదో, మతిపోతోంది అందరికి.

హెర్మన్ కరపత్రాల కట్ట బల్లమీద పెట్టాడు! "కామ్రేడ్స్! అధైర్యపడకండి. వార్తలు యిక్కడ వున్నాయి. బ్రోలాటు (కార్మిక సంఘ ఉద్యోగి) రవాణా కార్మికులను మే, డే. ఊరేగింపులో పాల్గో వద్దంటూ నిషేధించాడు. ఇవి చివరను తెలిసిన వార్తలు."

"ఏమిటీ? నిజమే?"

"వార్వర్ట్సు సాయంకాలపు పత్రిక యీవిధంగా వ్రాస్తే అది నిజమయి తీరాలి." అన్నాడు హెర్మన్.

"దుర్మార్గుడు సిగ్గు లేదు. వెడ్డింగు మేయరు అవుదామని ఉందిట!"

"చర్చ తీవ్రమయి పోయింది. యిల్లా చేద్దామనుకుంటున్నారేం వారు! రవాణా కూలీలు ఏమంటారు దీనికి? యిది ఎన్నాళ్ళనుంచి? సోషల్ డెమాక్రేటు నని చెప్పుకుంటాడు. ఏం సోషలిష్టండీ! ఈ సో. డే పార్టీ అధికారులు ఎందుకు మునిసిపల్ డైరక్టర్ల పదవి స్వీకరించాలి?

రవాణా కూలీలు పని ఆపుతే బెర్లిన్‌లో అక్కడ వస్తువు యిక్కడికి రాదు. ఆకూలీలు నిర్ణయించుకున్నట్లు మేడే ప్రారేగింపు జరుగకుండా ఆపు చేద్దామని కార్మిక సంఘ యజమానులు, యజమానులకు సాయముచేద్దామని జోక్యం కలుగజేసుకొన్నారు. కూలీలు ఆపని చేయకుండా చేయాలని చూస్తున్నాడు బ్రోలాట్. మెజారిటీ నిర్ణయాన్ని సంఘాధికారుల పూర్తిగా ధిక్కరించడం అన్నమాటే. అంతా స్పష్టంగా అర్థమావుతోంది.

నాజీలను తరిమివేసి కమ్యూనిష్టు యువకులు కొందరు తిరిగివచ్చారు. ఆసమూహంలో నుండి ఫ్రిట్జి తోసు

కుంటూ వెళ్లాడు. ఉద్రేకంతో అతని ముఖం కందిపోయింది. హెర్మన్‌ను పలకరించాడు. దేన్ని గురించి అయినా కలవరము కలిగితే యీయువకుడు హెర్మన్ దగ్గరకు వస్తూండే వాడు. యితన్ని బాగా ఎరుగును.

"గుడ్ యీవినింగు కామ్రేడ్ హెర్మన్! బాగుంది. మీ ఉద్దేశమేమిటీ? నిషేధం తొలగిస్తారని ఒప్పుకుంటారా? ఆటో దగ్గర సోషల్ డే. పత్రిక ఉంది. దాంట్లో వాళ్ల కామ్రేడ్ జార్జి బెల్ ఏం ఉపద్రవము తెస్తాడో నని కంగారు పడుతున్నారు."

"అమాయకుడా! తొందర పడకు చూస్తూండూ. బుధవారము నాడు మ॥ రా॥ రా॥ శ్రీ పోలీసు ప్రెసిడెంటు గారు ఎర్ర బిళ్ల తగిలించుకొని అంతర్జాతీయ గీతం పాడుతూ వీధుల వెంట ఊరేగింపు లోకివస్తాడట అని పరిహాసంగా అన్నాడు హెర్మన్."

కార్మికులు పక్కున నవ్వారు. ఫ్రిట్జి చిన్న బోయి నిలబడ్డాడు. హఠాత్తుగా గ్రీటీ ఎదుటకి వచ్చి నిలబడింది. మొగంలో కోపం కని పిస్తూంది.

"ఈపాటి దానికి సీదాకా ఎందుకయ్యా రావడం పెద్ద రాజకీయ నాయకుడవు. రాజకీయ చైతన్యం బాగా సంపాదించుకోవాలని, యువ కమ్యూనిష్టులకి ఉపన్యాసా లిస్తావు.

ఏవరైనా నోరు తెరచి అడిగితే కొంకి నక్క సమాధానాలు యిస్తావు. ఇల్లాగేనా కామ్రేడ్స్‌తో మాట్లాడటం?" అంది హెర్మన్‌తో కోపంగా. హెర్మన్ నోరు మెదపలేక పోయాడు. గిర్రున వెనుకకు తిరిగి ఫ్రిట్జి చేయి పట్టుకొని అవతలకు తీసుకొని పోయింది.

"ఏమీ అనుకోకు ఫ్రిట్జి. నామాటలు పక్కలో మెదులుతూంటాయిలే! హెర్మన్‌కు.

వారు చినుకులడుతూన్నా చీకట్లో నడిచి యింటికి పోయారు.

గది అంతా నిశ్శబ్దంగా వుంది. అత్యవసర విషయాలు చర్చించాలని అందరూ ఎరుగుదురు. శెల్లునాయకుడి పక్కనే ముప్పది ఏళ్ళ యువకుడొకడు కూచున్నాడు. యీాయన జిల్లా పార్టీ ప్రతినిధి. చర్చ సాగించే టందుకు జిల్లా పార్టీ యీాయనను పంపింది. హాజరయిన సభ్యుల నందరను పరిశీలిస్తూన్నాడు- గోడ మీాద బొగ్గుతో గీసిన లీబ్నెట్, రోజాలగ్జెంబర్గు బొమ్మలు, లెనిన్ బొమ్మా వున్నాయి- ఆబొమ్మ లొక కార్మికుడు వేశాడు. గదినిండా కాగితపు తోరణా లున్నాయి. బూజుమాత్రం పట్టాయి. ఆగది వాలకానికి అక్కడ జరుగ బోయే గంభీరమగు వ్యవహారిక మీాటింగుకూ ఏమీా పోలిక లేదు.

పియానో పైన ఒక అట్ట మీాద నోటీసొకటి ఉంది. "ఆదివారం సాయంకాల నాట్యం. టిక్కట్టు లేదు."

స్త్రీలు, పురుషులు మొత్తం 46 మంది హాజరయ్యారు కోలిన్ వీధి శల్లు. కూలీలు కొందరింకా పని దుస్తులు వదల లేదు పనిముట్లూ కూడా దగ్గిరే ఉన్నాయి కొందరికి. దిన దిన ఆదుర్దాలు, మొదటినుండి పడ్డపాటు, పాలిపోయిన ముఖా లలో తాండవ మాడుతున్నాయి ఇవి పీడితవర్గానికి యూనిఫారము.

హెర్మన్ లేచాడు.

"కామ్రేడ్స్! సభ ప్రారంభిద్దాం విషయాలివి. కార్మిక సంఘాలు మే. ది నోత్సవము" 2 మే డే. కి సన్నాహం. సభ అయిపోయిన తర్వాత జట్టు నాయకులు, కోశాధి పతులు కొన్ని నిమిషా లాగవలసినదని కోరుతున్నాను. ఇప్పుడింక జిల్లాపార్టీ ప్రతినిధి మాట్లాడుతారు. సభ అయి పోయేవరకు ఎవరూ వెళ్లవద్దు." ప్రతినిధి లేచాడు. అందరూ అతనికేసి తిరిగారు. ఎదురు టేబిల్ మీాద, నోట్సు కాగి తాలు కొన్ని, పేపరు కట్టింగులు కొన్ని ఉన్నాయి. వాటి మీాద కుడి చేయి ఆనుకొని "మనం సంపూర్ణంగా చర్చించు కొనే టందుకు ముందు కొన్ని నిమషాలు మాట్లాడుతాను." ఉపన్యాసం జోరుగా లేక పోయినా స్పష్టంగా వుంది.

అందరికీ అర్థమవుతోంది. ఉపన్యాస మిస్తూన్నంత సేపూ రెండవ చేతితో కళ్లజోడు సద్దుకొంటూనే ఉన్నాడు—

"గతవారాలలో జరిగిన ఘటనలను పరిశీలిస్తే ఇది వరకటి కంటె ఇప్పుడు బలముగు రెండు వర్గ శక్తుల మధ్య తగాదా సంకులమయి అవి ఢీకొంటున్నాయని స్పష్టంగా కనిపిస్తోంది గతవసంతకాలములో జరిగిన ఫ్యాక్టరీ కౌన్సిలు ఎన్నికలతో యీకొత్తమార్పు ప్రారంభమైనది. కమ్యూనిస్టు పార్టీకిని, కార్మిక సంఘాలలోని విప్లవాదులగు ప్రతిపక్షులకు జర్మనీ అంతటా బ్రహ్మాండమగు పోటీ జరిగింది. పెద్ద ఫ్యాక్టరీ లన్నిటిలోనూ- రూర్‌సీమెను ప్రాంతమందలి గనులు, లోహాలు కరిగించే కర్మాగారంలోనూ; ఎ. ఇ. జి. లో, బెర్లిన్ లోని ఎగుమతి దిగుమతి (రవానా) కార్మిక సంఘమందును, లూనా వర్క్సులో, రసాయనిక పరిశ్రమాలయములలోను, ఇంకా, బ్లోమ్‌లోని నౌకా పరిశ్రమయందును, హాంబర్గులోని వాస్, కీల్ లోని డాల్ (రేవు) పని వారలలోను మొదలగు ఇంకా అనేక ప్రదేశాలందు కమ్యూనిస్టులకు దేదీప్యమాన మగు విజయం కలిగింది. సంస్కరణవాదులు మళ్ళీ లేవ లేకుండా పడిపోయారు.

ఎవరో హడావిడిగా లోపలికి వస్తూంటే ఒక క్షణ మాగి మళ్ళీ ప్రారంభించాడు.

"కామ్రేడ్స్! మేదినోత్సవ ప్రదర్శనాలపై నిషేధానికి యీ ఫ్యాక్టరీ కౌన్సిలు ఎన్నికలకు ప్రత్యక్షమగు సంబంధ మున్నది——"

"కామ్రేడ్ జార్జిబెల్ కింత సాహసానికి కారణం అసలు లోపలున్న భయభ్రాంతి" అని రోట్‌ఫానీ వ్రాసిన వ్రాతలు నిజమే నని ఒక బూర్జువా పత్రిక సత్యాన్ని ప్రకటించింది.

"ముమ్మాటికీని" అని వెనుకనుండి ఒక యువతి అరచింది—అందరూ వెనక్కి తిరిగారు. ఆమె శాలువా సద్దుకుంటూన్నట్లు నటించింది.

"అవును. అది వాస్తవమే" అని ఆమె గొణుక్కుంటూ కంపించింది. హెర్మన్ గ్లాసు మోగించాడు

"ఈసందర్భములో కార్మిక సంఘనాయకులు కార్మిక వర్గ విరోధుల శిబిరములో చేరి ఏం చేస్తున్నారో మనము చూడాలి. అంతర్జాతీయ కార్మిక కాంగ్రెసు 1889 లో పారిస్‌లో సమావేశమై మేదినోత్సవం జరపాలని నిర్ణయించింది లగాయితు నేటివరకు జర్మనీలో జరుగుతూనే వుంది. ప్రథమమున బెర్లిన్ కార్మికులే 1890 లో జరిపేందుకు ప్రచారం చేయసాగారు. మార్చి నెలాఖరుకే వాక్సుబ్రెబ్యూన్ వాక్సుబ్లాటు పత్రికలలో అన్ని కార్మిక సంఘాలు కలసి ఒక కరపత్రం ప్రకటించారు. "మే 1 వ తేదీని పారిశ్రామిక నగరా

లన్నిటిలోను కార్మిక వర్గానికి: సెలవు. దినంగాను, రోజునకు 8 గంటలపని ఉండాలని నినాదముతోను. ఆదినము పనిమాని పెద్ద పెద్ద ప్రదర్శనాలు జరిపేందుకు నిర్ణయించు కున్నారు." ఎన్ని ఆటంకాలు కలిగినా లెఖచేయకుండా నేటివరకు మే. డే. జరుపుతున్నారు కార్మికలు. మొట్ట మొదట మే. డే. నే బెర్లిన్ లో మహపరిశ్రమలో తగాదా బయలు దేరింది. అచ్చు పనివాండ్ర నందరిని జెయిళ్లలో పెట్టారు. తక్కువ గంటలపని నిశ్చిత కనీసపు కూలి యివి వారి కోర్కెలు. 1896 లో మే. డే. ఫలితంగా యజమానులకు, కూలీ, సంఘాలకు 26 వారములు తగాదా జరిగింది: అప్పటికి రెండేండ్లు ముందుగా బెర్లిన్ కార్మికసంఘాలు తమ కోర్కెలను నెరవేర్చుకొనేం దుకు మే. డే. ని సుప్రసిద్ధమయిన "బీర్ బహిష్కరణ" ప్రారంభించాయి. కామ్రేడ్స్! ఆరోజుల్లో మే. డే ఎప్పుడూ పోరాట దినంగానే ఉండేది. యిక బెర్లిన్ సంగతి చెప్పాలా?

అడుగు వెనక్కేసి ఎలుగెత్తి "1903 లోనే మీాకందరకు బాగా తెలిసిన "కోర్" బహిరంగంగా మెటల్ కార్మికుల కాంగ్రెసులో మే దినోత్సవం ఊరేగింపులు మాని వేయాలసివస్తుందని చెప్పాడు. ఆతర్వాత చర్చలలో మే. డే. నాడు ప్రదర్శనాలకై పని మానెయ్యకూడదని సంస్కరణ వాదులు బహిరంగంగా ప్రతిఘటిస్తూ వచ్చారు. సో. డె. పార్టీ

లోని మితవాదాన్ని సరిదిద్దే ప్రయత్నంలో రోజాలగ్జెంబర్గ మే. దినోత్సవాన్ని ఉదాహరణంగా తీసుకొని కార్మిక సంఘ నాయకవర్గం ఏవిధంగా దుఃఖకరమగు సంస్కరణమార్గాలలో పడిపోతోందో పదే పదే చూపుచుండెడిది — జనరల్ స్ట్రైక్ విషయమై సాగిన తీవ్ర చర్చలతోబాటు యీచర్యలు కూడ ఏక కాలమందు సంభవించడం దైవికంగాదు. పది సంవత్స రాలనుండి యీరెండు పక్షాలవారి పంథాలు భేదిస్తున్నాయి. తుదకు 34 మే. దినోత్సవాలను పోరాట దినాలుగా శ్రామిక వర్గం జరిపినా "యుద్ధం నశించాలి! ప్రపంచమానవులారా! లేవండి" అని కారల్ లీబ్నెట్ గర్జించేసరికల్లా దీనిని లెక్కించ కుండా సమరోన్మత్తతలో గర్భశత్రువులుగా మారిపోయారు.

ప్రపంచ యుద్ధానంతరం మే. దినోత్సవాలు ధర్మ బద్ధమై పోయాయి. కైజరు వంటి వాడి వద్ద నుండి బలవం తంగా సంపాదించుకొన్న ఒక హక్కును ప్రజాతంత్రములో కార్మికులు వదులుకుంటారా? నిజానికి జరుగుతోన్నదేమిటి? సోషల్ డెమాక్రేట్లు ప్రభుత్వ యంత్రములోను, పెట్టుబడిదారీ ప్రజాస్వామికంలోనూ ఒక భాగమై పోయారు. రాజకీయ తిరుగుబాట్లు ప్రారంభమయినపుడు యీ సోషల్ డెమోక్రేట్లు నాస్కీ బ్లాక్ రీచ్ స్వేరులతో కలసి కార్మికుల తిరుగుబాటును రక్తపు టేరులలో ముంచెత్తారు. జర్మన్ పరిశ్రమల పునర్ని

ర్మాణ సమయంలో యీపార్టీయే పోలీసు పని తీసుకొని కార్మికులను అణగద్రొక్కి యజమానులస్థితిని బలపరచింది. యుద్ధానంతరం కార్మికులు సంపాదించుకొన్న ప్రతిహక్కును రద్దుచేసి లా అండ్ ఆర్డరు కాపాడేపని అంతా సో. డే. పార్టీకే; పెట్టుబడిదారీ వర్గం వదిలేసిందని యుద్ధానంతర ఘటనలు చూస్తే రుజువవుతుంది. అవి అర్థం చేసుకొన్న ప్రతివ్యక్తి నాతో అంగీకరించి తీరుతాడు. అదంతా ఎందుకు? ఎనిమిదిగంటల శాసనాన్ని రద్దు చేసిన ఎబర్టుశాసనాన్ని జ్ఞాపకం చేసుకోండి. యుద్ధానికి పూర్వము పెట్టుబడిదారీ వర్గానికి ఏచక్రవర్తి కూడ చేయనంత సహాయం చేశాడు ఎబర్టు! వేయేల అతడు దాని జీవితాన్నే రక్షించాడు. అదేకాదు. హిండెన్‌బర్గులాంటివాడిని ప్రశిడెంటుగా ఎన్నుకొన్నారు!

ఈ సంవత్సరాలలో కార్మికసంఘాలు బాగా వ్యాప్తమయ్యాయి. బహుళ సంఖ్యాక ప్రజాసంఘాలుగా నున్నాయి వాటినాయకత్వము సంస్కరణవాదులగు సోషల్ డెమాక్రటిక్ అధికారవర్గపు చేతియందున్నది. వారా సంఘాలను తమ తమ పనిముట్లుగా వుపయోగించుకొనజొచ్చిరి—వీరు పెట్టుబడిదారీ వర్గపు ప్రజాస్వామికమందు ప్రభుత్వ పదవులను స్వీకరించి పెట్టుబడిదారీ విధానాన్ని శాశ్వతముగా నిలబెట్టుటకు బాధ్యత వహించారు ఈకార్మికవర్గపు గర్భశత్రువుల నాయ

కులు! సేవకుల స్థానములనుండి ప్రభుత్వాలయాలలోకి సో. డె. పార్టీ సభ్యులు ప్రవేశించేందుకు ఈనాడు అవకాశాన్ని పెట్టుబడిదార్లు కల్పించారు. కాని, అదును చూచుకొని, యీవర్గపు బూటక ప్రతిఘటనల చాటున తన నియంతృత్వాన్ని స్థాపించుకొనుటకు పెట్టుబడిదారీవర్గము, వీరికి ఉద్వాసన చెప్తుంది. సో. డె. పార్టీలో మూడవవంతు పైగా సభ్యులున్నూ, నాయకులున్నూ, ప్రభుత్వోద్యోగాలలోనుండి వారి సొమ్ము తింటూ పెట్టుబడిదారీవిధానానికి పెనవేసుకు పోయారు. గనుక, వారి పార్టీ యింకెన్నటికి తిరిగి కార్మిక వర్గపు పార్టీ కాలేదు. తామున్న స్థానప్రభావాన్ని బట్టి, "కూడు పడ గొట్టుట, కడుపు మాడ్చుట, మొదలగు ప్రభువుల కృత్యాలను" అమలు జరుపవలసివచ్చింది. ఈ సందర్భంలో సంస్కరణవాదుల స్వాధీనమందున్న కార్మిక సంఘాలెట్లున్నవో గమనించి తీరాలి. సో. డె. పార్టీ నాయకులు కార్మికులకు వ్యతిరేకంగా సిగ్గుచేటైన పనులు చేస్తున్నారు. ఇదిగో ఈ కరపత్రాన్ని చూడండి అంతా తెలిసిపోతుంది."

బల్లమీదనున్న జైపు చేసిన కాగితాన్ని చూపించి చదివాడు.

"మొన్న ఈమధ్య జరిగిన ఫ్యాక్టరీకౌన్సిలు ఎన్నికలలో, అందులోనూ ముఖ్యంగా పెద్ద పెద్ద కర్మాగారాలన్నిటి

లోనూ విజయం కలిగినందుకు కమ్యూనిస్టులకు గర్వము ఎక్కువై పోయింది. వారి పత్రికలన్నీ అందులోనూ ముఖ్యంగా "రోట్‌ఫానీ," ఈ విజయాన్ని ఉపయోగించుకొని వారి పలుకుబడిని వ్యాప్తం చేయాలని చూస్తోంది. ఈ పత్రికల వ్రాతలకు వ్యతిరేకంగా వ్రాసేందుకు నమ్మకము కల్గించే విషయాలను కార్మిక సంఘాల ద్వారా మాకు సప్లయి చేయించవలసినదని మమ్ము సో. డెమాక్రేట్లు కోరిరి. అందుచే మీరందరు ఆవిధముగా చేయవలసినది" అనిచదివి యీవుత్తరాన్ని A. D. G. B. అఖిల జర్మనీ కార్మిక సంఘాధికార్లు సోషలె డెమాక్రటిక్ దృక్పథమున్న అన్ని కార్మిక సంఘాలకూ పంపిరి." అని చెప్పి వుత్తరాన్ని బల్ల మీద పడ వేశాడు.

"సిగ్గు సిగ్గు" అని ఆవేశంతో అరిచాడు కర్టు. "ద్రోహులు! తల్లికి మొగుళ్ళు!" అన్నాడింకొకడు—"ఇందుకేనా! మనం చందాలు చెల్లిస్తూన్నది?"

"పై పెచ్చు కార్మికులను చీలగొట్టు తున్నారని కమ్యూనిస్టులపై నీలాప నిందలు వేసి వారిని రొష్టుపెడతారా! బాగుంది వరస"

"ఇదీ! ఈనాడు స్వతంత్ర కార్మిక సంఘాల వరస!" అన్నాడు ఉపన్యాసకుడు.

"ఈ చండాలురికి ఇకమీద ఒకదమ్మిడీ అయినా యివ్వకూడదు" అంది శాలువా కప్పుకొన్న స్త్రీ.

"అల్లా చేయడం సుద్ధ తప్పు అల్లా. చేయడంవల్ల యిదివరకు మనమిచ్చినడబ్బును చీకూ చింతా లేకుండా, యిష్టము వచ్చినట్లు వయోగిస్తారు"

"నిజమే! నిజమే!" అని సభలోంచి అన్నారు—"యీ నాయకులు కార్మికవర్గానికి చేసే ద్రోహాన్ని తెలుసుకోలేకున్న లక్షలాది కార్మిక సంఘసభ్యులను వారి చెప్పు చేతలలోనుంచి మీమట్టుకు మీరు తప్పుకుంటారా? అల్లెన్నడూ చేయరాదు. నేటినుండీ మే 1 వ తేదీ లోపుగా సా. డె. కార్మికులకును, చెల్లాచెదరుగా నున్న కార్మికులకును ఫాక్టరీలలో టాక్రిములలో, వీధులలో, ఇంకా ఎక్కడ వీల యితే అక్కడ సభలద్వారా చర్చలద్వారా, ఇందలి రహస్యాన్ని బయట పెట్టి, ఇనాళ్లవరకు మే. డే. ప్రదర్శనాలు జరిపిన బెర్లిన్ కార్మికసంఘాలు "ఈనాడు ఏవుద్దేశ్యంతో తమ మే. డే. ప్రకటనలో "మే. డే నాడు ప్రదర్శనాలు చేయవలసినదని భాధ్యతలేని పార్టీలే అంటాయి. ఒక్క కార్మిక సంఘీయుడు కూడా అందుపాల్గొనడు!" అని ప్రకటించారో! అందలి రహస్యాన్ని బట్టబయలు చేస్తూ శాయశక్తులా పని చేయాలి—" అన్నాడు—

"వాళ్ళే చూస్తారు! మేంచూపిస్తాం!"

సభికులకు ఆవేశం ఆగలేదు. గంద్రగోళం ప్రారంభ మయింది. ఒకరితో ఒకరు చర్చలు మొదలెట్టారు. మీటింగు సంగతి మరచిపోయి, తలుపు దగ్గర ఒకముఠా చేరి జోరుగా చర్చిస్తున్నారు.

హెర్మన్ గ్లాసు వాయించాడు.

"కామ్రేడ్స్! ఇల్లా అయితే కార్యక్రమం కొనసాగించ లేము. నిశ్శబ్దంగా వుండాలి. ఎవరికైనా మాట్లాడాలని వుంటే పేరివ్వండి. ఈఉపన్యాసమయిన తరువాత మాట్లాడ వచ్చు." అన్నాడు హెర్మన్- కొందరు నవ్వారు. సభ నిశ్శబ్దంగా వుంది—

"కామ్రేడ్స్! నావుపన్యాసం పూర్తి అవుతోంది- గత సంవత్సరం మే. డే ప్రదర్శనాలలో కార్మికులంతా విప్లవవా దులు చెప్పినట్లు చేశారు. మాపలుకుబడి క్రింద అది రాజకీయ ప్రజా విప్లవకార్యాచరణగా మారింది. అది చూచేసరికి సో. డె. పార్టీ నాయకుల కళ్ళు కుట్టాయి. కార్మికులు మేలొన్నారు. సంస్కారవాదులకు స్థానం లేదని యీ సంవత్సరం మేదినోత్సవ ప్రదర్శనాలలో తేలిపోతుంది- కమ్యూనిస్టు పార్టీ యొక్క అరుణ పతాకాలక్రింద రేపు మే. డే ప్రజాపోరాట దినంగా మారి పోతుంది- ఆ మహత్తర ప్రదర్శనం సో. డె. ల

ప్రభుత్వపు "పస్తువిధానం, మిశ్రమమంత్రివర్గముయొక్క విధానాన్ని ఎదిరించి వారి పలుకుబడిని పోగొట్టుతుంది. దీనికి ఘుడిసి, తమకామ్రేడ్ పోలీసుప్రశిడెంటు ద్వారా మే. డే. ప్రదర్శనాలపై, ఆంక్ష వేయించారు"

బిగ్గరగా "కాని కామ్రేడ్స్! విల్హెల్మువంటి వాడు. బెర్లిన్ కార్మికులమగు మనను ఆప లేక పోయాడు. జార్జి బెల్ ను ఆపనిస్తామా? జార్జిబెల్ కాదు ఏబలోన్మత్తుడు కూడా మనల్ని ఆపలేడు– అన్నాడు ఉపన్యాసకుడు—

"బ్రేవో!"

"హియర్! హియర్"

"మళ్లీ చెపుతున్నాను. బుధవారం నాడు ఊరేగింపు జరిపి తీరుతాము తీరాలి. ఏమి ఆయుధాలను పట్టం పట్టవద్దు నడిపించేది ఒక సోషల్ డెమాక్రాట్! వచ్చేది, మన చమట వల్ల కొవ్విన సాయుధులగు పోలీసు సిబ్బంది! ఆపాలనుకున్నది. మే. డే. ప్రదర్శనాల్ని! మనం, నిరాయుధులమై వారి నెదిర్చి జయం పొందాలి! నిశ్చయంగా జయం మనదే!"

అందరూ శభాస్ అన్నారు.

హాజరయిన వారిపై పెద్ద నింద మోపుతూన్నట్లు చేయిచాపి "కామ్రేడ్స్! అభివృద్ధి నిరోధక పత్రిక వార్తల్ను కలుగ జేసుకొని కమ్యూనిస్టులు రక్తపిపాసులనియు, జర్మన్

కమ్యూనిస్టుపార్టీ ఎంతో మంది కార్మికులను బలి వేస్తుందని, లేనిపోని అపనిందలను ప్రకటించి కార్మికుల ఇళ్లగోడల మీాద ప్రకటనల నతికిస్తే రష్యాలో వలెనే, కార్మికుల జీవ నెత్తురులో స్వైరవిహారం చేస్తూన్న, పెట్టుబడిదారీ వర్గపు గులాములనందరిని బాధించి, శిక్షించి, విజయధ్వానాలతో ప్రభుత్వాన్ని వశంచేసుకోవాలని విప్లవచరిత్ర ఘోషిస్తోంది!''

''అచ్ఛా! కోలిన్ వీథిసంఘం అంత అందుకు తయార్ అన్నారందరు.

సభలోని బిగి అంతా సళ్లింది. గది అంతా చుట్ట పొగతో నిండిపోయింది వాదోపవాదాలతో గింగురు మం టోంది. హెర్మన్ లేచాడు ''కామ్రేడ్స్! ఉపన్యాసకుడింత వరకూ చెప్పిన విషయాలన్నీ విన్నారుగదా! ఇక చర్చ ప్రారంభిద్దాం, మాట్లాడేవారు రండి! ఎవరూ!'' అంటూ సమావేశం వైపుచూచాడు— ఎవ్వరూ జవాబివ్వ లేదు. చెప్ప వలసింది బోలెడుంది. మొదలెట్టేందుకెవరికీ ఇష్టంలేదు. ఎప్పుడూ ఇంతే. ఒకరి నొకరు పొడుస్తున్నారు. ''నువ్వంటే నువ్వని'' ''జప్! లే! నువ్వు!''

''ఆటోని మాట్లాడనివ్వండి ముందు.'' ఊఁ. ఆటో కానియ్యి. లే''

కర్టు లేచి హెర్మన్ కేసి చూశాడు.

''కామ్రేడ్ జిమ్మర్మన్ మాట్లాడతాడు''

కర్టు మెల్లిగా తొట్రుపడుతూ మొదలెట్టాడు. తన తోటిపనివాళ్ళతో బాగానే మాట్లాడగలడు. "కామ్రేడ్స్! అసలువిషయానికి సంబంధించక పోయినా, కార్మిక సంఘాలను గూర్చి మాట్లాడుకొనేటప్పుడు ఫ్యాక్టరీల్ని గురించి కూడా ఆలోచించాలను కుంటాను. ఇళ్ళు కట్టే పనివాళ్ళంతా బుధవారంనాడు పని మానేసి ఊరేగింపు లోకి వస్తారు. ఒక్క పిట్టైనా ఆగకుండా అంతా వచ్చేస్తాం. కాని, బెర్లిన్ లోని తక్కిన పరిశ్రమలలో పని చేసే వారి సంగతి ఏమిటి? నాకు తెలిసి నంతవరకు యీప్రభుత్వ ఆంక్షను ఖండిస్తూ కూలీల సభలలో ప్యాసయిన తీర్మానాలు 650 ఫ్యాక్టరీలనుండి, పరిశ్రమాలయాలనుండి వచ్చాయి. ఇది కొంతవరకు బాగున్నా ఏమీ చాలదు. మన వీధి సంఘంలో అనేక ఫ్యాక్టరీల వాళ్ళున్నారు. కొన్ని కమ్యూనిస్టు సంఘాలు కూడా ఉన్నాయి. వాటిలో ఏంజరుగుతోందో ఏమీ తెలియడం లేదు. వాటిని తెలుసుకొనేందుకు బుధవారం వరకూ మనకున్న వ్యవధంతా వుపయోగించాలి—ఇక ఏంచెయ్యాలో, ఎల్లా చెయ్యాలో హెర్మన్ చెపితే బాగుంటుంది"—అని చెప్పి కూచున్నాడు.

హెర్మన్ "ఈవారంలోపుగాకొన్నిఫ్యాక్టరీలలో సభలు జరుగుతాయి. కోలిన్ ప్రాంతములో ఏమన్నా దిగడితే దిగడ

వచ్చు. కాని సమ్మె మాత్రం చాల దిగ్విజయంగా జరగడం నిశ్చయం."

"ఒక సోషల్ డెమోక్రేటిక్ ఫ్యాక్టరీలో మాత్రం ఏమైనాసరే! అర్జంటు గనుక పని ఆగకూడదని సమ్మెను తిరస్కరించారు." అని సమాధాన మిచ్చాడు.

"బలే ఫ్యాక్టరీకొన్నిల్లే!" మహావొడ్డ కౌన్సిలుగా!

"అందుకోసం ఎంతిచ్చారు మేనేజర్లు వాళ్ళకి?

"వాళ్ళు కూడా పని మానెయ్యాలని కరపత్రాలు మూలంగా హెచ్చరిస్తాం."

ప్రతివాళ్ళూ ఇప్పుడు మాట్లాడాలనుకుంటున్నారు. ఆలస్యంగా వచ్చిన హాబ్నరు కూడ పాల్గొన్నాడు చర్చలో ఉపన్యాసకుల లిస్టు పెద్దదయింది. హెర్మన్ చూచాడు. గంట తర్వాత ఇంకా చాలా తొందర పని ఉంది. చర్చ తొందరగా ముగించాలి" అని తీర్మానం పెట్టాడు హెర్మన్—

కార్యక్రమంలోని రెండవవిషయాని కొచ్చారు. మే 1 వ తేదీకి ప్రయత్నాలేమి చెయ్యాలి! పొద్దున్నప్పుడు ఫ్యాక్టరీల బయట కరపత్రాలు పంచి పెట్టడం రాత్రిళ్లు వాల్ పోస్టర్లతికించడం. ఆదివారం రాత్రి ఒక సభ జరుగుతుంది. ఆసభకు రమ్మని ఇంటింటికి కాన్వాసింగు చేయడం. వెడ్డింగ్—కూలీ" అనే ప్రాంతీయ కమ్యూనిస్టు పత్రిక ప్రతులు వెంటనే అచ్చొ

త్రించి పంచి పెట్టాలి. సభ్యుల పగటి పని అయ్యాక యీ పనులన్నీ చేయాలి.

సభ ముగిసేటప్పటికి రాత్రి రెండు ఝాము లయింది. పెద్ద పెద్ద పోస్టరతికించడానికి సిద్ధమయ్యాడు కర్టు. అయిదు న్నరకే పనికి పోవాలి మళ్ళీ.

"హెర్మన్, కొద్ది నిమిషాలలో నీదగ్గరకి వస్తాను. అన్నాతో ఒక కబురు చెప్పి రావాలి."

"దీన్ని గూర్చి కొద్దిగా గొడవవుతుందను కుంటాను. కాదూ? కర్టూ!" బల్ల మీద కాగితాలను తీసుకొంటూ నవ్వుతూ అన్నాడు హెర్మన్.

"అన్నాని గూర్చి అస్తమానం ఏం ఆక్షేపిస్తున్నావ్.

"అన్నా కూడా వస్తే రావచ్చు" అని చెప్పి పార్టీ పను లేమీ అర్థం చేసుకోలేని పెటీ బూర్జువా క్రింద కట్టేశారే అన్నా నందరూ! అన్నా కూడా పార్టీలో చేరే రోజు వస్తుం దని కర్టుకు తెలుసు. ఇంత అర్థాన్నంగా ఎప్పుడూ మాట్లాడ కూడదు! దాటేపోతూ "ఏమో! ఈరాత్రి కూడ ఏమైనా ఇబ్బంది పెడుతుందేమో" అనుకున్నాడు.

హెర్మన్ ప్రతినిధితో అవతల 4 నిమిషాలు మాట్లా డు తున్నాడు. చలితో పక్కలొంచుకు పోతున్నాయి. లోరెంజిలో గుమాస్తా పని చేస్తున్నానని గత వసంత కాలపు

ఎన్నికలలో వర్క్స్ కౌన్సిలు సభ్యుడుగా ఎన్నుకోబడ్డానని ప్రతినిధి హెర్మన్‌తో మాటల ధోరణిలో చెప్పాడు.

సిగరెట్టు ముట్టిస్తూ హెర్మన్ కొకటి ఇవ్వబోతూంటే "అంత ఎక్కువగా కాల్చకండీ" అన్నాడు హెర్మన్. ఆరి పోయే అగ్గిపుల్ల కాంతిలోని విలక్షణమైన అతని ముఖాన్ని చూచాడు హెర్మన్. ముఖం పాలిపోయింది. కళ్లు చింతనిప్పు ల్లాగున్నాయి జ్వరం వచ్చిన వాడికి మల్లే.

"దానికేం చెయ్యగలం కామ్రేడ్!" అని అలసటతో చిరునవ్వు నవ్వాడు—ఈవీధిలో వున్న మీలో చాలా మందికి సంపూర్ణ ఆరోగ్యం వుందనుకోను!

వీధి కేసి చూచి "గుడ్ నైట్ కామ్రేడ్" అని చీకట్ని బడిపోయాడు.

# ఆన్నా

ఆదివారం రాత్రి దాకా, విశేషాలేమీ జరిగి నట్టుగా లేదు. పత్రికల్ని మామూలు కంటె శ్రద్ధగా చదువు తున్నారు. రెడ్ నైటింగేల్ లోకి ఎక్కడో అక్కడ అభివృద్ధి నిరోధకపు పత్రికను ఎవరో ఒకరు పడ వేస్తూండడం, ఒక్కొక్కరే చూస్తూ ఉండటం జరిగేది. వింతల మీద వింతలు అచ్చుపడి పోతు న్నాయి. మే 1 వ తేదీని, కమ్యూనిస్టులు తిరగబడ తారని పుకారంతటా పడి పోయింది. వార్వర్ట్సు పేపరు కింక అడ్డమే లేదు. పోలీసులు చూస్తూండగా పట్టపగలే సోషల్ డెమోక్రేటిక్ కూలీ యువకులు, వార్వర్ట్సు పత్రికా ఆఫీసు మీద రాళ్లు విసరి తలుపులు కిటికీల అద్దాలు పగల గొడుతున్నారు.

యథాప్రకారంగా నాష్టాప్ గేబ్ అనే పత్రిక కడుపు రగిలే శీర్షికతో శనివారం వెలువడింది- దాన్ని రెడ్ నైటింగేల్ కిటికీ కెవరో కట్టారు. దాని మీద "విషం - ముట్టుకోనేరు సుమా!" అని వుంది. దానికి అడ్డంగా ఎవరో వ్రాశారు. "అందుచే, రోట్ ఫానే నే చదవండి" అని.

ఇళ్ళ ఎదుట చాలా తరుచుగా స్త్రీలు మూగి చర్చించు కొంటున్నారు. వైము కూడ ఎక్కువే పడుతోంది. అప్పుడప్పుడు మొగవాళ్లుకూడా చర్చల్లో పాల్గొంటున్నారు.

పట్టణంలోను, ఫ్యాక్టరీలలోనూ ఏమేమి జరుగుతోందో, తా మేమేమి చూశారో అన్నీ చెప్పుకుంటున్నారు.

"పట్టణం అంతా అవతలుంది. నెట్టిల్ బెక్ ప్లాజ్ వెనుక నుండే "పట్టణం" ప్రారంభం. మోటార్లు పెద్దరాధారీ పెద్ద స్టోర్లు, పోలీసులు, కోట్ల కొద్దీ జనంతో తులతూగుతోఉండేదే బెర్లిన్ మహానగరం! ఉంటే ఏదైనాపనికి తప్ప మరెందుకు యీవీధి నుండి చాలమంది మనుష్యులు పట్టణం లోకి వెళ్లరు. పని వున్నవాళ్లు కూడా ఇంకా తెల్లార కుండానే పనికి పోయి, రాత్రి ఆలస్యంగా అలసి పోయి కొంపలికి చేరుకుంటారు. ఆవీధి మలుపులో ఒక సినీమా వుంది. క్రూష్ మాకున్న కొట్టులో వున్న స్టౌ దగ్గర కొంచెం సేపు కూచో వచ్చు— కోలిన్ వీధి దారిద్ర్య దేవతకు నిలయమైన గుహ. వీధులు విశాలంగా ఉన్నా దీన్ని అల్లాగే అనడం అలవాటు. అక్కడ 23 కొంపలున్నాయి. వాటిల్లో ఉన్నారు జనం ఎన్ని వేలొనా. అందుకనే గుహఅనడం.

కొన్ని నెల్ల కిందట పెట్రోవిస్కీ ఒక ఐస్ దుకాణం పెట్టాడు. గదికి వెల్లబాగా వేశారు. ఒక పక్కని మంచు నిలవ చేసే పెట్టె వుంది. ఎదురుగుండా గుండ్రటి బల్లలున్నాయి. వాటికి ఎర్రటి రంగు పూశారు కుర్చీలు కూడా ఉన్నాయి. ఆకొట్టులో ఒకవిద్యుచ్ఛక్తి యంత్రం కూడా ఉంది

టాంతోనే మంచు గడ్డ తయారు చేస్తాడు. అదే ఆకొట్టు కంతా విలువైన వస్తువు. వీధివైపుకి ఒక గజము వెడల్పు చక్రము ఒకటి పెట్టాడు. దాని మీద శంఖలావర్తముగా నీలి రంగుతో గీచాడు ఆచక్రం తిరిగే టప్పుడు లోపలికి దించుకు పోతూన్న పెద్దపెద్ద సుడిగుండంలా కనుపిస్తుంది—ఆకొట్టక్కడ పెట్టిన కొత్తలో చంటిపిల్లలు దాన్ని చూశేందుకు తెగవస్తూం డేవారు. అదే పనిగా చూస్తే కళ్ళు కూడ తిరుగుతూండేవి వాళ్ళకి. దుకాణపు గదికి వెనకింకో గది వుంది. దానికీ దీనికి పెల్లవేసిన కర్ర గోడ అడ్డం. వెనక గదిలోనే దుకాణదారు కాపురంవచ్చిన కొద్దిరోజుల్లోనే ఆదుకాణంలో టెలిఫోను ఒకటి పెట్టాడు. అయినా అక్కడి వాళ్ళందరూ రెడ్ సైటింగే లులో వున్న ఫోను దగ్గరకే పోవడం అలవాటు. అందుచే ఎవరూ కూడ కొత్త ఫోను దగ్గర కొచ్చే వాళ్లు కారు. ఈపరి స్థితులలో ఫోను పెట్టడం విస్మయకారణమే.

వచ్చినప్పటి నుంచీ కొట్లో బేరాలు కూడా ఆట్టే లేవు. బల్లల మీద మెరిసే పువ్వుల చెట్లు పెట్టి యింకా ఎన్నో అలంకారాలు చేసి కొట్టు నదరుగా కనిపించేలా చేద్దామని మహా తంటాలు పడేవాడు.

ఒకవేళ పిల్లలెవరేనా ఏమన్నా కొనుక్కునేందుకు వచ్చినా అవతలికే పట్టుకుపోయి తినేవారు. కొట్టంత అందం

గా వున్నా అప్పుడప్పుడు మాత్రమే, అదేనా అడపా తడపా కూచునే వారు. తరువాత రోజులు చల్లబడ్డాక మంచుగడ్డ వ్యాపారమే పోయింది—అప్పుడు బంగాళాదుంపలు కాల్చి, కూరలు వండీ అమ్మేవాడు. అప్పుడూ వ్యాపారం నీళ్లు కారుతూనే వుంది పాపం ఇంత పెట్టుబడీ పెట్టి దుకాణం పెడితే ఒక్క బేర మేనా లేక పోవడానికి ఏదో కారణముండి తీరాలి అసలు.

ఆసందులో నున్న ప్రజల అలవాట్లు చాలా వింతగా వుంటాయి. క్రిక్కిరిసి ఉండే, ఆకొంపల్లో పగలు మనిషి ఉండేందుకే వీలుండదు.

ఇంక పడుచువాళ్ళ సంగతి చెప్పాలా. బాగ్గు బాగా ప్రియం వండుకొనేందుకేనా దొరకడం కూడా దుర్లభమే. స్టవు దగ్గర ఒకటో, రెండో కుర్చీలు, ఒక బల్ల వుండే చిన్న దుకాణా లున్నాయి ఆవీధిలో, క్రూషమాన్సు సిగరెట్టు దుకాణంలో మట్టుకు, అంతే. అయితే మాత్రం ఆదుకాణాల దగ్గిర జనం కుప్పతిప్పలుగా వుంటారు. బాతాఖానీ లేస్తారు. చర్చించుకుంటూ వుంటారు. ఊం కేరింతాలు కొడుతూంటారు. చలి కడ్డంలేని కొంపల కంటె అక్కడే బాగుంటుందను కొంటూ ఉంటారు. ఆఖరికి కల్లు దుకాణాల్లో కూడా కూచుని మంచీ చెడ్డ చెప్పుకుపోతూంటారు. దంపతులు అక్కడే పడుకుంటూ

వుంటారు కూడాను. అయినా పెట్రోవిస్కీ కొట్టు ఎంత నదరగా వున్నా అక్కడికి ఒక్కడూ ఎక్కడు. అదేం పాపమో గాని. ఇంకో చిత్రం. అతను పిలిస్తే పలికే వాడు కూడా లేడు. తనది హాంగరీ దేశమనీ, అతిరహస్య మైన రాజకీయకారణాలకి తనను దేశంలోంచి లేవగొట్టేశారనీ ఇతరులు అర్థంచేసుకొనేట్లు మాట్లాడేవాడు. ఒకరిద్దరితో చెప్పాడు కూడాను. అంతకు మించి ఏమీ చెప్పేవాడు కాడు. అయితే మాత్రం గొర్రె తోక లాగ అతని వ్యాపారానికి ఎదుగు బొదుగూ లేదు. అతనికి కార్మికు లంటే అభిమానం లేదు. మర్యాదతో కూడుకున్నట్లుండే అతని ప్రవర్తన అందరికీ అసహ్యంగా ఉండేది. పోసి జర్మన్ భాష మాట్లాడ లేక పోవడం వల్లనేమో అనుకుంటే, ఆగల్లీలోనే ఉన్న "మిజ్జా" అనే పోలండు దేశస్థుడికి ఒక్క జర్మన్ మాటైనా రాకపోయినా అతనితో కులాసాగా వుంటారు మళ్ళీ. అందరూ ప్రాణ మిస్తా రతనికి అతనికీ పెట్రోవిస్కీకి తేడా వుంది. లేక పోలేదు.

§ § § § §

ఒకసాయంకాలం ఆరుగంటలవేళ అన్నా కుర్రాణ్ణి చంకలో పెట్టుకుని వీధిలో నిలబడివుంది. క్రిస్టియన్ లోకానికంతా శెలవు దినమై కేళీవిలాసాలకి అలవాలమైన ఆదివారం

నాడు కూడా ఆవీధి యెంతమురిగ్గావుందో చెప్పశక్యంకాదు. ఆకూలీపేటలోని ప్రక్కవీధులు అమావాస్యకి పౌర్ణమికి మాత్రమే బాగుచేయబడతాయి. విలాసార్థమై జర్మని ముఖ్య పట్టణమైన బెర్లిన్ నగరానికి వచ్చే పరాయిదేశస్థులు యాత్రికులు యీకుళ్ళునివాసస్థలాలకి ఎప్పుడూ రారు. అంచేత ఇవ్వి పరిశుభ్రంగా లేకపోతేనేం! వీధిలో తోలుబంతితో కుండబంతి ఆడుతున్నారు పిల్లలు—

అందమైనదుస్తులు ధరించిన ఒక అపరిచితుడు వీధిని సమీపిస్తున్నాడు. మనిషి శలాకలా ఉంటాడు. గుమ్మాల ముందు నిలబడి పిచ్చాపాటి చెప్పుకుంటూన్న ఆడాళ్ళ దృష్టిలో పడకుండా డొంకతిరుగుదారిని వచ్చి తలుపు సంఖ్యల్ని పరిశీలించి మంచుదుకాణంలో దూరాడు.

ఆసమయంలోనే అన్నా ఆమనిషిని చూచింది. చాలా కొత్తముఖం. ఆవీధికి సంబంధించిన వాడుకాడు. తలుపుమీద వరుససంఖ్యల్ని జాగ్రత్తగా పరీక్షించి దుకాణం దగ్గర ఆగాడు. "పన్నులు వసూలు చేసేవాడేమిటి చెప్మా" అని అనుకుంది.

తక్కిన ఆడాళ్లతో బాతాఖానీ కొడ్తూన్నప్పుడు మధ్యలో యీవిషయం జ్ఞాపకం వచ్చింది. ఆ అపరిచితుడు పన్నుల కలెక్టరు అయ్యుండడు ఈవేళ ఆదివారం వీడెవడో

అసాధారణుడే! వీడు ఇక్కడ కాపరం ఉండటం లేదు ఈవీధి వాళ్ళే ఆకొట్టును వెళ్ళడం లేదే, వీడెందుకు రావాలి? వీడి కేంకావాలి? అనే తర్జుమాలో పడింది అన్నా పెట్రోవిస్కీ కొట్టులోకి వెళ్ళకపోతే అన్నా బహుశా యీవిషయంలో అంత శ్రద్ధ తీసికొని బుర్రబద్దలు చేసుకొనేది కాదు. మొదట్నుంచీ కూడా పెట్రోవిస్కీ అంటే అన్నాకి అనిర్వాచ్యమైన అసహ్యభావం ఉంది తటపటాయిస్తూనే దుకాణంవైపు చూచింది 'ఆఁ —ఇదేమిటో చివరకంటా చూడవల్సిందే'

"రా, రా! నాయనా! ఈవేళ ఆదివారం కదూ! మంచు లడ్డు కొనుక్కుందువుగాని!"

ఎగిరి గంతేసి ఆకుర్రాడు తల్లిని దుకాణంవేపు లాక్కెడుతున్నాడు

కొట్టుకు వెళ్ళింది అన్నా. ఆ నవీనుడు ఆదుకాణం ముందుగది లో లేకపోవడాన్ని ఆమె ముందు గమనించింది. అందుచేత వాడు ఒక ఖాతాదారు కాదు అని నిశ్చయించుకుంది. ఆకర్రగోడ వెనుక, ఆమంచు మనిషి తో కూర్చుని తీరాలి. తను రావడం మూలాన్ని వాళ్లు చెప్పుకునే మాటలు కట్టిబెట్టి వుంటారు. మాటలు ఏమీ వినబడటంలేదు. అంతా కిమ్మన్నాస్తిగా నక్కికూర్చున్నారు. ఈవిధమైన ఆలోచనా ప్రవాహంలో అన్నా కొట్టుకుపోతూన్న సమయంలో పెట్రోవిస్కీ బయటికు వచ్చాడు. తెల్లబనీను తొడుక్కున్నాడు.

దానినిండా మరకతే అన్నాను చూడడంతోటే స్నేహపూర్వ కమైన చిరునవ్వు ఆమశూచికపు ముఖాన్ని ఆవరించింది.

"గుడ్ ఆఫ్టర్‌నూన్ అన్నాగారూ! మాదుకాణానికి ఇంతకాలానికి ఇప్పుడొచ్చి ధన్యుల్ని చేశారు. చాలా సంతో షంగా వుంది. కాలం మారింది. బలే గడ్డురోజులండి."

కుర్రవాని వేపు తిరిగి సలాం చేస్తూన్నట్టు బుర్రవంచి "ఏమిటబ్బాయ్! ఏంకావాలి నీకు?"

"అణా మంచులడ్డు" తెచ్చిపెట్టుకొన్న ఆ ఆదరణిని లెఖచెయ్యకుండా వ్యవహారధోరణిలో కటువుగా సమాధానం చెప్పింది అన్నా. అక్కడికి వచ్చినందుకు ఏంపాకు చెప్పాలో ఏమీ పాలుపోలేదు. ఐనా, తనేమి కనిపెట్టగలుగుతుంది. ఆ వచ్చినవాడు ఈతడి బంధువుడేమో! చూచి పోదామని చుట్టంచూపులకి వచ్చాడేమో! వృథా డబ్బుఖర్చు. ఆచలి గాల్లో మంచులడ్డు తింటే కుర్రాడికి జలుబుచేసుకొచ్చి ముక్కు ఓడిపోదూ!

అతి వినయంగా మంచులడ్డు కుర్రాడి చేతి కిచ్చాడు పెట్రోవిస్కీ.

డబ్బులిచ్చేశి, మంచులడ్డు నాకుతూ కేరింతాలు కొడు తూన్న కుర్రాణ్ణి చంకనేసుకుని వీధిలోకి వచ్చి ఇంటివేపు నడు స్తూంది. దారిలో ముఖం వెనక్కి తిప్పి చూసి, తెరవెనకనుంచి

తనకేసే పరీక్షగా చూస్తూ నిలబడిన మంచుదుకాణదారు కనపడ్డాడు.

"వెధవపని— అసలు కథ ఏదోవుంది. పిశాచపు ముండాకొడుకు" అని గొణుక్కుంది అన్నా.

తాను సొగసుగత్తె కనుక చూడ్డంలేదు. ఎక్కడికి వెడుతోందో చూసేందుకే నిలబడ్డాడు. తను దుకాణంలో వున్నంతవరకూ, గోడవెనక్కాల కూర్చున్న పెద్దమనిషి ఎందుచేత కదిలాడుకాదు? తనొచ్చేటప్పుడికి రంగున మాటలు ఎందుకు కట్టిపెట్టారు? ఈప్రశ్నలన్నిటితో అన్నా గుంజాటన పడుతూన్నది. కర్ట్ కనక అక్కడవుంటే ఎంత బాగుండును! అని అనుకుంది అన్నా.

వీధిసంఘ సభ్యుడైన పాల్ వెర్నర్ వీధికి అవతలప్రక్క వున్నాడు. ఆతడు ఆమెకళ్ళ బడ్డాడు.

"పాల్! ఆగు ఓనిమిషం!" అని పిలిచి అతని దగ్గరకు వెళ్ళింది మంచుదుకాణం వున్న ఇంట్లోనే పాల్కూడా వుంటున్నాడు. ఈగూడుపుఠాణీని బయటికి లాగేందుకు ఉపాయం ఆలోచిస్తాడు పాల్ అని ఆశించింది అన్నా.

"గుడ్ ఈవెనింగ్ అన్నా. కర్ట్ వచ్చాడా?" అని స్నేహపూర్వకంగా కరస్పర్శనం చేస్తూ అన్నాను అడిగాడు. చాలా పరిశుభ్రంగా వుంటూండే ఆయువతి అంటే ఆతనికి వాత్సల్యం కలదు.

"లేదు, పాల్, నీకో విషయం చెప్పవలసివుంది."

పాల్ చాలాశ్రద్ధగా వినేందుకు సిద్ధపడటాన్ని చూచి అన్నా ధైర్యం తెచ్చుకుంది. ఆమె టూకీగా చెప్పిముగించాక, ఆలోచిస్తూ ఒకనిమిషం ఆవిడవంక చూశాడు.

"జాను అన్నా వాడో గూఢచారి (స్పిట్) మాకు ముందునుంచీ అనుమానంగానేవుంది. పెట్రోవిస్కీ దారి తప్పివచ్చిన ఘటంకాదు" ఓనిమిషం ఆలోచించాడు. "విను అన్నా వాడింకా నీకేసి పరీక్షతో చూస్తూన్నాడు అన్నావు కదూ. ఓనిమిషం ఇటూఅటూ నడుస్తూండు పనిమీద వున్నట్టు వాడు నిన్ను చూడని సమయంలో దొడ్లోంచి మా ఇంట్లోకి వెళ్లు."

పాల్ మరి తటపటాయించలేదు. ఈరహస్యాన్ని భేదించాలి. దీని తస్సాగొయ్యా! ఇంతవరకూ బయటపడని రహస్యం ఇదా! వీధిమధ్యను చేరి, టెలిఫోను తతంగాన్ని అమర్చుకుని వీధంతా కనపడే ఘనుండైన ప్రదేశంలో తిష్ఠ వేశాడు పోలీసు గూఢచారి! బలే టక్కరిముండాకొడుకు! పాల్‌కి తన అనుమానానికి నిదర్శనం దొరక్కపోయినా వాడంటే మండిపడుతున్నాడు. పాల్ వెర్నర్ స్వతహాగా చాలా జాలిగుండె మనిషి. ఐనప్పటికీ వాళ్ళిద్దర్నీ జుట్టుపట్టుకొని వీధిలోకీడ్చి ప్రజల్లో గొడవచెయ్యాలనే కోరికతో కొట్టుకు పోతున్నాడు. "అందరూ ఇల్లాఒచ్చి వీళ్ళని చూడండి! మన్ని దుంపదెంపే

దుకని వచ్చారు. వీళ్ళూ మన బీదలవర్గానికి చెందినవాళ్ళే, ఐనా మన్ని తలతీసి మొలెయ్యాలని సిద్ధమయ్యారు వీళ్ళ మొహాలు చూడండి! అర్ధరూపాయిడబ్బులికి గడ్డికరచి వాళ్ళ వర్గస్తుల్నే బలేసేందుకు సిద్ధం ఔతున్నారు చూడండి నీచులు...!"అని అరచి వీళ్ళ గుట్టురట్టు చెయ్యాలని ఉద్దేశ్యం. వాళ్ళ మొహాలు బద్దలు కొట్టెయ్యాలనే అంత అక్కసుతో ఉన్నాడు.

కాని శాంతంగా వుండు, శాంతించు, పాల్ సీకోవాన్ని అణగ త్రొక్కేసి, ఎండగట్టెయ్యి ముందు వాళ్ళ సమాచార మేమిటో కనిపెట్టు!

ఆతని బుర్రలో అనేక విపరీత భావాలు చెలరేగుతున్నాయి ఒక నిమిషం స్థిమితంగా ఆలోచించాలని తంటాలు పడ్డాడు దుకాణంలోకి వెళ్ళడంలో అర్ధంలేదు. వెళ్ళి తెలుసుకోగలిగిందేమి ఉండదు. దొడ్డి దోవవెంట వెళ్తే ఒక చిన్న కిటికీవుంది అది చాలా చిన్నది, ఎవ్వరూ దూరి వెళ్ళలేరు. అదిలాభంలేదు ఆలోచన పాలుపోక నుదురును నిమురుకున్నాడు. హఠాత్తుగా తన భాగం నుంచి దుకాణం వెనక్కి వెళ్ళే చిన్న సందు తలుపు వున్నదన్న విషయం మెరపులా మనో వీధిలో మెరిసింది.

ఇతరులకు అనుమానం కలుగకుండా ఆయిండ్ల వద్దకు వెళ్లి మంచుదుకాణం పక్కనేవున్న ద్వారందగ్గర ఆగి, లోపలికి జొరబడి, చప్పుడవకుండా తలుపు మూసుకున్నాడు.

ఆతడు ప్రవేశించిన చీకటిదారిలో మసకవెల్తురు మాత్రమే వుంది. ఆదుకాణానికి తీసికెళ్లే గుమ్మం. అక్కడే కుడిచేతి వైపున వుండాలి అని జ్ఞాపకం వుంది పాల్ కు!

గోడకు చేతులాన్చి మెలమెల్లగా తడుముకుంటూ తలుపుదగ్గరకు వెడుతున్నాడు. ఆకర్రతలుపు దగ్గర చెవి ఆన్చకముందే లోపల బిగ్గరగా జరుగుతూన్న తీవ్రమైన సంభాషణ చెవుల పడుతుంది.

"..........లేదు, అది అసాధ్యం, దానికీ దీనికీ ఏమీ సంబంధంలేదు. నేను జాగ్రత్తగా పరీక్షించాను. నేను చెప్పింది. తప్పకుండా నమ్మవచ్చును."

కంపిస్తూండే పెట్రొవిస్కీ స్వరం అది అని గుర్తుపట్టాడు. పాల్ ఆశ్చర్యంతో! ఉఛ్వాస నిశ్వాసాలు మందగించాయి. ఇప్పుడు రెండవవాడు మాట్లాడుతున్నాడు. అబ్బా......దొంగవెధవ చాలామెల్లిగా గుసగుసలాడుతున్నాడు. వాడుబాగా అనుభవశాలి ఐన గూఢచారి ఐయ్యుంటాడు. గోడలకూడా చెవులుంటాయని అనుమానంతో జాగ్రత్తలో ఉండేరకం.

పెట్రోవిస్కి మళ్లీ ఉద్రేకంతో అడ్డుతగిలాడు. "కాని అది అసాధ్యం ముమ్మాటికి అసాధ్యం మరేదైనా మార్గం గుండా వెడుతూండవచ్చును బహుశా ఇంటిపైకప్పులమీద నుంచి 19 వ నెంబరు ఇంట్లోంచి రీనిక్కెండార్ఫర్ స్ట్రాసీకి వెడుతూండవచ్చును. నేను మొన్ననే అక్కడికివెళ్లి జాగ్రత్తగా పరీక్షించాను........"

గొంతుకనిపట్టి రెండవవ్యక్తి ప్రశ్నిస్తోన్నట్లు తోచింది.

"బాగుందయ్యా ఆట్టే అంతకష్టమైనపని కాదది. ఈ చుట్టుప్రక్కల పాంకీ ఆట్టే లోతులేదు. అత్యవసరసమయాల్లో దానిమీద బ్రిడ్జి కట్టడం కష్టమైనపని కాదు. అక్కణ్ణుంచి హాప్ట్‌స్ట్రాసీ వెళ్ళేందుకు వీలుంటుంది."

పాల్ ఇక సహించలేకపోయాడు. మెల్లిగా ఒక అడుగు వెనక్కి వేశాడు. పొత్తికడుపు దగ్గర నొప్పి పెడ్తూన్నది. బాగా ఉద్రేకం పొందినసమయాల్లో పొత్తికడుపు నరాలు బాగా బిగపట్టేశి పాల్ బాధ పడుతూంటాడు.

మనస్సు చిక్కబట్టి స్థిమితంగా ఆలోచిద్దామని ప్రయత్నించాడు. కంట్లో దుమ్ము కొట్టాలని ఎంత ప్రయత్నించినా దొంగ ఇప్పుడు దొరికాడు. వెంటనే తగినపని చెయ్యాలి హెర్మన్‌తో ఇది చెప్పేలోపుగా మరొకళ్ళు వింటూంటే బాగుంటుంది. అన్నా ఎక్కడ వుందో ఇప్పుడు. కోపాంధకారంలో మునిగున్న అతనికి ఆలోచన పోవడం లేదు. 'దొంగ

ముండా కొడుకులు......పేటమధ్య పీఠం వేసుకొని ఇళ్ళ నన్నిటినీ పరీక్షిస్తున్నారూ?......'

బాధ భరింపశక్యంకాకుండావుంది. అంతకంతకు మరీ ఎక్కువౌతూన్నది. ఆతడు నిలవ లేకపోతున్నాడు. పేగుల్ని ఎవరో తోడేస్తున్నట్టు అనిపిస్తోంది. ముందుకు కృంగిపోయి దారుణబాధ పడుతోన్నప్పుడు తలుపు తెరచుకుని అన్నా వచ్చింది.

"పాల్, ఏం, అల్లా వున్నావేం?" భయంతో అడిగింది అన్నా. పాల్ గుప్పిళ్ళతో పొత్తికడుపు నొక్కుకుంటున్నాడు. తనకున్న ఇచ్ఛాశక్తి నంతా ఉపయోగించి నిట్టనిలువుగా నిలిచాడు. ఇప్పుడు లొంగిపోకూడదని సంకల్పించుకున్నాడు. మెట్లదగ్గరకి అన్నాను తీసి కెళ్ళాడు.

"ముందు పిల్లాణ్ణి ఇంట్లో పడేశివచ్చాను." అన్నా తన ఆలస్యానికి కారణం చెప్పింది.

"బాగుంది. మంచిపని చేశావు. జాగ్రత్తగా విను. తలుపుదగ్గరగా వెళ్ళు — చాలా జాగ్రత్తసుమా — మన ఆచోకీ వాళ్ళు పసికట్టకూడదు. వాళ్ళు మాట్లేడేదంతావిని జ్ఞాపకం ఉంచుకో. హెర్మన్ కోసం వెడుతున్నాను నేను."

ఆతని ముఖం ఘోరబాధతో బూడిద వర్ణమైంది.

"పాల్, నేను వెళ్ళివస్తాను లెద్దూ" అని వేడింది అన్నా. ఈస్థితిలో నాలుగు అడుగులేనా వెయ్యలేడు అని తెలుసును అన్నాకు. ఆతని బాధ ఏమిటో అన్నాకు తెలియదు. సమాధానమివ్వకుండా పాల్ అన్నా భుజాల్ని పట్టుకొని మెట్లవేపు త్రోసి ఇంట్లోంచి బయటికి వెళ్ళాడు. వెనక్కి తిరిగి చూడలేదు మళ్ళీ. వీధిలోకి వచ్చాక చల్లగాలి తగలగానే బాధతీవ్రత కొంచం సళ్ళింది. యుద్ధంలో సంపాదించి తెచ్చుకున్న నరాల బలహీనత బాపతు కొరదల యీబాధ. కొన్ని. పళ్ళు విశ్రాంతి తీసుకుంటే యీబాధ పూర్తిగా పోయివుండేది. మనోస్థైర్యత కావలసిన సమయాల్లోనే యీతిమ్మిరి బాధ కలుగుతూన్నది ఆతనికి.

రెడ్ నైటింగేల్" వెళ్ళి హెర్మన్ కుత్రా తియ్యవలసి వుంటుంది. బహుశా చూచిన వాళ్ళెవళ్ళైనా కనపడితే ఆతని జాడ తెలియచెబుతారు. ఈతరుణంలో కొంచెం సోడా త్రాగితే ప్రయోజనకారిగా ఉండవచ్చును. సోడాత్రేన్పు త్రేన్చెయ్యడంతోటే బాధ సద్దుకుంటుంది. గమత్తైన విషయమే. ఏతేనేమి—దానికిదే మందు.

వీధిలో పరిగెత్తుతూ హెర్మన్ ఎక్కడ ఉన్నాడు. అని కనుక్కున్నాడు పాల్. హెర్మన్ ఎక్కడ వున్నదీ ఎవళ్ళకి తెలియదని చెప్పారు. ఇద్దరు మఫ్టీపోలీసులు మంచుదుకాణం

దగ్గర బైఠాయించి అందర్నీ కనిపెడుతున్నారని కనపడిన ప్రతివాడితో నూ చెప్తే ఏంజరుగుతుంది. అనే ఆలోచన మనో వీధిలో మెరిసింది. బహుశా దుకాణం రూపు ఉండదు. "కాదు, కాదు—పాల్—అట్లా చెయ్యడం తప్పు—" అని తనలో తాను గొణుక్కున్నాడు "ముందు హెర్మన్‌తో చెప్పు."

"రెడ్ నైటింగేల్" లో కర్ట్ జిమ్మర్ మన్ ఆతని ప్రశ్నకి వెంటనే సమాధాన మిచ్చాడు. "ఆయన ఇంటి దగ్గర ఉన్నాడు

"చప్పుని—వేగంగా నాతో రా కర్ట్! సోడ త్రాగా లని అనుకున్న విషయమే మరిచిపోయాడు పాల్ కర్ట్ కన పడ్డాడు కదా! మనస్సు కుదుట పడింది. తక్షణమే బాధ ఆతణ్ణి వదలి పారిపోయింది. హెర్మన్ ఇంటికి గబగబా నడిచి వెళ్తూ పాల్ జరిగిన విషయమంతా చెప్పాడు.

"అబ్బాయి! వాడికి మనవీధి తడాఖా తెలియదు. తెలిస్తే అక్కడ దుకాణం పెట్టేందుకు సాహసించక పోయి వుండును"

"త్వరలోనే తెలుసుకుంటాడులే మనం ఎవళ్ళమో" కోపాన్ని అణచుకొంటూ పాల్ అన్నాడు. కర్ట్ శాంతంగానే

విన్నాడు. పోలీసులు వాళ్ళఏజంట్లనీ, గూఢచారుల్ని పంపి స్తున్నారు కాబ్బోలు వీధిలోకి. ఐనా వాళ్లు పట్టుబడటానికి ఇదే మొదటిసారి కాదు. వాళ్ళని పట్టుకుని యీ నీచప్పని నుంచి మాన్పించడమే చేయవలసిన ముఖ్యకార్యం.

మంచుదుకాణంలో ఇప్పుడు ఒక దీపం వెలుగుతూ న్నది. దుకాణం ఖాళీగా వుంది. హెర్మన్ భార్య పాల్, కర్టలకు తలుపు తెరిచింది.

"గుడ్ ఈవెనింగ్, కామ్రేడ్స్ — హెర్మన్ గదిలో ఉన్నాడు."

పాల్ కర్టులు లోపలికి వెళ్లి హెర్మన్ గదివేపు నడి చారు. ఓరవాకిలిగా వేసివున్న తలుపు సందులోనుంచి టైపు యంత్రపు క్లిక్ క్లిక్ ధ్వని వినిపిస్తూన్నది. కర్టు తలుపులు తెరుచుకొని వచ్చాడు లోపలికి.

ఆగది చిన్నది. ఒకమూల పెట్టెలతో తయారు చేయ బడిన పుస్తకాల కేసు ఉన్నది. దీన్ని హెర్మన్ స్వయంగా తయారు చేశాడు. మధ్య అర అంచుకి ఎర్రకాగితం అంటిం చాడు. లెనిన్ ఛాయాపటం మధ్య వ్రేళ్ళాడుతూన్నది. ఇదే ఆవెర్రవీధి యొక్క 'లెనిన్‌మూల.' ఆ చిత్రపటంపైని కరపత్రా లు, పార్టీ రిపోర్టులు, ఉపన్యాసకుల ఉపన్యాసవిషయాలు, మార్క్సు శాస్త్రీయగ్రంథాలు, రెండువరుసలుగా పేర్చబడ్డా

యి. అక్కడవున్న పుస్తకాల్లో జాక్‌లండర్‌చే వ్రాయబడిన "జాన్ బార్లీకానర్" అన్న నవల తప్ప మరేనవలా లేదు. పుస్తకాల ప్రస్తుతస్థితిని చూస్తే అవ్వి కేవలం అలంకారార్థంగా మాత్రమే అక్కడ లేవని తెలుస్తుంది.

కార్మికుడై యుండి, పెద్ద పెద్ద గ్రంథాలు చదివేందు తీరిక లేక, అత్యవసరమైన పార్టీ కార్యాలకి సంబంధించిన వాటిని మాత్రమే చదువుతూండే కార్మికనాయకుని బుక్‌షెల్ఫ్‌కు ఉదాహరణప్రాయంగావుంది హెర్మన్ బుక్‌షెల్ఫ్! పగలల్లా చమటవోడ్చి డస్సిపోయిన హెర్మన్ వంటింటి గ్రుడ్డిదీపం వెలుగ్లో "అదనపువిలువ" పెట్టుబడిప్రోగుదల, ప్రపంచ యుద్ధానంతర సామ్రాజ్యవాదం" మొదలైన సమస్యలతో కుస్తీ పడుతూండేవాడు కంకర పనివాడైన హెర్మన్‌సూడ రప్ రాత్రిళ్లు యీసమస్యల్తో బుర్రబద్దలు కొట్టుకునేవాడు. "విప్లవసిద్ధాంతం లేందే — విప్లవపథం లేదు" అన్నాడు లెనిన్ మహాశయుడు. ఆయన చిత్రపటమే ఆగదిలో వ్రేలాడ గట్టబడి ఉంది.

మేజాబల్లప్రక్క ఒక కాగితాల బీరువా వుంది. వార్తాపత్రికలు, కరపత్రాలు, లిఖితపత్రాలు మొదలైన అన్నిరకాల కాగితాలతోటి ఎన్నిసార్లు సర్దినా చెల్లాచెదురుగా వుంటుంది ఆబీరువా! హెర్మన్‌కూతురు హైడీకి ఒక చిన్నబల్ల ఉంది. దానిమీద ఒక పాత టైపురైటరు వుంది. హెర్మన్ ఆ యం

త్రంతో ఓ పొల్లిగా ఆవీధి కమ్యూనిస్టుపత్రికను ప్రైపు చేస్తు
న్నాడు.

ఆవీధిలో ఉన్న కమ్యూనిస్టుసంఘసభ్యు లందరూ దీన్ని
"ఎర్రగది" అని పిలుచుకోవడం అలవాటు.

† † † † † †

పాల్ ధోరణి చూచి ఏదో పరమముఖ్యమైన విషయం
ఉందని హెర్మన్ వెంటనే గ్రహించాడు.

టైపుమిషన్ని వెనక్కి నెడుతూ "ఏమిటీసంగతి?" అని
అడిగాడు.

"పెట్రొవిస్కీ దుకాణంలో ఒక మప్టీ ఉన్నాడు వాళ్లు
మాట్లాడుకునే మాటలు దాక్కుని విన్నాం. అనల్లవెధవ ఒక
మప్టీ"

మాట్లాడకుండా లేచి నిలబడి కిటికీ వద్దకువెళ్ళి హెర్మ
న్ దొడ్లోకి చూస్తూనిలబడ్డాడు. వీధిలోకి ఒక మప్టీపోలీసు
వచ్చాడు! మప్టీలు వస్తారని అనుకోవలసివున్నప్పటికీ వాస్త
వంగా యీసంగతి తెలిసేటప్పటికి కొంచం తత్తరపాటు
పొందాడు.

"అన్నా ఇంకా గోడదగ్గర వుండి వింటూనే వుంది"
అన్నాడు పాల్. హెర్మన్ వెనక్కి తిరిగాడు. ఒక ఉపాయం
ఆలోచించాడు.

"కర్ట్స్, ఇద్దరు కమ్యూనిస్టు యువకుల్ని దుకాణంలోకి పంపించు ఫ్రిట్జును తప్పక పంపించు, ఆతడు చాలా నమ్మకస్తు డు ఆమప్టీ వెళ్ళేవరకూ వాళ్ళక్కడనుంచి కదల కూడదు. అనుమానించి కాపలా కూర్చున్నట్లు కనపడ కూడదు. వీళ్లు న్నంతకాలం వాళ్లు మాట్లాడుకోరు. అంచేత వాడు వెళ్లిపో తాడు. ఫ్రిట్జు వాణ్ణి జాగ్రత్తగా పరీక్షించాలి వాణ్ణి గుర్తుపట్ట గలిగితే ముందుముందుకి మంచిదిజాగ్రత్తగా వుండాలి సుమా కామ్రేడ్స్ మనం పసికట్టామని వాళ్లు గ్రహించకూడదు. లెడె రల్ తాత 20 వ నెంబరు గదిలో ఉన్నాడు ఆయన దగ్గరకి వెళ్ళొస్తాను. ఆయన టెలిఫోన్ల పని చేస్తూంటాడు కదూ?"

"ఇప్పటినుంచా, పదకొండేళ్లనుంచీ చేస్తున్నాడు."

"ఆముసలితాత నమ్మకస్తుడు కాదంటావా? ఆయన పార్టీసభ్యుడు కాదు—ఐనా—

కర్టు హెర్మన్ కేసి ఆశ్చర్యంతో చూశాడు "ఆముసి లాయన్తో పనేమిటి నీకు?"

"ఏమనుకుంటున్నావ్? ఫోన్ విషయం తేల్చుకుందా మని" అని హెర్మన్ సమాధానమిచ్చాడు. "త్వరపడండి తక్కిన విషయాలు సాయంకాలం చూసుకోవచ్చును లెండి. ముందు ఆమప్టీని తరిమెయ్యండి. కాని, పాల్, వాడి వంటి మీద దెబ్బ పడకూడదు అనవసరపు గందరగోళం చెయ్యబో కండి"

"అబ్బే, ఎందుకు చేస్తాం— అట్లా ఎప్పుడూ చెయ్యం హెర్మన్. అస్తమానం శాంతంగావుండి, పని గట్టెక్కించాలి"

పాల్ చెదరిన మనస్సును మళ్ళీ వశపరచుకున్నాడు. ఆతని బాధ మాయమైంది. ఆదొంగని పట్టుకున్నాం గదా అని ఉబ్బి తబ్బిబ్బై పోతున్నాడు.

పాల్, కర్టు, హెర్మన్‌లు వీధిలోకి వచ్చేటప్పడికి అన్నా కూడా అక్కడికి వచ్చింది. హెర్మన్‌తో మళ్ళీ వెళ్ళి పోయినసంగతి చెబుదామని వచ్చింది.

హెర్మన్ నిరాశ చెందినట్టు కనిపించాడు. "ఆతణ్ణి ఎవ్వరూ సరిగా చూడలేదు." తాను విన్న వాళ్ళ సంభాషణ అన్నా చెప్పబోతూంటే ఆమెని వారించాడు హెర్మన్.

"తరవాత చెబుదువు గానిలే అన్నా- నాతో మేడ మీదకిరా. నేను ముందు 20 వ నెంబరు ఇంటికి వెళ్ళాలి. ఒక అరగంట తర్వాత మాయింటికి వచ్చి నాతో చెప్పు. ఆ టోని తీసుకురా, పాల్—సెలవు, సెలవు!"

హెర్మన్ వీధిదాటి వెళ్ళాడు. వానతుంపర పడుతోంది సినీమా దీపాలు తడిసిన రాళ్ళ చదును బాట మీద ప్రతిబింబి స్తున్నాయి. మందుదుకాణం కిటికీ లోంచి నీల శంఖులా వర్త కపు సుళ్లు చుట్టుకు తిరుగుతూండడం కనిపిస్తోంది.

తెల్లవారేలోపుగా మందుదుకాణం కిటికీలోనుంచి పాల్ ఉన్న రెండవఅంతస్తు మీదికి ఒక టెలిఫోన్ తీగ పైకి

కనపడకుండా అమర్చబడినది. లెదరర్ తాత బకే పనివాడు!

ఈటెలిఫోన్ తీగ వలన పాల్ తన గదిలో కూర్చునే, పెట్రొవిస్కీ పోలీసుల మధ్య జరుగుతూన్న సంభాషణలు మాత్రమే వినగలుగుతాడు. లేకపోతే "హల్లో- 14 వ జర్మన్ కమ్యూనిస్టుపార్టీ మాట్లాడుతూన్నది-భగవంతుడు మిమ్మల్ని రక్షిస్తూంటాడు లేండి పోలీసుప్రెశిడెంటుగారూ!" అని టెలిఫోన్‌లో మాట్లాడాలనే కోరికనుంచి విముక్తుడయ్యే సామర్థ్యం పాల్‌కు లేకపోయివుండును.

కోలీన్‌స్ట్రాసీ నుంచి 500 గజాల దూరంలో 95 వ పోలీసుస్టేషను ఉంది. ఈబీట్‌లో పని అంత సరళమైనదీ, సుఖప్రద మైనదీ కాదు. మామూలుకంటె యీమధ్య శిక్షలూ, బదలాయింపులూ జోరయ్యాయి కొంతమంది కానిస్టేబుళ్ళను శిక్ష కొరకు ఇచ్చుటకు పంపేవారు అల్లర్లు ప్రారంభమయ్యే సమయాల్లో ధైర్యస్థైర్యాలకు పేరుపొంది యుద్ధానికి సిద్ధమయ్యే పోలీసులను వెదకి పంపుతూంటారు.

సోమవారం ఉదయం ఇంకా చీకటిగా వుంది. మోటారు లారీ నుంచి బస్తాలు, చాపలు, గడ్డి స్టేషనులోకి దింపుతున్నారు సైనికబలాలు 12 గంటలనుంచీ సిద్ధంగా వుండాలి అనే ఆజ్ఞతో పంపబడ్డాయి. ఆప్రాంతాన్ని పరిచయం చేసుకునేందుకు పాత పోలీసులతో వీరు కూడా తిరుగుతూ వుండాలి

ప్రశ్న

లారీలు వస్తోన్నప్పుడు వల్నర్ కిటికీ దగ్గరకు వెళ్ళాడు. నలభై రెండేళ్ళ వయస్సు ఉంటుంది లారీల్లోనుంచి తేలిగ్గా క్రిందికి దూకుతూన్న క్రొత్త పోలీసుయువకుల్ని వింతగా చూస్తున్నాడు. ఒక లారీలోంచి బరువు పెట్టెలు మోసుకొని రాబడుతున్నాయి. క్రొత్త పోలీస్లులు మేడ మీదకు గబగబా వచ్చేస్తున్నారు క్రొత్తగా యుద్ధంలో ప్రథమ శ్రేణిలో నిలబడేందుకు పంపబడిన సైనికుల వదనాల వలెనే వారి ముఖములలోని నరాలన్నీ ఉబికి ఉన్నాయి. వారి మనస్సుల్లో ఉండే ఆందోళన, భయం—అద్భుత సాహసాలను చెయ్యాలనే కోరికల్తో కూడిన భావాలను ప్రదర్శిస్తున్నాయి వారి వదనాలు.

వసారాలో ఒక ఉద్యోగి అధికార స్వరం మ్రోగింది తక్షణం ఆపోలీసులు మడమలు తిప్పారు. "ఈస్పెషల్ రిజర్వు" దళముల కాప్టెన్, లెఫ్టినెంటు గదిలోకి మాయమయ్యాడు.

తమ స్వంతగృహాలలో కంటె యెక్కువ చనువుగా నవ్వుతూ త్రేల్తూ ఆరిజర్వు పోలీసులు కేరింతాలు కొడుతూండటం చూస్తూంటే అవసవ్యంగా కనపడుతూన్నది. వల్నర్ ఈస్టేషనులో పదేళ్ల పాటు వీధి "ద్యూటీ" లో వున్నాడు. ధక్కా-మొక్కీలు తిన్నాడు. ఆపేటకార్మికులంటే అభిమానం లేదు కాని వీళ్లు ఎప్పుడూ కష్టాలు కల్గిస్తూ

గందరగోళం చేస్తూనే ఉంటారు. గార్డియన్స్ ఆఫీసులోనో, లేబరు ఎక్స్ఛేంజిలోనో, ధర్మశాలల్లోనో, ఎక్కడో ఒకచోట ఎప్పుడూ దెబ్బలాటలు జరుగుతూనే వుంటాయి. ఆడాళ్లు మరీ గడుగ్గాయలు పోలీసుయూనిఫారంమీద ఉమ్మేయడం వారికి నిత్యకృత్యం. ఇంతకంటె అసహ్యప్పన్లు కూడ చేస్తారు. డ్యూటీప్రకారం వాళ్ల గదుల్లోకి, వంటిళ్లలోకి వల్నర్ వెడుతూన్నప్పణ్నుంచీ అనేక విషయాల్ని మూగకళ్లతో చూడటం నేర్చుకున్నాడు. జీవితాలకంటె ఆ కార్మికులు పోగొట్టుకోదగిన వేమీ వాళ్లదగ్గర లేవు! అని తెలిసికొన్నాడు వల్నర్. అట్టి జీవితాలకంటె మరణం అనేక రెట్లు కోరుకోదగ్గది లాగు ఆతనికి కనిపిస్తూంది.

గడ్డాలురాని ఆలేతముఖాల్ని చూస్తూంటే ఆతనికి నాలుగు వారాలక్రితం జరిగిన ఒక దృశ్యం జ్ఞాపకం వచ్చింది. రీనికెండార్ఫర్ స్ట్రాసీలో ఇద్దరితో తాను రాత్రి గస్తీ తిరుగుతూంటే హఠాత్తుగా ఆరేళ్ల కుర్రాడు పరిగెత్తుతూ వచ్చాడు అంతమందంగా వున్న పోలీసుకోట్లలోకే చలి జొచ్చుకొని వచ్చి కరుస్తూంటే ఆకుర్రాడికి మేజోళ్లూ లేవు. బూట్లు లేవు! ఇప్పుడే నిద్రనుంచి లేచినట్లు కనపడుతున్నాడు. చలిచేత పిడచగట్టుకుని పోయిన ఆతెల్లని చిన్న దేహంమీద ఒక చిన్న చొక్కా తప్ప మరేమీ లేదు. హృదయభేదకంగా అమ్మా! అమ్మా! అంటూ వెక్కి వెక్కి యేడుస్తున్నాడు. కాన్స్టబుల్ను

లాగుతున్నాడు. వల్నర్‌కుకూడ ముగ్గురు పిల్లలున్నారు. ఆతని 'హాంస్' కికూడ యిదే వయస్సుంటుంది.

"బహుశా, తండ్రి తెగత్రాగివచ్చి ముసిల్దాన్ని పట్టుకు బాత్తున్నాడేమో అన్నాడొక కాన్‌స్టేబులు అసహ్యంతో.

"ఇట్టి విషయాల్లో జోక్యం కలుగచేసుకోకూడదు. వల్నర్! ఆకుటుంబంలో ఏంజరుగుతూన్నదో తెలసి కోవడం మనపని కాదు. చివరికి వాళ్లింట్లో శాంతి భంగపరిచినందుకు ఎదురు నిన్ను దూషిస్తారు" కాని వల్నర్ ఆకురాౖడి చెయ్యి పట్టుకుని తోడి వారికేసి తిరిగాడు.

"మీరిక్కడే వుండండి—ఇప్పుడే చూశొస్తాను"

వాళ్ళలోఒకడు భుజాలు ఎగరవేస్తూ "ఔను మీరు పెద్దఉద్యోగస్తులు" అన్నాడు.

ఆకుర్రాడు వెనక దొడ్డినుండి మెట్లెక్కుస్తున్నాడు వల్నర్ టార్చి వేశి ధూళిధూసరితమైన మెట్లు యెక్కుతూ చివరికి సగం తెరిచివున్న తలుపు దగ్గరికి వచ్చాడు. కుక్కి మంచం దగ్గరఉన్న కుర్చీమీద ఒక బుడ్డిదీపం కునికిపాట్లు పడుతున్నది వల్నర్ గది కలియచూశాడు. ఆగదిలోవున్న ప్రక్కఅదొక్కటే! దీపపుక్రీనీడను చేతులుకడుక్కునే నీటి తొట్టి వున్నది. దాని అంచులమీద రక్తం చారికలు కట్టివుంది.

# అన్నా

కళాకాంతులు తగ్గి వెలవెలపోతూన్న ఒక స్త్రీ ముఖం మీద దీపకాంతి ప్రసరిస్తూంది క్రిందికి వ్రేళ్ళాడుతూన్న ఆయువతి చేతిని మరల ప్రక్కమీదపెట్టేటప్పుడు చల్లటి రక్తహీన మైన శరీరంలో ప్రాణం తటతటకొట్టుకుంటూన్నట్టు అనుమానం తగిలింది. చాలబలహీనంగా నాడి కొట్టుకుంటూన్నది. వైద్యుణ్ణి పిలిపించినా "క్షయః రక్తస్రావం" (Galloping consumption Hemorrhage) అనే సర్టిఫికేట్ ఇవ్వడం తప్ప వేరేప్రయోజనం ఉండదు. కాదు! అసలు కారణంమరొకటి! ఇదికానేకాదు. అని అనుకున్నాడు పి. సి. వల్నర్—

మరణిస్తూన్న ఆస్త్రీ విలక్షణవదనం కేసి అరగంట పైగా చూస్తూ కూర్చున్నాడు. ఆరాత్రి నిశ్శబ్దత మహాగంభీరంగా వుంది.

ఆయువతి చెక్కిలి వింతగా ముందుకు పొడుచుకు వచ్చింది. గిట్టకరుచుకు పోతూన్న నోటిపళ్ళ సందునుంచి ముఖంమీదుగా పల్చటి లేత మెరుపురంగు రక్తం ధారగా వచ్చింది. దానితో నీరసించిన ఆగుండె మరిఆడలేదు.

ఒక బల్లసొరుగులో లోరెంథాల్ అండ్ కో వారిచ్చిన కొన్ని జీతాలకవర్లు ఉన్నాయి.

15 మార్చి 1929 నుండి 22 వరకు చేసినపని:—

8 కుట్టిన దుస్తులు.........16 మైక్స్

అడ్వాన్సు.........10

---

శేషం 6

బెర్లిన్ మార్చి 26, 1929

దీనిక్రింద ఆరోగ్యభీమా కార్డు ఉంది. "మార్గాఫిషర్ సతి వితంతువు; జననము 4 జూలై 1894; వృత్తి బట్టలకుట్టు" హాడిలిపోయి ఆమృత్యుశయ్యను చూచాడు. ముసిలిదాని లాగు ముడుతలు పడిన ముఖం గల ఆస్త్రీ—35 యేళ్ళ యువతే! ఏడుస్తూన్న ఆ అనాథ బాలకుని తనతో స్టేషన్‌కు తీసికెళ్ళి మరుసటిపుదయం పురపాలక అనాథ శరణాలయము లో జేర్చాడు.

ఆగదిలో గడిపిన అరగంట వల్నర్‌ను చాలా ఆలోచనపరుణ్ణి చేసింది. బట్టలకుట్టు పనిచేస్తూన్న మార్గాఫిష ర్‌ను 35 ఏళ్ళకే ముసిలిదాన్నిగా చేసిన ఆజీవితం ఏరకంగా వుండిఉంటుంది!

' ' ' ' ' '

మరుసటి రోజున వల్నర్ తన్ను ప్రదేశంనుంచి మరొక ప్రదేశానికి బదలీచెయ్యమని పెట్టుకున్న అప్లికేషన్ నిరాకరింపబడింది.

"ఎంతో కాలంనుంచీ పనిచేస్తూన్న నువ్వు యీలాంటి విషమసమయంలో శత్రువులదగ్గర్నుంచి పారిపోతా ననేందుకు సిగ్గులేదూ? నీకంటె చిన్నవాళ్ళను చూసైనా నేర్చుకో, యుద్ధంలో పనిచేశావా?"

"చేశానండయ్యా"

"ఐతే యీ "యెర్ర తుంటర్లం"టే భయం వేస్తూందా వల్నర్"

"లేదండయ్యా"

"పై అధికార్ల నుంచి నువ్వంటే మంచిఅభిప్రాయంతో రిపోర్టులు రాకపోతే ఆతుంటరి మూకఅంటే నీకు అభిమానండుంది అని అనుకోవాల్సి వస్తుంది. నీ ఐడెంటిఫికేషన్ నంబరు?"

"2304, అయ్యా." జిల్లాకమాండర్ తననోటుపుస్తకంలో వ్రాసుకున్నాడు.

"ఏమీ జాలి పడకూడదు బుధవారంనాడు. అర్థమైందా, వల్నర్! నీకు వ్యతిరేకంగా ఏమీచాడీలు రాకూడదు— ఇక, పో!"

కాన్‌స్టేబుల్ వల్నర్ గార్డుగదిలో ఒకనిమిషం ఆగాడు. నిశ్చేష్టితుడయ్యాడు. చాలా కాలంనుంచీ పనిచేస్తూన్న మాట వాస్తవమే! అసహ్యకరమైన యీ ప్రష్యన్ ఉద్యోగి గుర్రుమంటూంటే ఆతని బుర్రలో ఏదో ఫెడేలున కొట్టినట్టయింది. మడమలు దగ్గరకు పెట్టు; వేళ్ళు ముందుకుచాచు! గడ్డం పైకిపెట్టు:గుండెలుచాచు: చిత్తంబాబు: లేదుబాబు...ఫో నోరుమూసుకో......అవతలికిఫో!...... రోషంతో వల్నర్ పళ్లు కొరికాడు.

"శత్రువులదగ్గర్నుంచి పారిపోవడం!" అంటాడా కలొనల్ అట్లా ఐతే వాళ్లు — శత్రువులా? బట్టలుకుట్టే మాస్టాఫిషర్ కూడాశత్రువే కాదూ?

ముందున్న తలుపులు తెరుచుకొని సైనికోద్యోగి వచ్చాడు వల్నర్‌కు అప్పుడు స్పృహవచ్చింది. సలాంచేశి ఆగదినుండి నిష్క్రమించాడు.

కలనల్ కోపంతో మండిపోయాడు. ఆశ్చర్యంతో నిలబడి పోయిన సైనికోద్యోగిని తుపాను ముంచెత్తింది. "ఈస్టేషన్ నుంచి వెళ్లిపోతాననే వాళ్లలో వీడు నాలుగవ వాడు. వీళ్లందరికీ హఠాత్తుగా పిచ్చెక్కిందా? అందరూ పెద్ద వాళ్లే! అనేకసంవత్సరాలనుంచీ పనిచేస్తూన్న వాళ్లే!"

"క్షమించండి అయ్యా," సైనికోద్యోగి సాహసించి సమాధానమిచ్చాడు "రిజర్వు దళాలతో పూర్వంనుంచి పని

చేస్తున్న వాళ్లుకలసి పని చెయ్యలేకపోతున్నారనుకుంటాను అన్నిచోట్లనుంచీ అదేరిపోర్టు వస్తోంది.

కలనల్ మళ్లీ మండిపడ్డాడు. "ఎర్రజ్యూ" లని కాల్చేందుకు వీరి అనుజ్ఞ కోరాలి కాబోలు. అబ్బే, బోడిన్— అసలు కారణం అదికాదు! చాలా కాలంనుంచీ ఇక్కడ వుంటున్నారు ఆ పోకిరీ వెధవల గాలితగిలి వీళ్లకి బుర్రలు తిరిగాయ్—అంతే.

"నిజమండయ్యా! 'ప్రజారక్షకభటులు' అని అంటూన్న మాటలు వీళ్ళ బుర్రల్ని తిప్పుతున్నాయి" అని త్వరత్వరగా సమాధానం చెప్పాడు.

బల్లమీద వున్న వెండి సిగరెట్టు పెట్టెలోంచి సిగరెట్టు తీసుకున్నాడు కలనల్. సైనికోద్యోగి వంగి సలాంచేసి అగ్గిపుల్ల వెలిగించి యిచ్చాడు.

"థాంక్స్ బోడిన్" కలనల్ కొంచం శాంతించాడు.

"ఈ వెధవ పత్రికలే దీనికంతా కారణం. డ్యూష్ టాజెస్ జీటంగ్ దగ్గరనుంచి వార్వర్ట్సు వరకూ కమ్యూనిస్టుల విప్లవప్రయత్నాలనుగూర్చి వ్రాస్తున్నాయి—అది అంతా వాట్టిపాల్లు. శుద్ధాబద్ధం—యూదులపేపర్లు అల్ స్టైన్, మోసెలు, సరేసరి వీటికి నాయకత్వం వహిస్తాయి. ఈచెత్త అంతా మన మనుష్యులు చదువుతారు. సహజంగానే పిరికిపందలౌతారు. ఏతేంతే, దానిలెఖ ఏముంది? ఆత్మరక్షణ అనేదీ ఊపిరి సలప

కుండా కాల్చిపారవేశేదీ! మంచి పందెపుగుర్రాలుకూడా కొన్నికొన్ని సమయాల్లో జంకుతాయి”

“సార్! మాతూర్పు ప్రష్యాయువకుల్ని మరిచిపోకండి. వాళ్ళింకా “శ్రామికవర్గతత్వం” లోకి దిగి చెడిపోలేదు.”

“వాళ్ళ మీాద ఆధారపడి వుండవచ్చుననే నమ్మకముందా నీకు. వాన్‌మాల్జాన్ చలాకీ ఐన తనసైనిక యువకుల్ని చూచి పొంగిపోతున్నాడు. సరే, బోడిన్ పనికివెళ్ళు. చెయ్యవలశింది బోలెడంత ఉంది. సంతకాలు పెట్టవలశిన ఉత్తర ప్రత్యుత్తరాలకట్ట ఇల్లాపడెయ్యి.”

బోడిన్, కలనల్ ఎడమచేతి వైపుకి వెళ్ళి ఒకఉత్తరం తరువాత మరొకఉత్తరం అందిస్తున్నాడు.

z z z z z z

95 నెంబరు పోలీసుస్టేషనులో గంద్రగోళమూ హడావుడీ జాస్తి అయ్యాయి. పోలీసు లందరూ తుపాకులు దట్టించి సిద్ధంగా ఉన్నారు. 15 మంది కంటె ఎక్కువ ఉండని ఆస్టేషనులో ఇప్పుడు 150 మంది తొక్కిసలాడుతున్నారు. ఇంత క్రితం మొత్తము 6 గురు సాదాపోలీసులు ఉండేవారు. ఇప్పుడు రహస్యాలు తెల్పే గూఢచారులు చాలమంది ఉంచబడ్డారు. వారిలో చాలమంది వృత్తిదోషులు, తార్పుడు గాళ్ళు—

నికృష్టమైన మఫ్టీ వృత్తికికూడా శీలంలేని వాళ్ళు తమ సహచరులనే మోసగించారు కనుక, వారు పూర్తిగా తమ రక్షణకు పోలీసులమీద ఆధారపడి వున్నారు.

క్రొత్తగా వచ్చిన పోలీసులతో జరిపిన సంభాషణలబట్టి కేవలం నిషేధపుటుత్తరువును అమల్లో వుంచడమే కాకుండా ఇంకా చాలా చెయ్యదలచుకున్నట్టు వల్నర్ గ్రహించాడు. బజారు పోరాటపు వివిధవిధానాలను గూర్చి, హఠాత్తుగా గుంపుమీద పడి చెదరగొట్టడం వీధుల్లో నుంచి శవాల్ని లాగెయ్యడం మున్నగువిషయాల్ని గూర్చి తప్ప మరొకమాటలేలేవు. మేడలమీద చేతితుపాకుల నుపయోగించాలా? లేక రైఫుళ్ళను వాడాలా? అనేవిషయాన్ని గూర్చి తీవ్రమైన చర్చచేస్తున్నారు. అంతర్యుద్ధ పద్ధతుల్లో వారనేకమాసాల్నుంచీ శిక్షణబడశారని వారి చర్చలు విన్నవారు గ్రహింపగల్గుతారు.

బెర్లిన్ వచ్చేవరకు, వారిలో చాలమంది వార్తాపత్రికలు చదివిన పాపాన్ని పోలేదు. వారిలో అధిక సంఖ్యాకులకు రాజకీయాల పొడగిట్టదు. కొంతమందికి రాజకీయాలంటే అర్థంకూడా తెలియదు. "కార్మికుడు" అనేపదం వారికి "శత్రువు"తో సమానమే. మే దినోత్సవాలు 1918 వ విప్లవం తర్వాత కమ్యూనిస్టులచేత ప్రారంభింపబడ్డా యని ఒకడు

ఘట్టిగా వాదిస్తున్నాడు ఈ బుద్ధితక్కువ ప్రేలాపనను కాదన్న వాణ్ణి చూడలేను వల్నర్ ఆయుతాలో.

అనేకవిషయాల్ని గూర్చి వీళ్ళతో మాట్లాడాలని వుంది కాని భయపడ్డాడు. కలనల్ కఠిన స్వరం యింకా చెవుల్లో గింగుర్లెత్తుతోంది.

‡ ‡ ‡ ‡ ‡

ఆ పోలీసు యువకుల మధ్య ఒక 22 ఏండ్ల యువకుణ్ణి బాగా మనస్సులో వల్నర్ పెట్టుకున్నాడు. ఆతడస్తమాన మూ కిటికీ వద్ద కెళ్ళి వంతెనవైపు చూస్తున్నాడు.

"ఆ పైదే కదూ వీసెన్ ప్రాసీ?" అని ప్రక్కనున్న వల్నర్ నడిగాడు.

ఆ అసిస్టెంటు సార్జెంటు వరాకుగా గ్రుడ్లప్పజెప్పి కిటికీ లోంచి చూస్తున్నాడు హఠాత్తుగా వెనక్కి తిరిగాడు. ఆతని ముఖం నూతనమైన ఉద్రేకభావాల్ని చూపుతూన్నది.

"తెలుసునా సీకు?..........ఇదే మొదటి సారి నేను బెర్లిన్‌లో అడుగు పెట్టడానికి" కంపిస్తూన్న ఉద్రిక్త కంఠస్వరంతో మెల్లిగా అన్నాడు. "ఈ అపాయ కరమైన సమయంలో మా తూర్పుప్రష్యా వాళ్లని పిలిపించడం ఒక గొప్ప గౌరవం........"

ఆగి తనమోటచేతులవైపు నిశ్శబ్దంగా చూచుకు న్నాడు తనలో తాను మాట్లాడు కుంటూన్నట్టు మళ్లీ ఆరం భించాడు.

"ఇదో గమ్మత్తైన విషయంకాదూ?.........అధి కారాన్ని కలిగి ఉండటం! నీకూ్కడా అట్లాగులేదూ? లేక పోతే బెర్లిన్ నుంచివచ్చిన పట్టణవాస్తవ్యులంతా మమ్మల్ని ఆక్షేపిస్తూంటారు. చితకా బతకా చావబాదుతే అంతచులాగ్గా మాపల్లెటూళ్ల వాళ్లని చూడరనుకుంటాను. ఇన్స్పెర్ బర్గులో సీసామీద గ్రుడ్డుపెట్టి ఒకదాని తరువాత మరొకటి గా మూడుగ్రుడ్లను 50 గజాల దూరంనుండి తుపాకితో కొట్టేను. ఎప్పుడు వస్తుందా అని తహతహ లాడుతున్నాను"

"సోమవారం నాడు తుపాకులు కాల్చాలని ఎవ్వరు చెప్పారు నీకు?" అని ఆశ్చర్యంగా వల్నర్ అడిగాడు.

తూర్పుప్రష్యన్ ఆశ్చర్యపడినట్టుగా కన్పించాడు "హా! హా! అని నవ్వడం ఆరంభించాడు." బలేగమ్మత్తుగాడివే! కమ్యూనిస్టు లందరూ తుపాకులూ, మరఫిరంగులూ చూచు కోకుండా విప్లవానికి తయా రయ్యారను కుంటున్నా వేమిటి?"

వల్నర్ చాలా గాభరా పడుతున్నాడు. "ఎవ్వరు చెప్పారోయ్ కమ్యూనిస్టులు తుపాకుల్తో తయారా తున్నారని?"

బాగుంది, కాప్టెన్ వాళమాల్జానే చెప్పాడు ఇంకా బోలెడంత ఈ 'ఎర్రచెత్త' ని గూర్చి చెప్పాడు.

ఆ పోలీసుయువకుణ్ణి వదలిపెట్టి ఆగదిలోనుంచి మళ్ళీ మాట్లాడకుండా వల్నర్ వెళ్ళిపోయాడు.

† † † † †

నమ్మకస్తుడు, గంభీరస్వభావుడు వల్నర్ అని అందరి ఉద్దేశ్యం అందుచేత, మొదటిగ స్తీనుంచి 5 గంటలకి వల్నర్ తిరిగి రాగానే ఇన్‌స్పెక్టరు ఒక పోలీసు ఆజ్ఞాపత్రాన్ని చూపించాడు.

తూర్పు పోలీసు జిల్లా డిపార్టుమెంటు.
బుల్, 2044/29.
26 ఏప్రిల్, 1929

ఊరేగింపు నిషేధాజ్ఞల నతిక్రమించిన సందర్భాలలో పోలీసుల చర్యలు నిశ్చయచిత్తముతో లేవని మాకు రిపోర్టులు వస్తున్నాయి. ప్రజలు రాళ్లు రువ్వుతోన్నప్పుడు పోలీసు లాఠీలతో బాది గుంపులను చెదర గొట్టుచున్నారే. కాని నాయకుల్ని అరెస్టుచేసి నిర్బంధంలో వుంచడంలేదు. ఈచర్యతో అధికారులేమీతృప్తి పొందడంలేదు. కొంతమంది లాఠీచార్జి చేస్తూన్నప్పుడు మిగతా వారు ఊరేగింపులో

పాల్గొన్న వారిలో ననేకమందిని అరెస్టుచేసి తీసికొని రావల యునని అభిప్రాయపడుతున్నారు.

(సంతకం) బాసుడో

ఇంతతోటే ఊరుకొమ్మన్నారే! అని వల్నర్ ఆశ్చర్యపడ్డాడు. క్రమక్రమంగా సంగతి సందర్భాలన్నీ ఆతని మనస్సుకి గోచరమౌతున్నాయి. వీరు పన్నిన పన్నాగం శిక్షవిధించే నెపం మీద కోలిన్స్ట్రాసీని ముట్టడించి సర్వనాశనం చెయ్యడం అని తెలుసుకున్నాడు. వాళ్లు బహిరంగంగా మాట్లాడు కోకుండా యీవిషయాన్ని గోప్యంగా వుంచుతున్నారు. కోలిన్స్ట్రాసీలోని 23 భవనాల కిటికీల్లో నుంచి 80 ఎర్రజెండాలు వేళ్లాడగట్ట బడ్డాయని తెల్పినప్పుడు కలనల్ పళ్లుకొరుకుతూ "చూడండి మే 1 వ తేదీని యీచెత్తనంతా తీసిపారవేస్తాం." అని అన్నమాట జ్ఞాపకం వచ్చింది. ఆమాటల అర్థం ఇప్పుడు స్పష్టమౌతూన్నది.

మరి మూడునెలలు పనిచేశేట్టయితే వల్నర్కు 10 ఏళ్ల సర్వీసు పూర్తి ఔతుంది. 1929 లో సోషల్ డెమాక్రాటిక్ పక్షం వారు ప్యాసుచేసిన పోలీసు చట్టం ఆతనికి కంతత వచ్చును.

"9, 10 భాగములలోని షరతులు లేకపోయినప్పటికిని 10 సం॥ల సర్వీసు పూర్తి అయ్యేలోపునే ఒక పోలీసుఉద్యో

గస్తునకు తనవిద్యుక్తధర్మములను సరిగా నిర్వర్తించుటకు శక్తి సామర్థ్యములు లేనిచో—ముఖ్యంగా మానసిక శరీరక పటుత్వము లేనిచో పై అధికారి అంగీకారముమీద శలవు మంజూరు చేయబడవచ్చును."

వల్నర్‌కి సర్వీసు చాలవుంది. లోపరహితమైన నడవడిక వుంది. ఐనా, ఈపనిని నెరవేర్చేందుకు వ్యతిరేకిస్తే "అవసరమైనమానసికశారీరక పటుత్వం" లేదనే నెపంపెట్టి 42 వ ఏట పనినుంచి తీసిపారవేస్తారు. ఆవయస్సులో క్రొత్త ఉద్యోగం వెతుక్కోవాలి. అన్నివిధాలా వాళ్లుఉచ్చు బిగించగలరు.

'మామూలు అధికారరీత్యా కాకుండా, తిన్నగా పోలీసుప్రెశిడెంటు దగ్గరకే ఎందుకు వెళ్ళకూడదు?' ఆయనకూడా తనపార్టీ కామ్రేడేగా! యీఆలోచనకి వల్నర్ తనలో తానే నవ్వుకున్నాడు. అభివృద్ధి నిరోధకుడైన కలనల్, పోలీసుప్రెశిడెంటుగారి ఆత్మీయుల్లో ఒకడని అందరికీ తెలుసును. ఈప్రయత్నం వల్ల ఫలితంసున్నా!

సాయంకాలం కాప్టెన్ గదిలో ఎవ్వరూలేనప్పుడు వల్నర్ వెళ్ళి పెద్దపెట్టెలో వున్న ఉక్కుశిరస్త్రాణాలు, చేతితో విసరెడి బాంబుగుండ్లు (హాండ్‌గ్రెనేడ్సు) మర ఫిరంగులు 3 తేలికవి 1 పెద్దది. 98 మోడలు చిన్నతుపాకులు (కార్బైన్సు) 400 చూచాడు.

# అన్నా

మంగళవారం ఉదయం భవననిర్మాణపు పనివాని ఇంటిదగ్గరనుంచి వెడుతూ తన తోటిపని వాళ్ళలో ఏదో విశేషం జరుగుతూండటం కర్టు చూచాడు. వాళ్ళతో మాట్లాడేందుకు కూడా ఓపికలేనంత ఆయాసపడి వున్నాడు. నిద్రించేందుకు కూడా సమయం దొరకడం లేదు. "వెడ్డింగ్—కార్మిక" అనే వీధిసంఘపు పత్రికను మడిచి అంటించ వలసివచ్చింది. అన్నా సహాయంచేసినప్పటికీ రాత్రి మూడుఘుంటలైంది. ఫ్యాక్టరీల్లోనూ, కోలిన్ స్ట్రాసీ ఇండ్లలోనూ నిరుద్యోగకామ్రేడ్‌లు ఆవుదయం పత్రికల్ని పంచిపెడుతున్నారు. ఈపనివాళ్లు కూడా మే దినోత్సవంలో పాల్గొనేందుకు తయారుగా ఉన్నారు. న్యూకోన్‌లో వున్న ఆకాశసౌధం పైనికూడా ఎర్రజెండాను కట్టాలని కార్మికులు సంకల్పించు కున్నారు. తదితరులు అక్కడ కెక్కి తీసివేయలేరు......

ఈ ఆఖరుపని రోజుకూడా పూర్తిఐపోతే! రోజు రోజుకీమోతపని మరీదుర్భరమై పోతోంది. గతవారంలో ఆతనికి రాత్రికి మూడు నాలుగ్గంటలు నిద్రించేందుక్కూడా అవకాశం లభించలేదు. మే దినోత్సవానంతరం తీరుబడిగా నిద్రించవచ్చును. ఈరోజుల్లో భోజనం, నిద్రలకంటె పార్టీపని చాలాముఖ్య

మైనది. కర్టు తన ప్రాతపని లాగు మీద తోలుపటకా బిగించు కున్నాడు. ఎముకలన్నింటినీ అదిమిపట్టి వుంచేందుకు ఆపటకా వుపయోగిస్తుంది.



"............జాగో కూడా దాన్ని అంతకంటె బాగా చెయ్యలేడు" "అబ్బే, నువ్వు పొరబడుతున్నావు—ముందుగానే రక్తపాతం జరుగుతుందని వాడు చెప్పాడు."

"ఇది కొంచంవినండోయ్......... ఇదిలెఖ చెయ్యకుండా ఎవరైతే మే ఒకటవ తేదీని వీధుల్ని తనరాజకీయ భావోద్రేకాలకి ఆటస్థలంగా చేస్తారో.........' ఆ పంది మేదినోత్సవం జరపడాన్ని 'రాజకీయ భావోద్రేకం' అంటున్నాడు చూడండి!"

తాపీపనివాడైన టాలీ ఆ పత్రికను కోపంతో నేల కేసికొట్టి వెడల్పైన తనచేతుల్ని దుర్గంధపదార్థాని ముట్టుకున్నట్లు లాగుకు తుడుచుకున్నాడు.

కర్టుకు ముసలిటాలీ సోషల్ డెమాక్రాట్ పార్టీకి చెందినవాడని తెలుసును కర్టు ఆతనివైపు తిరిగి "ఫ్రిట్జ్, అది ఇట్లా ఇయ్యి అదేమిటో చూస్తాను." అన్నాడు.

"ఇంతవరకూ అది చదువలేదు నువ్వు, కర్టూ?— ఇది పోలీసుప్రెసిడెంటుగారు తనబెర్లిన్ ప్రజలకు జారీచేసిన ఆజ్ఞ !"

అని గద్గదికస్వరంతో టాలీ అంటూ క్రిందపడిన కాగితాన్ని మళ్లీ తీసుకున్నాడు "ఈలాంటి పంది పార్టీ సభ్యుడు అనుకునేందుకూ-ఛా పరమ అసహ్యంగావుంది." ఆగుడిసెలోంచి పొగాకు ఊటను తుబుక్కున ఉమ్మేశాడు.

కర్టు 'వార్వర్ట్సు' ను చదువుతూ కోపావేశపరవశుడయ్యాడు.

"......కమ్యూనిస్టుల ఇచ్ఛానుసారంమే ఒకటవ తేదీని వీధుల్లో రక్తం ప్రవహించవలసి వుంది! కాని అది ఎన్నడూ జరుగదు! బెర్లిన్‌లో జరిగే ప్రతిసభా కూడా కమ్యూనిస్టుల కుట్ర చేతనే చెయ్య బడ్తుందని నేను నొక్కి చెబుతున్నాను. ఈ నిషేధాన్ని ధిక్కరించి వీధుల్ని ఎవ్వరు తమ 'రాజకీయ భావోద్రేకాలకి ఆటస్థలంగా చేస్తారో వారు తమ అనుచరులతో సహా గొప్పనష్టం పొందుతారు. శాంతిని కోరే బెర్లిన్ ప్రజలందరినీ — ముఖ్యంగా స్త్రీలనూ పిల్లలనూ— ఉత్సవంచేసేందుకు చేసే ప్రయత్నాల్లో పాల్గొనవద్దనీ, వీధుల్లో అనవసరంగా నిలబడవద్దనీ, లా, ఆర్డర్లని కాపాడేందుకు సహాయపడమనీ కోర్తున్నాను.— జార్జిబెల్."

తక్కిన కార్మికులు కర్టువైపు చూచారు. విప్లవ కార్మిక సంఘాల నిర్మాణకర్తగా పనిచేస్తూ, దృఢనిశ్చయంతో ఎల్లప్పుడూ కార్మికుల తరఫున పనిచేస్తున్నందున కర్టు, కార్మికుల్లో

మంచి పలుకుబడి సంపాదించాడు. అందుచేతనే 8 రోజుల క్రితం మే దినోత్సవ సంఘంలో కార్మికప్రతినిధిగా యెన్ను కోనబడ్డాడు.

కర్టు పత్రికను క్రిందకి జారవిడిచి పైకి చూచాడు. "స్నేహితులారా! బలేమంచివాడు, మనప్రెశిడెంటు! మనం దర్నీ తుపాకుల్తో కాల్పించాలని వాడిఉద్దేశ్యం! దీనికంతకీ కమ్యూనిస్టులే కారణ భూతులని వారి నెత్తిమీద రుద్దాలని వాడు ముందుగానే యిట్లా ప్రకటిస్తున్నాడు."

అవతల ఘోరుమ్మని యీాలగర్జించింది. కొందరు లేచి తలుపులదగ్గరకు వెళ్లారు.

"ఒక్కనిమిషం ఆగండి" అని కర్టు వారినిపిలిచాడు. "బాస్ యీారోజున కొంచెంసేపు ఆగగలడులెండి! మనం యేంచెయ్యాలో ఈరోజునే నిశ్చయించుకోవడం మంచిదను కుంటాను."

కూలీలాగి ఆతనిముఖంకేసి చూశారు.

"మనఘరంలోంచి మనం పోలీసుప్రెశిడెంటు వద్దకు స్వయంగా వెళ్లి మాట్లాడటం మంచిదని నాసలహా. అది ఉపయోగిస్తుందో, లేదో, చెప్పలేనుకాని కార్మికులం కాబట్టి అట్లా చెయ్యడం మనవిధి."

"తుపాకుల్తో కాల్చండి మమ్మల్ని అని అడగాలనే మిటి నీవుద్దేశ్యం, కర్టూ?"

"ఏలెక్సుకు వెళ్ళి ముఖంవాచేట్లా చీవాట్లుపెట్టండి అదీ చెయ్యవలసినపని."

టాలీ మెల్లిగా లేచాడు. మాట్లాడలేక పోతున్నాడని అందరికీ స్పష్టం ఔతూన్నది. "కార్మిక సోదరులారా! కర్త చెప్పింది సరిగ్గా వుంది. మదాహ్నభోజనసమయంలో కార్మికులంతా కలిసి కొందరు ప్రతినిధులను రాయబారవర్గంగా యెన్నుకుని పోలీసుప్రెసీడియంకు వెళ్ళి ఆఖరు సారి మనస్మృతిలేకభావాన్ని తెల్పివద్దాం. ఆయన తప్పకుండా మన మొర ఆలకిస్తాడు. మనకుపయోగకారి ఔతుందని నానమ్మకం."

"అట్లాగే అనుకుంటూంటావ్ నువ్వు టాలీ!"

"నీకాౖమేడ్ దగ్గరికి నువ్వే స్వయంగా వెళ్ళడం మంచిది!"

ఆ కార్మికయువకునివైపు టాలీ మెల్లిగా తిరిగి సమాధానమిచ్చాడు.

"బాగావుంది. రాయబారవర్గంతో నేను స్వయంగా వెడతాను......మీరు వెళ్ళనుంటేను......"

చాల తీవ్రంగాను అసహనం తోటికి ఫోర్మన్ యీాల రెండవసారి గర్జించింది.

"శాంతించు—శాంతించు ముసిలిగద్దా! పని ఎక్కడికీ పోదులే;

"బాగుంది. కామ్రేడ్స్! తక్కిన వారితో కూడ చెప్పండి. భోజనసమయంలో ఆపెద్ద గుడిసెలో కలుసుకుం దాం." సిమెంటు దుమ్ముతో దళసరెక్కిన టోపీని నెత్తిమీద కట్టు పెట్టుకున్నాడు. ఈపని ఏమీ ఫలప్రదంకాదని ఆతడు బాగా ఎరిగివున్నా ఇదో రాజకీయపు ఎత్తు. ముసలిటాలీ— తనంతటతానే అక్కడ ఏంపన్నాగం జరుగుతూన్నదో తెలుసు కోవాలి.

ఒకటింపాతిక హండ్రదువెయిటు బరువున్న సిమెంటు బస్తా అనుకున్నదానికంటె తేలిగ్గావున్నట్టు కట్టుకు అనిపిం చింది. ఈరోజున తోడిపనివాణ్ణి కలుసుకున్నప్పుడల్లా ఏవో కొన్నిమాటలు చెపుతూనే వున్నాడు. మధ్యాహ్న భోజనం వేళకు ఆపనిలోవున్న కూలీలందరూ ప్రెశిడెంటువ్యాసాన్ని చదివారు.

భోజనసమయంలో ఒక రాయబారవర్గాన్ని ప్రెసి డెంటు వద్దకు పంపేందుకు తీర్మానించుకున్నార్లు. ముసలి టాలీ, కట్టు, ఏసంఘానికి చెందని మరొకకార్మికుడు వీరు ముగ్గురు రాయబారవర్గం. ఈముగ్గురు ఒక గంట సెలవు కోరి నప్పుడు ఫోర్మన్ ఆశ్చర్యపడ్డాడు కాని అతడేమిచెయ్య గలడు?

అలెక్జాండరుప్లాజ్ వద్ద ఆవిరి సుత్తులు భూబిలపు పని చేస్తూ పెడబొబ్బలు పెడ్తున్నాయి. ఉరుముతున్నాయి. వంతెన

దూలాల మీద మోటారు బస్సులు టకటక ధ్వనిచేస్తూ పరిగెత్తుతున్నాయి. క్రింద కూలీలు బిలమార్గాల్లో ప్రాకుతున్నారు. గుట్టలమధ్య నున్న ఇరుకు త్రోవల్లో కూలీలు చీమల బారులాగు వెడుతున్నారు ప్రాంతీయరైళ్లు వంతెనమీద పరిగెత్తుతున్నాయి. అలెగ్జాండర్ ప్లాజ్—రాత్రింబగళ్లు పిచ్చెత్తినట్లు ధణధన్ మను సుత్తిదెబ్బల్తో మారుమోగుతూండే అలెగ్జాండర్ ప్లాజ్ పొగతోటీ, మురికితోటీ, చెవులు గింగుర్లెత్తే ధ్వనితోటీ, బాధపడ్తూ ఇటూఅటూ పరిగెత్తే కార్మికుల్తోటీ నిండివుంది.

ఆ చౌకుకు దక్షిణంగా ఎర్రఇటికల్తో, చవుడోడుతూన్న భీకరమైన బెర్లిన్ 'పోలీసుప్రెసీడియం' ఉంది. అది బెర్లిన్ యొక్క "లా అండ్ ఆర్డర" శిరస్సు, హృదయమూను: నలభై లక్షలప్రజలు నివసించే యీమహాపట్టణం మూలమూలల్లోనూ తన శాఖోపశాఖలను వ్యాపింపచేసిన నరముల కేంద్రస్థానం అది: కార్డుసూచికలతోటీ, వారంట్లు, ఫోటోగ్రాఫులు, వ్రేలు ముద్రలు కుప్పలు కుప్పలుగా పడున్న బీరువాల్తోటీ అది నిండివుంది ఇక్కడే రాజకీయకార్యాలయాలన్నీ వున్నాయి. రాజకీయ డిపార్టుమెంటులో కమ్యూనిస్టు ప్రముఖుల పేర్లన్నీ జాగ్రత్తగా పట్టికలో చేర్చబడి వున్నాయి.

'ఎలెక్సు'లో వున్న యీ ఎర్రఇటికల భవనం, క్షుద్ర జంతువుల్తోటీ, పెద్దకార్లతోటీ, కిటకిటలాడ్తూంటుంది. బెర్లిన్

నివాసులు దాన్ని "నల్లులకోట" అని పిలుస్తూంటారు. ఎర్ర పోలీసుప్రెశిడెంటు, ఎమిల్ ఈకార్న్, పరిపాలిస్తున్నప్పుడు స్పార్టాకస్ ఇచ్చటనే యుద్ధంచేశారు. అసంఖ్యాకులైన విప్లవ కార్మికులు దారుణమైన బాధలు పడ్డారు. అనేకశిక్షలు పొం దారు. మళ్ళీ ఇచ్చటనే ఈరోజున "అందుచేత, రక్తము బెర్లిన్ వీధుల్లో మే మొదటి తేదీన ఏరులై 'పారవలసివున్నది" అని వ్రాసిన ఆయన నివసిస్తున్నాడు; పరిపాలిస్తున్నాడు!

* * * * * *

ప్రిసీడియం ద్వారాన్ని కావలాకాస్తున్న పోలీసు జవాను, యీముగ్గురు కార్మికులు ద్వారందాటి, వసారాలోకి వెళ్తూంటే అనుమానంగా చూచాడు. మేడే సమీపిస్తూన్న యీసమయంలో ఈలాటిసందేహాస్పదులైన కార్మికులను లో నికి పోనివ్వడం అంతమంచిది కాదేమో?.

మునలిటాలీకి కొంచంగాభరాగావుంది. ద్వారాలమీద పేర్లతో వున్న అనేకప్లేట్లు గాభరా కల్గిస్తున్నాయి. కళ్ళజోళ్లు పెట్టుకున్న పెద్దమనుష్యులు ఈనూలీలవంక క్రొత్తగా చూస్తు న్నారు. సాదాదుస్తులతోఉన్న ఒకపోలీసుఉద్యోగి ద్వారం లోంచి చూచి ఒకగుమాస్తాను పిలిచాడు. ఆతను వెనక్కు తిరిగి గబగబా లోపలికి పరిగెత్తాడు

"క్షమించండి అయ్యా........!" అన్నాడు ఆ గుమాస్తా. శిరస్త్రాణమో, టోపీయో లేకుండా ఉన్న ఏపోలీసుఅధికారినీ టాలీ ఇంతవరకూ చూడలేదు. ఈపెద్దమనుష్యులంతా స్వంతగృహాల్లో ఉన్నట్లే మసలుతున్నారు. ఇక్కడ! తానుమాత్రం తనఇంట్లో టోపీపెట్టుకొని తిరుగుతాడేమిటి? ఎందుచేతనోగాని ఆఉద్యోగియొక్క నున్నటి ప్రకాశమానమైన బట్టతల టాలీని కలవరపరుస్తోంది......

ఆభవనాన్ని తాముకూడా అందరివలెనే ఎరిగున్నట్లు ప్రెశిడెంటు గదికోసం వారు తిరుగుతున్నారు. నాపరాళ్ల మీద బరువైన వీరి మోటబూట్లు ప్రతిధ్వనిస్తున్నాయి.

వారు నిజంగా అదృష్టవంతులే! బూడిదవర్ణపు తలుపు మీద తళతళలాడే నల్లఅక్షరాల్తో అచ్చువెయ్యబడిన కార్డు బోర్డు నోటీసు అంటింపబడివున్న గది గోడ వీరికంటబడింది.

పోలీసుప్రెశిడెంటు.

ఎంక్వైరీలు : 209 గది.

టాలీ తనజేబులోవున్న అసమ్మతి తీర్మానపు కాగితం కోసం తడిమాడు. కోపంతో మండిపడుతున్నాడు. ఈపోలీసు ప్రెశిడెంటు పార్టీ కామ్రేడ్! వారందరూ కలసి అతణ్ణి యీ ఉన్నతస్థితికి లేవనెత్తారు. ఆయనగదిలోకివెళ్ళి ఈవిధంగా చెప్పాలనివుంది. "గుడ్, డే! కామ్రేడ్ప్రెశిడెంటు! ఈ తీర్మా

నం నీకివ్వాలని మేమనుకున్నాం. ఇల్లాచూడు, కామ్రేడ్ ! నీప్రకటన చూచి నీపార్టీసభ్యు లేమనుకుంటున్నారో తెలుసుకోవడానికి నీకు సరదాగా వుంటుందనుకుంటాను! ఈరకప్పని నిజంగా అసంభవము, కామ్రేడ్ ప్రెశిడెంటు!......"

ఒకగంటక్రితం యీ"కామ్రేడ్" మీాదే విసుగుతో ఉమ్మేశాడన్న సంగతి అప్పుడే అతడు మరచిపోయాడు.

"209 గది" తలుపు తట్టి వారు లోపలికి ప్రవేశించారు. ఒక బల్లవెనుక కూర్చున్న ఒకపెద్దమనిషి వారివంక ఆశ్చర్యంతో చూచాడు. "మీారేంపనిమీాద వచ్చారు. పెద్ద మనుష్యులు?"

ఉద్దేశ్యపూర్వకంగా కర్టు వెనుక నిలచాడు. ఈవ్యవహారం అంతా టాలీ చేతుల మీాదుగా జరుగవలసిందే; టాలీని కర్టు ముందుకు నెట్టాడు.

"పోలీసుప్రెశిడెంటుగారి దర్శనం చేసుకోవాలని వచ్చాం" అని పరిపూర్ణ ఆత్మవిశ్వాసంతో టాలీ అన్నాడు. బల్లవద్దనున్న పెద్దమనిషి వారివంక గౌరవంతో చూచాడు.

"మీారు పోలీసుప్రెశిడెంటుగారితో ఏమిమాట్లాడదలచుకున్నారో నాతో కొంచం చెప్తారా?" ఆపెద్దమనిషి అతివినయం చూపుతోంటే టాలీకి గాభరాగా వుంది.

"బెర్గ్‌మన్ అండ్ కోలో పనిచేస్తున్న కార్మికుల తరఫున రాయబారవర్గంగా వచ్చాము వారికి, స్వయంగా సమర్పించుకోవలసినదిగా మమ్మల్ని పంపారు."

చిరునవ్వుతో గుమాస్తా లేచినిలబడి, విచారపూర్వకంగా అన్నాడు. "బాగుంది, నాకు చాలా విచారంగా వుంది. ప్రెశిడెంటుగారిప్పుడత్యవసరమైన పనిమీద సభాసమావేశంలో వున్నారు. వారినెవ్వరూ ఇప్పుడు చికాకు పరచకూడదు! ఆకాగితం నాచేతికిస్తే, సాధ్యమైనంత త్వరలో వారికందజేస్తాను.

అట్లాకాదండి అయ్యా! అది అసంభవం........."
కర్ట్ కలుగచేసుకున్నాడు. "మేం ప్రెశిడెంటుగారితో స్వయంగా మాట్లాడాలని మాకార్మికుల నిర్ణయం!"

టాలీ తనకోటుజేబు వెతికి, మరకలుపడ్డ ఒకప్రాత సోషల్ డెమాక్రాటు సభ్యత్వకార్డును తీసి, బల్లమీద పెట్టాడు. "ఇదిగో! ఇదితీసికెళ్లి ఆయనకివ్వండి!" అనిచెప్పి ఆయనకేసిపోవకునివలె "మాచావా అది! ఎవ్వరితో మాట్లాడుస్తున్నావో నువ్వెరక్కుండా వున్నావు. మీప్రెశిడెంటు మాకాప్రేండ్ సుమా! జల్దీవెళ్లు" అని అర్థంవచ్చే చూపుచూచాడు.

గుమస్తా ఆపుస్తకం తీసి స్వంతదారునిపేరు చదివి అద్దుకాగితం అంచున వ్రాసుకున్నాడు. మళ్ళీ నవ్వుతో వినయంగా

తలవంచి ఆపుస్తకాన్ని తిరిగి యిచ్చివేశాడు. "నాకు నిజంగా చాలా విచారంగావుంది. మీరు మీఉత్తరాన్ని ఇచ్చుట వదలి పెట్టి వెళ్ళడం చాలామంచిది."

టాలీ నిశ్చేష్టితుడై తనసహచరు లిద్దరివైపు చూచాడు. "కాదు, కాదు! మాఆశీర్వచనాలు మీప్రెశిడెంటుగారి కందజేసి ఏం జరుగుతోందో మాకు తెలిసింది అని చెప్పు!" అని నిర్మొహమాటంగా కర్ట అన్నాడు. ఆతడిక సహించలేక పోయాడు. ఈరోజున్న ఎన్నో ముఖ్యమైన పనులు చెయ్యవలసి యుండగా ప్రెశిడెంటుకు ముగ్గురు సామాన్య కార్మికులను చూచేందుకు సమయం ఎక్కడ వుంటుంది. ముసలిటాలీని గదిలోనుండి బైటికి లాక్కొచ్చి తలుపుధడాలున కోపంతో వేశాడు.

"వేటకుక్కల ముఠా! వీడు. నీకామ్రేడ్ ప్రెశిడెంట్! వాడిఉద్యోగస్థులతో కూర్చుని రేపటి రక్తస్నానానికి పన్నాగాలు పన్నుతున్నాడు. వాడి అమూల్యమైన కాలంలో ఒక్క నిమిషమైనా ఒకబీదసోషల్ డెమాక్రాటిక్ కార్మికుణ్ణి చూడటంలో వృధాపుచ్చుతాడనుకుంటావా?"

ముసలి టాలీ రోషావేశపరవశుడై యేమీమాట్లాడలేకపోయాడు.

మూడవ కార్మికయువకుడు నవ్వాడు. "ఔనుగాని, టాలీ ఇదంతా మళ్లీ ఒకసారి బాగాచూచుకో! రేపీపాటికి

ఈ 'నల్లులకోటలో నువ్వు, నీకామ్రేడ్‌తో కలిశి వుండేవచ్చును. బహుశా! కాని నువ్వుమాత్రం జైలుకొట్టులో లే!"

మరికొన్ని గదులు దాటిన తర్వాత "వైస్‌ప్రెశిడెండు ఎంక్వైరీలు 203 గది" అని ఉన్న పేరునుచదివాడు.

"ఇతణ్ణికూడా చూద్దాం రండి కామ్రేడ్స్!" అని కర్టు తలుపుతట్టాడు. ప్రక్కగదిలో వున్న కార్యదర్శిని ముందు కలుసుకుని మాట్లాడేందుకు ఆగకుండా, తలుపులు తెరువబడగానే లోపలికి జొరబడ్డారు. కార్యదర్శి వారించాడు.

"పెద్దమనుష్యులూ! అల్లాచెయ్యడం అన్నినియమాలకు విరుద్ధం."

"తగలెయ్యి నీనియమాల్ని" అని కోపంగా అనుకుంటూ ఆసన్నటి మనిషిని ప్రక్కకునెట్టి, టాలీ లోపలికి వెళ్లాడు. వారి మోట బూట్ల చప్పుడు పరచి వున్న తివాసుల్లో అణిగిపోయింది.

పొడుగాటి తెరలవెనుక కిటికీ వద్ద నిలబడి వున్నాడు ఒక పొట్టిమనిషి. ధుమధుమలాడుతూన్న ఒక జతకళ్లు, ముందు కబురు చెయ్యకుండా వచ్చిన ఆకార్మికులవంక సందేహంతో చూచాయి తీక్ష్ణంగా.

"మీపని.........?"

నాలుగు అడుగులు ముందుకువైచి కర్టు సమాధానమిచ్చాడు. "తమరు వైస్‌ప్రెశిడెంటు, డాక్టర్‌వీస్ గారు కాదండీ?"

"ఔను, నిజమే!"

"మేం బెర్గమన్ అండ్ కో వారి కూలీల తరఫున రాయబారవర్గంగా వచ్చాం. మేదినోత్సవ నిషేధాజ్ఞకూ, కాల్పిస్తానని పోలీసుప్రశిడెంటుగారు చేశిన బెదరింపుకు మాఅసంతృప్తిని వెల్లడించేందుకు వచ్చాం"

ఉపాధ్యక్షుడు నోట్లోనుంచి ఒక పల్చటి నల్లచుట్ట పైకితీసి పొగను గదిలోకి ఊది, బద్ధకంగా చెయ్యి ఝాడించాడు.

"అది నా డిపార్టుమెంటుకు సంబంధించిన పని కాదు. అందుకోసం మీరు ప్రెశిడెంటునే చూడాలి!"

"జోసెట్టి" "మానోలి" "బెర్లిన్" భవన నిర్మాణ కార్మికుల రాయబారవర్గాలకు ఏంచెప్పేనో, అదే మళ్లీ చెప్పేను అనుకున్నాడు తనలో. నాదగ్గర కొస్తారెందుకు, వీరసమానమూను? ఆయన తరువాత ఆలోచన: ప్రక్కగదిలో వున్న మనుష్యుడు శుద్ధమూర్ఖుడు. వాణ్ణి అవకాశందొరికిన తక్షణం పనిలోంచి తీసి పారెయ్యాలి!

"బెర్లిన్ కార్మికులకు పోలీసుప్రశిడెంటుగారు దర్శనం ఇవ్వరట! మీరు వారి ప్రతినిధులు కనుక అధమపక్షం మీరిచ్చే సమాధానమైనా మాకార్మికులకు తీసుకొని వెడదామని మాఅశ"

కర్టుకేసి వైసుప్రెశిడెంటు ఆశ్చర్యంతో చూచాడు. ప్రక్కకు తిరిగి జాగ్రత్తగా సిగరెట్టుకొడిని దులిపాడు. "నా

సమాధానమా? నేనిదివరకే చెప్పాను. అది నాకు సంబంధించిన విషయం కాదని."

కర్టుకు కోపం వచ్చింది "చెప్పవలసిందంతా చెప్పివేశాక జరగవలసింది జరిగాక, మీరు కూడ బాధ్యస్థులౌతారు! ఈనిషేధాన్ని ఆఆజ్ఞని మీరుకూడా అంగీకరించారా? లేక మీ అభిప్రాయము ఏమిటి?''

ఆముగ్గురు కార్మికులవైపు ఉపాధ్యాయుడు చూచాడు. ఆయన కళ్లు, గంభీరవదనంతో వున్నటాలీ ముడుతలుపడిన దేహాన్నంతటినీ పైనుంచి క్రిందివరకూ పరీక్షగా చూచాయి.

ఔను, పెద్దమనుష్యులూ!" వింతగొల్పే ఆయన నిష్కంళవస్వరం సమాధానమిచ్చింది. "నేనేమనుకుంటూన్నానో మీతో చెప్పి తీరాలంటే — నేనేమీ అనుకోవడం లేదు!'' కొంచంసేపు ఆగి అన్నాడు "ప్రెశిడెంటుతో మాట్లాడండి: నేనేం చెయ్యలేను!''



ఆగదినుండి బైటకు వచ్చారు. కర్టుకు విరగబడి నవ్వాలని కోరికగా వుంది. "అది విన్నావా, టాలీ? వాడేమీ అనుకోవడమే లేదట! వాడెందుకూ ఇక్కడ మరి? ఆతడు చేతుల్తో చెయ్యవలసిన పని లేదు; బుర్రతో చెయ్యలేడు! నల్ల చుట్టలు కాలుస్తాడు! కిటికీలోంచి చూస్తూంటాడు! 'ప్రెశి

డెంటుతో మాట్లాడండి!' 'మామామతో మాట్లాడండి!' అందరూ శుంఠలే!"

కూలీ యువకుడు పకపకా నవ్వేడు. టాలీ మాట్లాడకుండా వూరుకున్నాడు. తనకామ్రేడ్స్, శాఖాసంఘసభలో యీవిషయం చెప్తే నమ్మరని అనుకుంటున్నాడు.

"బుర్రలేని వైస్‌ప్రెసిడెంట్" అంటూ కూలీయువకుడు నవ్వేడు "అబ్బే, వాడికి బుర్రలేకేం! వాడు గౌరవనీయులైన డెమాక్రాటుల్లో ఒకడు! వాళ్ళపెద్ద కాల్చటానికి ఆజ్ఞయిస్తే, వీళ్ళు చెవుల్లో దూది పెట్టుకుంటారు! ఆతడు రక్తం చూడలేడు! కిటికీలోంచి చూస్తూ, యీలోపుగా చుట్టకాల్చుకుంటూ వుంటాడు. అందరూ ఒకటేనురా!"

హఠాత్తుగా టాలీకి యీవసారాలంటే భయంపోయింది. నున్నగా గడ్డాలు గీయించుకొని తమవంక అపనమ్మకంతో చూస్తూన్న గుమస్తాలంటే అసహ్యం పుట్టింది! బాగా రంగు వేసి నిగనిగలాడ్తూన్న బూట్లు తొడుక్కొని ఇటూఅటూ వెడ్తూన్న ఉద్యోగస్తుల నసహ్యించుకున్నాడు. వారు పోలీసు ప్రెసిడెంటుగారి దైవదత్త సహచరులు! రేపు జార్జిబెల్, పార్టీల పేరిటనే, వారివర్గానికి చెందిన కామ్రేడ్లనే కాలుస్తారు!"

"పందులు.........నీచప్పందులు!........." అంతే ఆతడనగలిగింది. అలెగ్జాండర్ ప్లాజ్‌లో గర్జిస్తూన్న ఆవిరి సుత్తి పైనియెత్తుగా యెగురుతూన్న దొక రక్తవర్ణపు జండా!

---

## రెండవ భాగము:

# 1929

# రక్తప్లావితమేదినోత్సవం

"నిరంకుశప్రభుత్వాలకు వ్యతిరేకంగా సాయుధతిరుగుబాటు కేవలం, విప్లవవాదుల కార్యక్రమపట్టికల్లోనూ, బుర్రల్లోనూ భావనామాత్రంగానే అభివృద్ధి చెందడంలేదు. స్వాభావికంగాను, ఆచరణయోగ్యంగాను, ఉద్యమంయొక్క తప్పనిసరియైన తరువాతిమెట్టుగాను పరిణమిస్తుందని యిట్టిసంఘటనలు స్పష్టంగా చూపుతాయి. ప్రజాసమూహాముల వృద్ధిపొందుతూన్న కోప అనుభవ సాహసాల ఫలితమే సాయుధ తిరుగుబాటు!"

—లెనిన్.

శ్రీ [illegible]

తెలప్రోలు.

# ఆన్నా

మేఒకటవ తేదీ. బూడిద, నీల వర్ణశోభితమైన అరుణో దయమైంది.

ఈరోజు శెలవుదినం. మామూలుకంటె రెండుమూడు గంటలధికంగా ప్రజలు నిద్రిస్తారు. బ్రూనెస్టాప్సిలోని ఎ. ఇ. జి. యంత్రాగార మోహిని వృథాగా అరుస్తోంది. ప్రతి ఉదయం ఆరుగంటలకల్లా ఎత్తైన ఇనపతలుపులద్వారం వెంబడి ప్రవహించే మానవసమూహం నేడు కానరావడంలేదు. ప్రతి దినమూ, రోజుతూ, రొప్పుతూ వెళ్లే కార్మికుల్తో నిండిపోయేటి, పట్లిజ్‌స్టాప్సిస్టేషను రైల్వేక్రాసింగ్ నేడు నిర్మానుష్యమై పోయింది. సీమెన్‌స్టాట్‌కుపోయే వీథులు—ఖాళీగాను, నిర్జనంగాను ఉన్నాయి. నార్థావన్‌లోని క్రేన్‌ల నల్లపంజాలు నేడు, చలిగాలిలో కదలికలేని నీటిమీద, కదలకుండా వ్రేళ్లాడుతున్నాయి.

యథాప్రకారంగా స్టేషన్‌నుండి స్టేషనుకు రైలుబళ్ళు పరిగెత్తుతున్నాయి కాని నిర్జనంగానే ఉన్నాయి! మొదటి

తరగతి హైలు పేటల్లో కొద్దిమంది ఇంజనీర్లు పెద్దపెద్ద అక్షరాల్లో యుద్ధసమయాల్లోవలె అచ్చువేయబడిన వార్తలను చదువుకుంటున్నారు.

"బెర్లిన్ నివాసులు హెచ్చరింపబడుచున్నారు! పోలీసు ప్రెసిడెంటుగారి అంత్యప్రకటన ప్రకారం, ఊరేగింపులమీద విధింపబడిన నిషేధాజ్ఞను ధిక్కరింపజూచినయడల తీవ్రమైన శిక్షలకు లోనౌతారు! ప్రభుత్వాధికారుల ఆజ్ఞలకు ప్రజలను బద్ధులనుచేసేందుకు గాను, కార్మికులపేటలలో తగినంత పోలీసుబందోబస్తీ చెయ్యబడినది. మేదినోత్సవాలను రక్తప్లావిత తిరుగుబాట్లుగా, కమ్యూనిస్టులు మార్చేందుకు యత్నిస్తున్నారనేందుకు ప్రబలనిదర్శనాలున్నాయి"

ఒక వార్తాపత్రిక కుడిపేజీపై భాగాన్ని రెండుఫోటోలు అచ్చువేయబడి వున్నాయి. ఎడమవైపున కమ్యూనిస్టునాయకుడైన థాల్మన్ ఫోటో. కుడివైపున పోలీసునాయకుడు హీమాన్నుబర్గ్ ఫోటో "ఈరోజున ఈయిద్దరిలో ఎవరు బెర్లిన్‌ను పరిపాలిస్తారు?" అనే ఉద్రేకం పుట్టించే ప్రశ్న వాటికిక్రింద వేయబడింది. కొద్దిగంటల్లోనే ఉదయపత్రికలన్నీ అమ్ముడైపోయాయి.

మొట్టమొదట ఆపేటలో "రెడ్‌నైటింగేల్" లో ధ్వని ఆరంభమైంది. ఏడుగంటలకు, బ్లాక్ విల్లీ, బరువైన కర్రతలుపు

లను తెలుచుకొని వీధిలో అడుగుపెట్టాడు. అచల్లటి ఉదయవా యువులను పసిగడుతోన్నట్లు ముక్కుపైకి పెట్టేడు. రాత్రి వ్రేలాడగట్టబడిన కొన్ని ఎర్రజండాలు ధ్వనిచెయ్యకుండా ఎగుర్తున్నాయి.

"దుంపతెగ!..........గాల్లో ఎగుర్తూన్న జండా ఏమైంది?"

కళ్ళునులుపుకొని చూచినా కనపడలేదు. అర్ధరాత్రి సమయాన్ని కార్మికులంతాకలిసి ఒకపెద్దజండామీద పోలీస్ ప్రెశిడెంటు వ్యంగ్యచిత్రాన్ని గీసి దానికింద "డాగ్జ్‌పీబెల్" కుళ్ళుడల్లిపాయ" అని పెద్దపెద్ద అక్షరాల్తో చెక్కారు. ఎక్కువ ఉత్సాహవంతులైన కార్మికులుకూడా కొంచంసేపు కునికి పాట్లు పడుతూన్న సమయంలో తెల్లవారుఝామున పోలీసులు త్రెంపివేసి వుంటారు.

పిల్లీ ముఖం వ్రేళ్ళాడేసి, ఒకకుర్చీ, రెండు పెద్దఎర్ర జండాలు గుడిసెలోంచి తీసుకొనివచ్చి ఇంటిముందు రెండు వైపుల కట్టేడు. ఇతరులెవ్వరిచేత చేయించకుండా తానే స్వయంగా పతాకాలను ఎగురవెయ్యాలని అతని కోరిక. కిటికీ ఇనపకమ్మీలపైని రాత్రి, ఎర్రగుడ్డకట్టి దానిమీద "మేడే వర్ధిల్లుగాక" అనీ, తెల్లరంగుతో "బిగపట్టినగుప్పిట" నూ, చిత్రించారు.

"ఈ ప్రాతఃకాలం ఈరోజున బాగానే ఉంది." తల ఓరగా ఒకవైపువంచి దృష్టిని తెలియపరుస్తూ అన్నాడు. తూట్లుపడిన మేజోళ్లు తొడుక్కొని బైటకు వెళ్ళేందుకు సన్నాహాలు చేసుకుంటున్నాడు. ఉదయాన్ని వీచే మలయ మారుతంవచ్చి ఆగుడిసెలో వున్న చుట్టపాగను "రెడ్ నైటింగేల్" నుండి అవతలికి కొట్టివేస్తోన్నది.

అరగంట తరువాత కర్టు, అన్నాలకొరకు పాల్, దొడ్లోంచి ఈలవేశాడు. పడకగది కిటికీ యెర్రతెర ఇంకావేశేవుంది. వాళ్ళింకా నిద్రనుంచి లేవలేదు.

"ఫ్యూ..................హా, కర్టు!"

తెర కొంతవత్తిగింపబడి, కురులు దిద్ది తీర్చిన అన్నా కోమల వదనం తొంగిచూచింది. ఆవిడ చాలా కోపంగా వుంది. ఈరోజునైనా కర్టును మరికొంచంసేపు పడుకోనివ్వరా? కాగితాలంటించి అంటించి తెల్లవారుఝామున నాలు గ్గంటలకొచ్చి ప్రక్కమీదబడిగేడు. ఇంకా కొంచం ఆలస్యంగా నిద్రించేందుకు వీల్లేని ఏమి శెలవుదినమయ్యా!"

కర్టు లేచి, అన్నా కిటికీ దగ్గర నిలబడివుండటం చూచాడు. "టైమ్ ఎంతయింది, అన్నా?" కప్పుకున్నదుప్పటి తీసివేశి లేచి నిలబడ్డాడు. "మనమింకా నిద్రపోతూనేవున్నాం ......త్వరగాలే" తనగుడ్డలకోసం, ఆతడు చేతులు జాపాడు.

"కాని, కర్టు, ఇంకా ఏడేనా అవలేదు. ఇంకొక గంట సేపైనా పడుకోవచ్చు" అని ప్రార్థించింది. ఈసమయంలో పాల్ మళ్ళీ యీలవేశాడు.

"అది మనకోసమే, చూడు! వార్తాపత్రిక వచ్చిందా? ఈరోజున పత్రికల్ని పోలీసులు వశం చేసుకోకుండా వుండటం గమ్మత్తుగానే వుంటుంది."

"పాల్ ఈలవేశాడు." అన్నా ఉద్వేగంతో తీవ్రంగా అంది.

"చప్పట్లు చరు! ఒక్క నిమిషంలో వస్తున్నానని! ఈ రోజున ఒక శుభ్రమైన చొక్కా వుందా నాకు? ఓ—ఇదిగో"

అన్నా కేకవేసి చెప్పింది. అవతలి వైపున ఒక కిటికీ మూసివుంది. మెల్లిగా వంటింట్లోకి వెళ్లి ఉదయభోజనం సిద్ధం చేస్తోంది. మనస్సు మనస్సులో లేదు. ఆవిడ చేతలన్నీ యాంత్రికంగా ఉన్నవి. సరిగా నెరవేర్చేందుకు చాలా ప్రయత్నించవలసి వస్తోంది. కర్టు తనకున్న దుస్తుల్ని ధరించాడు. లొంగకుండా వున్న బిరుసుజుట్టును ఒక పెద్ద ఇనుపదువ్వెనతో మెదుర్కొని యుద్ధంచేసి అణచాడు. తెల్లటి చొక్కా తొడుక్కున్నందున బలే హుషారుగావుంది. ఈరోజున ప్రపంచంలోని సర్వదేశకార్మికులు ఈ మేదినోత్సవాన్ని చేస్తూంటారు. కదా అని ఆలోచిస్తున్నాడు. వారందరూ ఒకచోటికి రాగలిగితే!

తమని పీడించి దోచుకుంటూన్న వారినాటంకపరిచేందుకు చిటికెన వ్రేలైనా ఎత్తని అనురాగకార్మికులంతా ఏకమైతే! వాళ్లకి లన్ట్‌గార్టెన్ సరిపోదు. చాలా చిన్నదౌతుంది. వాళ్లందరూ గట్టిగా ఊదితే ఆ పెద్ద 'చర్చి' ఫెళఫెళ మనకపోతుందా!...

హఠాత్తుగా నవ్వడం అరంభించాడు ఎంతఅసందర్భమైన ఆలోచనలు పుట్టున్నాయ్! ఈ ఉదయం చాలా ఉన్మాదంతో వున్నాడు. ఈరోజు, ఎట్లా ఐనా శాంతివంతమైన సెలవుదినంగా ఉండదు!—ఆతడు 'టై' సిసర్దుకున్నాడు. పాడు వస్తువులు, నాశనమైపోను!

"అన్నా," పిలిచాడు "ఈ టై ముడి వేసిపెడుదూ." ఆ భవననిర్మాణకార్మికుని మొద్దు చేతులు ఇట్టి పనులలో విజయవంతంకానప్పుడు ఆమె సహాయం చేస్తూండటం కద్దు. కాని, యీరోజున ఆమె కూడా మామూలుగా, వెయ్యలేకపోతూన్నది. చురుగ్గా, నాజూకుగా, పనిచేసే ఆమెచేతులు యీనాడు వణుకుతూండడం కర్టు గమనించాడు.

"అన్నా—అల్లావున్నావేం, కారణం ఏమిటి?" కర్టు నిజంగా భయపడ్డాడు, ఆమె చాలావిచారపడ్తూన్నట్లు కనిపిస్తోంది.

"అబ్బే, ఏమీలేదు కర్టూ" అనే వరకు మాత్రమే, ఆమెనిగ్రహించుకో గలిగింది. అంతవరకూ అణచబడిన దుఃఖం,

గర్వం, అనే కొండని చీల్చుకుని మహా వేగంతో బైటపడింది. ఆవిడ వివశురాలై కూలిపోయింది.

"కాని అన్నా!" ఆతడు జాగ్రత్తగా తన మోటు చేతులో ఆమె భుజాల్ని ముట్టుకున్నాడు. వారి దాంపత్యజీవితంలో ఇది వరకు ఇట్టి భావోద్రేక ప్రదర్శనం జరిగి వుండలేదు. ఆమె గొడవ చేసినా, తిట్టినా బాధ వుండకపోను! తగిన సమాధానం ఇచ్చి వుండేవాడు. వారిద్దరి మధ్య వాగ్యుద్ధం జరిగి వుండేది. ఇట్లాటివి జరిగేందుకు ఇది తగిన సమయం కాదు. కాని ఆతడు నిస్సహాయుడు. ఆమె మరల తన ఇంద్రియాలను వశపరచుకొని మామూలువలె ధైర్యంగా వుండే వరకు వేచి వుండాలి.

మెట్లమీద, దొడ్లోను, మనుష్యులు తిరుగుతున్నారు. మూడవ అంతస్థు మీద జప్ తనగ్రామఫోనును కిటికీ వద్ద పెట్టి "రెడ్ ఆర్మీ మార్చ్!" (ఎర్ర సైన్యముల దాడి!) అనే బ్యాండు యుద్ధవాయిద్యంపు ప్లేటును పెట్టాడు. ఆగృహం ఈలల్తోటీ పాటల్తోటీ ఇటూ అటూ తిరిగేవారితోటీ హడావిడిగా వుంది.

పాల్ మళ్ళీ ఈల వేశాడు. కర్టు ఉలిక్కిపడి లేచాడు. ఒక చిన్న కాగితంముక్కమీద "రెడ్ నైటింగేల్ బయట, 10 గంటలకు" అని వ్రాసి కుర్చీలో కూలబడిపోయి ఉన్న అన్నా ప్రక్కనుంచి వెళ్ళిపోయాడు.

మూయబడిన తలుపు చప్పుడు విన్నప్పుడు మాత్రమే ఆమె మరల ఆలోచింప గలిగిన స్థితికి వచ్చింది. కండ్లెత్తి చూచినప్పుడు కర్టు ప్రాత చొక్కా కన పడింది. చాలా అల సట చెందినట్లుంది అన్నా కాని పెద్ద బరువు తొలగిపోయి నట్లు ఆమె హృదయం తేలికగా వుంది. త్వరలోనో, ఆలస్యం గానో ఇట్లా జరుగవలసేవుంది! కాని ఆమె అతి బేలతనం చెందినప్పుడు కూడా ఆతడు చూచాడు. ఆఖరికి అంతపని కూడా జరిగింది. ఎంతో చిన్నతనంగా వుంది అన్నాను.

బల్ల మీాద ఉన్న చీటీ చూచింది అతని వంకరటింకర అక్షరాలున్న ఆచీటిని మృదువుగా వత్తి 'టైము' చూచింది. ఇంకా టైముంది.

పాలు, కర్టుతో వీధిలోకి వచ్చేటప్పుడికి ప్రకాశిస్తూన్న ఎర్ర జండాల అడవి వీరికి స్వాగతం ఇచ్చింది. అనేక కిటికీల నుండి పెద్దపెద్ద పతాకాలు ఎగురుతున్నాయి. "మేదినోత్సవ ప్రదర్శననిషేధం తొలగాలి!" "మేదినోత్సవంనాడు వీధుల్ని జయించండి!" "సోవియట్ సమ్మేళనం వర్ధిల్లుగాక!" "సోవి యట్ జర్మనీ కొరకు పోరాడండి!" వీసెన్ స్ట్రాసీ లో ఒక వైపున ఒక పెద్దజండా మీాద "ఎర్రవిప్లవశ్రేణి" (రెడ్ ఫ్రంట్) అని చిత్రింపబడి ఎగురుచున్నది.

పురుషులు, స్త్రీలు, పిల్లలు, తమ చొక్కాలమీాద, మాంసవర్ణపు కాగితపు పువ్వులను ధరించి ఇండ్లముందు నిల

బడియున్నారు. బిగించిన పిడికిలి, సోవియట్‌నక్షత్రం సుత్తీ కొడవలి చిహ్నాలను స్వయంగావేసి, ఆకాగితపుజండాలను చేతబట్టి పిల్లలు కోలాహలంగా తిరుగుతున్నారు. చిన్న దుకాణదారులు, వారివారి దుకాణములను, లెనిన్, కారల్‌మార్క్సు లీబ్ నెట్ రోజాలక్జెంబర్గుల చిత్రపటములతో అలంకరించారు. క్రూక్‌మాక్సు తన దుకాణాన్నంతటినీ పండుగకు అలంకరించి నట్లు సింగారించాడు రోట్‌ఫానీ, మే దినోత్సవప్రత్యేకసంచిక ముఖప్రతి అనేక ఇండ్ల గోడలమీద అంటించబడింది. గృహస్తులు వాటిముందు నిలబడి చదువుతూ చర్చలు సాగిస్తున్నారు.

తొమ్మిది, పదిగంటలకు చుట్టుప్రక్కలవీధుల్లోకి ప్రజలువచ్చి, ఇటూ అటూ, చిన్న మఠాలుగా తిరుగుతున్నారు. పురుషుల చొక్కాలమీద, స్త్రీలగౌనులమీద, రక్తవర్ణకాగితపు పుష్పాలు ప్రకాశిస్తున్నాయి.

"రెడ్‌నైటింగేల్" బయట చాలపెద్దజనసమూహం ఉంది. ఆగుంపులోనుంచిపాల్ త్రోసుకుంటూబయట పడటం చాలాకష్టమైంది. బ్రాండెన్‌బర్గునకు హెర్మన్ పంపబడ్డాడు. ఆపేటలో వున్నవారందరిలోను, హెర్మన్ ఒక్కడే వీరినందరిని, అదుపుఆజ్ఞల్లో ఉంచగల సమర్థుడు. సహజంగా తాను నాయకుడు కాదని పాల్‌కు తెలుసును. అతణ్ణెక్కడికి పంపితే

అక్కడ తనవిధ్యుక్తధర్మాన్ని నెరవేర్చుకు వస్తాడు! ప్రెశి డెంటు ప్రకటనలు, నిషేధాజ్ఞలు ప్రజలను రోషావేశపరవశు లనుగా చేశాయి. స్వల్పకారణం కూడా మహాభయానకంగా ప్రేలవచ్చును. ఇదివరకెన్నడూ కమ్యూనిస్టు లచే జరుపబడే ఊరేగింపుల్లో పాల్గొనని సోషల్ డెమాక్రాటు కార్మికులనే కులు తమపార్టీ కామ్రేడ్ ప్రెశిడెంటు విధించిన ఆజ్ఞను ఉల్లం ఘించే ఉద్దేశ్యంతోనే వచ్చివున్నారు.

కోలిన్ పేటనుండిపోయే వీధులన్నిటినీ పోలీసులు ఆక్ర మించారని "రెడ్ నైటింగేల్" ద్వారంవద్ద ఒక వార్తాహరుడు చెప్పాడు. పాంకీస్ట్రాసీలోని గార్డియన్లభవనంలో ఒక పోలీసు పటాలం దాక్కొనివుంది! నెట్టెల్ బెక్ ప్లాజ్ అంతా పోలీసు గుడారం క్రింద మార్చివెయ్యబడింది. రీనికెండార్ఫర్ స్ట్రాసీ లోని అనేక గృహసావిడులలో సిపాయిలుంచబడ్డారు. అప్పు డప్పుడు చిన్నమోటారులారీల్లో 8, 10 మంది సాయుధపోలీ సులు మంచివేగంతో వీధుల్లో వెళ్ళేవారు. పరిస్థితులను పైకి తెలియబరచడమే వారివిధి.

ఈవార్తలు తెలుస్తూన్నప్పుడు పాల్ ప్రక్కనేవున్న కర్టు, అతని ముఖంలో ప్రతిబింబిస్తున్న అనిశ్చితభావాల్ని గమ నింపక పోలేదు. పాల్ చాలా నమ్మకస్తుడైన పార్టీసభ్యుడని అతనికి తెలుసును. మే దినోత్సవంనాడు వీధి సంఘానికి పాల్

ను ఉపనాయకునిగా హెర్మన్ నియమించడం అంతమంచిదని గాదని అనుకున్నాడు. "తమ కమ్యూనిస్టు సంఘంలో ఉన్న సభ్యులందరికంటె పాల్ ముందు చేరాడు. ఇరవై యేళ్ళనుండి ఆపేటలో నివశిస్తున్నాడు. ఒక ప్రాతకామ్రేడ్‌కు కష్టం కలిగించడం ఎందుకని మాట్లాడకుండా ఊరుకున్నాడు. కాని పరిస్థితులు విషమించేసందర్భంలో వ్యక్తిగతమైన మొహమాటాలు చూపించకూడదు. ఒక్క నిమిషంకూడా పాల్‌ను వదలకుండా ఆరోజున ఆతనినీడలా అనుసరిస్తూ సహాయం చెయ్యాలని కర్టు నిశ్చయించుకున్నాడు.

"రెడ్ నైటింగేల్" లో తలలమీద నడవగలిగేట్లా వుంది మాంసవర్ణపు పువ్వులతోటీ ఎర్రబాడీలతోటీ అలంకరింపబడిన టోపీలు, జాకెట్లు ధరించిన కార్మికులతో గదులన్నీ కిటకిటలాడుతున్నాయి. పదినిమిషాలక్రితం ఒక పోలీసుగూఢచారి ఒకగదిలో పట్టుబడ్డాడు. సున్నంలోకి ఎముకలు లేకుండా తన్ని అవతలికి గెంటివేశారు. బయటనున్న కార్మికులు మళ్లీ దేవిదేవేషు చేశారు వాణ్ణి. రీనిక్కెండార్ఫర్ స్ట్రాసీలో పోలీసులాతనిని రక్షించారు.

మఫ్టీలు పట్టుబడిన వెంటనే సాధ్యమైనంత త్వరలో పోలీసులు వారి రక్షణకు వచ్చేవారు. "రెడ్ నైటింగేల్" కమ్యూనిస్టుపార్టీ కేంద్రస్థానమని అందరికీ తెలిసినప్పుడు దానినే

అందరూ కలుసుకునే ప్రదేశంగా నిర్ణయించడం గొప్ప తప్పని కర్టు గ్రహించాడు!

పరిస్థితులు బాగా విషమించినప్పుడు పోలీసులు సుల భంగా చుట్టుముట్టి లోపలనున్న వారినందరినీ అరెస్టుచేసి రాజ కీయ నాయకత్వాన్ని నిర్మాణ నాయకత్వంనుండి వేరుపరుప వచ్చును.

చిన్న హాలులో వెనుకభాగాన్ని పాల్ కర్టులు పార్టీ సభ్యుల్ని కలుసుకున్నారు. హాబ్నర్‌పిత కూడా తనమాట నిలుపుకున్నాడు. నిగనిగలాడే దుస్తుల్ని ధరించి మాంసవర్ణ పతాకం అలంకరించుకొని బయల్దేరేందుకు సిద్ధంగాఉన్నాడు. ఆవృద్ధుని బుర్రలో గొప్పమార్పు జరుగుతోందని కర్టు గ్రహిం చాడు. నలభై యేళ్లలో యీనాటికి తనపార్టీ కామ్రేడ్ నిషే ధించిన మేడే ఊరేగింపుల్లో పాల్గొనేందుకు ప్రథమ పర్యా యం తయారయ్యాడు.

"థామస్!" అనిపాల్ చప్పట్లు చరుస్తూ కేకవేసి పిలి చాడు గంద్రగోళంలో పూర్తిగా అతని స్వరం మునిగి పోయింది. ఒళ్లుతెలియకుండా తీవ్రంగా చర్చిస్తూన్న థామస్ దగ్గరకు వచ్చాడు. ఊరేగింపును క్రమబద్ధంగాను, శిక్షణాయు తంగాను థామస్ నడుపవలసివుంది.

"థామస్! మీ వాళ్లేమంటున్నారోయ్? ఆయుధాలేమీ రహస్యంగా తీసుకొని రావడం లేదుగదా? మనం నిరాయుధులుగా వీధుల వెంబడి ఉత్సవం జరపాలి."

పాల్ భయపడి యీవిధంగా చెప్పలేదు. పార్టీ యొక్క పరమముఖ్యమైన ఆదేశం యిది! క్రితం రాత్రి హెర్మన్ ఏ సందర్భంలోనూ ఎవ్వరూ ఆయుధాలు తీసికొనిరాకూడదని చెప్పేడు.

"బాగుందయ్యోయ్, పాల్" పటకా బిగించుకుంటూ థామస్ సమాధానమిచ్చాడు "ప్రతివాళ్ల జేబులూ తడిమి చూడలేనుకదా! వాళ్లని తీసికొని రావద్దని ఒకసారికాదు. పదిసార్లైనా అధమపక్షం చెప్పివుంటాను. బహుశా ఎవ్వరూ తీసికొనివచ్చి వుండరు."

"నీమనుష్యులందర్నీ కొంచం అదుపులోవుంచు—అవతలవాళ్ళు ఎదుర్కోవలసివుంటుందో". ఆ కార్మికులిద్దరి ముఖాలు గంభీరంగా వున్నాయి. అద్భుతమైన బాధ్యత వారి భుజాల మీద మోపబడివుంది.

తనగడియారంకేసి చూచాడు పాల్, "పది ఐంది థామస్ మీ వాళ్లను వరుసల్లో నిలబడమను. బయల్దేరదీయవలసిన టైమయింది."

"రెడ్ నైటింగేల్" తలుపులు తెరచుకొని కార్మికులు వ్రవహిస్తోంటే, అవతలవున్న జనసమూహంలో కలకలం చెల రేగింది

ఒకదానివెనుక నొకటిగా రెండుసార్లు గాలిని చీల్చుకొని యీలగింగుర్లెత్తింది. ఈగుర్తు అందరికీ తెలుసును. అది థామస్‌ది!

"క్విక్ మార్చ్!"

మహోత్సాహం వెల్లివిరిశింది. ఒకయువకుడు ప్రతిధ్వనించే కంఠస్వరంతో అరిచాడు. "నశించాలి — మేదినోత్సవ నిషేధాజ్ఞ!"

కార్మికులంతా కలిశి అరుస్తూంటే, అక్కడ కంపితులైనవారూ కొందరున్నారు. "నశించాలి... నశించాలి..." నిరసన ఉరుములు ఆప్రదేశాన్ని ఊపేట్లా ఉరిమాయ్!

వీధివెడల్పునా నిలబడివున్న ఆమహాకార్మికజనసమూహం ముందుకు నడవనారంభించింది. తెల్లముఖాల సముద్రంలో నకనకలాడే నిప్పుకణం మాదిరి సోవియట్ నక్షత్రపతాకం, వెలిగి పోతోంది! ఇద్దరు ముగ్గురు చెప్తూంటే తక్కినవారందరూ పాడడమారంభించారు. "కోరికల ఖైదీలు!" "ఆకలి మంటచే మలమలమాడే అనాథులందరు లేవండోయ్"

రీనిక్కెండార్ఫర్ స్ట్రాసీలోని పెద్దపెద్ద దుకాణాల తలుపులు బర్రునలాగబడి మూసివేయబడ్డాయి. తొందరతొందర

గా తలుపులు మూస్తూంటే ఇనపగడియలు కటకటలాడాయి. 1929 సంవత్సరపు రక్తస్రావిత 'మే' దినం ఆరంభమైంది.



కిటికీలలోంచి చూస్తూన్నవారు, హఠాత్తుగా ఉద్వేగంతో చప్పట్లు చరుస్తూ చేతులు ఊపుతూ అరవడమారంభించారు. ఊరేగింపులో పాల్గొన్నవారివారి భయకంపితములైన వదనాలను తెరచిన నోళ్ళను మాత్రమే చూడగలిగారు. వారి కేకలు పాటల్లో వినపడటంలేదు. డార్ఫర్ స్ట్రాసీమలుపులో శిరస్త్రాణములు, యూనిఫారమ్ కుస్తుల వెండిబొత్తాములు ప్రత్యక్షమయ్యాయి. ఊరేగింపు వెనక్కాల ఆసమయంలోనే, నీలవర్ణ యూనిఫారమ్‌లు పాంకీస్ట్రాసీలోని గార్డియన్ల భవనంనుండి బయటికి వచ్చాయి. "పో—లీ—స్!" అని ఒక యువతి వేసిన వెర్రికేక, గాలిని ఛేదించుకుంటూ మారుమ్రోగింది.

శిరస్సులన్నీ ఒకేసారి వెనక్కు తిరిగాయి. ఆజనసమూహం తటపటాయించింది. భయోత్పాతంతో కూడిన కేక అందరినీ నిశ్చేష్టితులను చేసింది. స్త్రీలు, పిల్లలు ఒకర్నొకరు త్రోసుకుంటూ ఒకరిమీద మరొకరు పడ్డారు. పాదాలక్రింద ఒక పిల్లపడి నలిగిపోయింది. అపాయకరమైన బోనులో చిక్కుకున్నామని తెలుసుకొన్న కార్మికుల రోషస్వరాల్లో ఆ అమ్మాయి ఆక్రందనం అడుగంటి పోయింది.

## ఆ పన్న

అది చాలాకృత్రిమమైన క్రూరమైన దాడి. ఆచిన్నవీధి రెండువైపుల పోలీసు లరికట్టి ఎటూ కదలలేకుండా ఉన్న మూకను మధ్యకు నెట్టివేస్తున్నారు. వేటలోవలె, ఆశ్చర్యచకితులైన మానవులు మధ్యకు తోలివేయబడుతున్నారు. ఆ ఊరేగింపును చెదరగొట్టడమే పోలీసుల ఉద్దేశ్యంకాదు. ఒక వైపునకూడా దారివదలక స్త్రీలను పురుషులను గొడ్లను బాదినట్లు బాదడమే వారి ఉద్దేశ్యంలాగు స్పష్టమౌతుంది.

ఈలలు, ఆక్రందనాలు, పెడబొబ్బలు, రొదలతో వీధి అంతా నిండివుంది. ఆపైని ఉత్సవంలోవున్నవారి శిరస్సుల మీద లాఠీదెబ్బలవర్షం కురుస్తూంది. ముందున్నవారు వెనక్కు నెట్టివేయబడుతున్నారు. వెనుకనున్నవారు ముందుకు రావాలని దెబ్బలు పడలేక పారిపోయేందుకు ప్రయత్నిస్తున్నారు. అకస్మాత్తుగా మహాభయంకరమైన సంక్షోభం పుట్టింది.

ఒక ఇంటిచీడీలమీదకు దూకి, కర్ట అందరికీ వినపడేట్లు బిగ్గరగా మాట్లాడబోయాడు. కాని ఆప్రయత్నం నిష్ప్రయోజనమైంది.

ఉన్మాదకరమైన ఆత్రొక్కిడిలో, రెండువైపులనున్న ఇండ్ల అరుగులమీదకు, చీడీలమీదకు, ప్రజలువెళ్ళి, తలుపులను బలవంతంగా బ్రద్దలుకొట్టి ప్రవేశించారు. స్త్రీల, పిల్లల ఏడ్పులు, పెడబొబ్బలు ఆగంద్రగోళాన్ని ఇనుమడింపచేశాయి.

ఆమహాత్రొక్కిడిలో కొద్దిమంది మాత్రమే ఇండ్లలోకి వెళ్ళ గలిగారు అడ్డంలేకుండా లాఠీకర్రలు బుర్రలు బ్రద్దలుకొడు తున్నాయి. ఉక్కిరిబిక్కిరైనవాళ్లు క్రిందపడేందుకుకూడా వీలు లేనంత అధికంగా ఉంది ఒత్తిడి.

క్రోధోన్మాదంతో జేవురించిన వదనములతో ముగ్గురు పోలీసులు "కిందికిరా! పందీ" అంటూ కర్టును చీడీలమీద నుండి క్రిందికి యీడ్చారు. వెంటనే మూడు లాఠీకర్రలు అతని తలవెనుకభాగంమీద ప్రహారాలవర్షం కురిపించసాగాయి. ఇంకొకరెవరైనాఐతే చచ్చివుండేవారే!

కర్టు రోషంతో అరిచాడు—తిరిగాడు. తనపిడికిలితో ఒకపోలీసుముఖంమీద ఫెడేలున శక్తికొద్ది కొట్టేడు. ఆ పోలీసు నోరుతెరచి స్పృహతప్పి పడిపోయాడు.

ఈపోలీసుప్రక్కనేఉన్నమరొకపోలీసు యీదృశ్యాన్ని చూచాడు. అతడు రివాల్వరును బారుచేశాడు. కాని గంద్ర గోళాన్నిఆపి, స్త్రీలను పిల్లలను ఇండ్లలోకి జేరుస్తూన్న థామస్, మిగతా పోలీసులాప్రదేశానికి రాకక్రితమే, కర్టును ఒక ఇంట్లోకి లాగుకొని పోయాడు.

ఆఇంటి చీకటి వసారా, మేడఅంతస్తులు ప్రజల్తో నిండి పోయి వున్నాయి. "త్వరగా", తన వెడల్పాటి వీపుతో తలు పులను నొక్కుతూ "మీరందరూ ఇళ్ళలోకి పారిపోండి!" అని అరిచాడు థామస్.

కదలకుండా నిలబడిన కర్టును థామస్ ఒకతన్నుతన్ని 'డాకోల్!' అని హెచ్చరించాడు.

కోపంతో మండిపడుతూన్న పోలీసుయువకులు, తలుపులను కదల్పలేక, తిట్టుకుంటూ వీధిలోకి వెళ్ళేరు.

చాలవరకు నిర్జనమైన వీధిలో ఒకస్త్రీ ఏడుస్తూన్న చంటిబిడ్డను వక్షస్థలానికి అదుముకుంటూన్నది. ఏదో ఒకయింట్లోకి తానుకూడా పారిపోవాలని ప్రయత్నించింది. కాని వృథా. చాలకష్టంతో ఆస్త్రోక్కుడిలోనుంచి బయటపడింది. వీధిలో బారుచేసివున్న రివాల్వర్లతోటీ, ఊగుతూన్న లాఠీలతోటీ, పోలీసులు మాత్రమే కనపడుతున్నారు.

కర్టుచే దెబ్బతిన్న పోలీసుయువకుణ్ణి లారీలో పడవేశారు. ఆతనికింకా స్పృహరాలేదు.

ఆయువతి వీధిచివరకు జేరుకున్న సమయంలో ఇరవైయేళ్ల పోలీసువాడు ఆమె దగ్గరకు పరిగెత్తుకొని వచ్చాడు. ఆమె ముఖం కళను కోల్పోయింది, తనబిడ్డచుట్టూ చేతిని గట్టిగా అదిమిపట్టి వెళ్లిపోతూన్నది. ఈఆత్మధైర్యమే ఆ పోలీసులకు పిచ్చి యెక్కించింది. ఒకదూకుతో ఆమెమార్గానికడ్డంగా నిలబడి చెయ్యెనెత్తి........ఆమె గంభీరముఖం మీద కొట్టేడు.

"వెనక్కి! ఆడపంది!" అని అరచి, ఆత్మరక్షణార్థమై వాళ్లుతెలియకుండా చేతినెత్తిన ఆయువతిని గెంటివేశాడు.

గవాక్షములనుండి భయగ్రస్తులై ప్రేక్షకులు చూస్తు న్నారు. "ఓరికుక్కా—నీతల్లినే చంపుతావట్రా?" ఒకము సలమ్మ కేకవేసింది.

"రక్తపుకుక్కా!"

హఠాత్తుగా, ధుమధుమలాడ్తూన్న ఆపోలీసు ముఖం మీద ఠపీమని ఒకరాయి తగిలింది. అప్పుడు రివాల్వర్లు ప్రేలడమారంభించాయి, పెంగ్.........పెంగ్......... పెంగ్

మొదట ఇండ్లమీద కాల్చారు. "కిటికీలు మూసి వెయ్యండి!" అని కార్మికులు హెచ్చరించుకున్నారు. భయ గ్రస్తమై, వివర్ణమైన ఆపోలీసుముఖం. కందగడ్డలాగు ఎర్రి బారింది. అటూఇటూ పరిగెత్తుతూ కిటికీ తలుపులకు గురి చూచి కొట్టడమారంభించారు.

ఆవీధిలో ఇప్పుడు పోలీసులొక్కరే ఉన్నారు. చూపు మేరదూరంలో పౌరుడెవ్వడూ కనపడటం లేదు. కొన్నియిం డ్లలో దూరి పోలీసులు గృహస్తులను వెదకి వెదకి తరిమేరు. ఒకఇంట్లోనుంచి రక్తంతో తడిసిపోయిన ఒకకార్మికయువకుణ్ణి ఇవతలకు ఈడ్చి లారీలో పారవేశారు. ఇంతకుపూర్వమే పోలీ సులచేత అరెస్టు చెయ్యబడిన ఇద్దరు వృద్ధాంగులు ఆలారీలోపల పనిదుస్తులతో పడివున్నారు.

పాంక్ స్ట్రాసీనుండి కమాండరు యీాల వెంటవెంటనే రెండుసార్లు గంయ్‌గంయ్ మన్నది. మెల్లగాను ఇష్టవ్యతిరేకం గానూ పోలీసులు వీధిలోనుండి వెనుకకు మరలిపోయారు.

*   *   *   *   *   *

కొద్దినిమిషాల తరువాత ఆవీధి మళ్ళీ ఉద్రిక్త జన సమూహంతో నిండిపోయింది. పోలీసులక్రౌర్యము, ఈదాడి యొక్క కాపట్యము ఇరుగుపొరుగువారి కందరికీ రోషం తెప్పించింది.

"ఇది ఇంకా మొదలే!" ఒకస్త్రీ బిగ్గరగా చెప్పింది.

"ఈసాయంకాలం "వార్వర్ట్సు" పోలీసులు ఆత్మరక్షణ కోసం యీావిధంగా చేశారని వ్రాస్తుంది!"

"ఇందుకొరకు మీాకామ్రేడ్ ప్రెశిడెంటుకు ధన్యవాదా లర్పించడోయ్!" అని ఒక వృద్ధకార్మికస్త్రీ తనప్రక్క నున్న కార్మికుని ముఖంమీాద అంది.

"ఆట్టే కష్టం పెట్టుకోకు! ఈసాయంకాలానికి నేనా పార్టీలో సభ్యుడుగా వుండనులే!" అన్నాడు ఆకార్మికుడు శాంతంగా!

ఇంకొక గుంపులోనుండి పాల్ పెద్దస్వరం వినబడు తోంది. "కామ్రేడ్స్! ఈవీధి చాలా చిన్నది సులభంగా

రెండు వైపులను మూసివేయ వచ్చును. ఈవీధిలో మన మీఊరేగింపును తీసికొని వెళ్లేందుకు ప్రయత్నించినందుకు మనమే నిందింపబడాలి!''

కొద్ది మంది కార్మికులు, యెవరి కంటా పడకుండా, గుంపు దగ్గరనుండి గుంపుకు వెళ్ళి "రీనిక్కాండార్ఫర్ స్ట్రాస్సె మలుపుదగ్గర మళ్లీ వరుసలుగా నిలబడండి!'' అని చెప్పేరు. ఒక నోటినుంచి మరొకనోటికి యీఆజ్ఞ ప్రసరించింది. గంభీర వదనులైన కార్మికులు దృఢనిశ్చయంతో అన్నిదిక్కులనుండి గుమికూడుతున్నారు.

వరుసలుగా నిలబడేందుకు యీాల గంయ్‌మని మ్రోగింది. ఆకార్మికులందరూ రోడ్డుమీదకు వరిగెత్తి ఎనిమి దేసి చొప్పున వరుసలుగా నిలబడ్డారు.

"క్విక్ మార్చ్!''

నెటిల్ బెక్‌ప్లాజు నుండి పోలీసుశిరస్త్రాణముల, వెండి బిళ్ళలు తళతళలాడేయి.

"నశించాలి ......... మేదినోత్సవ ......... నిషే ధాజ్ఞ'' "కమ్యూనిస్టు పార్టీ వర్ధిల్లాలి!"

"సోషల్ ఫాసిస్టుల పస్తుల ప్రభుత్వం నశించాలి!"

ఈసారి, పోలీసు యూనిఫారమ్‌లు, కార్మికులకు భయం కలిగించలేదు. నెటిల్ బెక్‌ప్లాజ్ వైపునకు శాంతంగా "అంతర్జాతీయ శ్రామికగీతాన్ని'' పాడుకుంటూ నడిచారు.

కర్టు, తనముందు నడుస్తూన్న కార్మికుల మధ్య అన్నా కోమల వదనం కనపడిందని అనుమానించాడు.

వారు కోఆపరేటివ్ స్టోర్సును దాటుతూన్నప్పుడు ఒక భయవిహ్వాలమైన ముఖం కిటికీ తలుపుల వెనక్కాల మాయమైంది. ఆతడే ఆస్టోర్సు మేనేజరు!—ఆతడొక సోషల్ డెమాక్రాట్! "ఇనప కమ్మీల వెనక్కాల 'మే' దినోత్సవం జరుపుతున్నావా! ఆం!........." అని కార్మికులు పరిహాసించి చప్పట్లు చరిచేరు.

"జంతు ప్రదర్శన శాలలో కోతిలాగున్నాడండి!"

మరల కర్టుకు ఐదారు వరుసలముందు అన్నా అందమైన ముఖం కాన్పించింది. వెంటనే లేస్తూన్న శిరస్సుల కెరటంలో మునిగిపోయింది.

"హల్లో! మార్నింగు, కామ్రేడ్!"

పాలిపోయిన ఒక చెయ్యి కర్టు కరచాలనాన్ని ఆశించింది. కర్టు తల యెత్తి చూచాడు. ఆతడు. "రెడ్నైటింగేల్" లో ఆనాడు పార్టీ సభలో మాట్లాడిన యువక ఉపన్యాసకుడు కాదూ?

"రెడ్ ఫ్రంట్!" ఆతణ్ణి కర్టు తన దగ్గరకు లాక్కున్నాడు.

"రా, మళ్ళీ ఒకనిమిషంలో ఆరంభమౌతుంది."

మిక్కిలి బలవంతుడు కాకపోయినా ఆయువకుడు తన ప్రక్కచాలగంభీరంగా నడుస్తూన్నందుకు కర్టుకు చాలా ఆనం

దంగావుంది. "ఆతడు కేవలం, మాటలు చెప్పేవాడే కాదు." అని తృప్తితో కర్టు అనుకున్నాడు.

ఆ ఊరేగింపు నెటిల్ బెక్ ప్లాజ్‌ను సమీపిస్తున్నది. కర్టు తలయెత్తి, తనముందున్న తలలమీదుగా చూచాడు. వీధికడ్డంగా, నలుగురేసి పోలీసులు వరుసలు తీర్చి వీరికొరకు నిలబడి వున్నారు.

ఒక నిమిషమేనా తటపటాయించకుండా కార్మికులు ముందుకు వెడుతున్నారు.

"వీధుల్లోంచి వెళ్ళిపొండి!" అనే కేక వినపడింది. కార్మికులు ముందుకు వెడుతున్నారు "పోలీసు నియంతృత్వం నశించాలి!"

ఆ అన్నది థామస్! కర్టు తక్కిన వారితో అరుస్తున్నాడు. "నశించాలి!...నశించాలి...నశించాలి!..."

వీధి కుడి చప్టా మీదనుండి కొందరు వెనుకకు పరుగెత్తుకొని వస్తున్నారు.

"ధైర్యంగా...నిలబడండి...కామ్రేడ్స్"

ఊరేగింపు కేంద్రం ముందు ముందుకు త్రోసుకొని వస్తూన్నది. ఊరేగింపు మొగ్గరాన్ని థామస్ అనుచరులు ఉన్నారు. పాల్, థామస్‌లు ముందు నడుస్తున్నారు.

మరల ఒక్క ఆజ్ఞ గాలి లోంచి చుబుకపు దెబ్బవలె దూసుకు వచ్చింది. మొదటి వరుస మీద లాఠీలు ఫెళఫెళ

మంటూ వడ్డాయి. హృదయ నిర్భేదకమైన ఆర్భాటాలు, ఆక్రందనాలు, యీలలతో చెవులు గింగుర్లెత్తుతున్నాయి. ఎడమవైపున ఒక ఇంటి అరుగుమీద నిలబడి ఒక పెద్దమనిషి పరిహాసాస్పదంగా అన అసమ్మతిని తెలియచేస్తున్నాడు. ఇప్పుడే ఆయన చుట్టలదుకాణంలోంచి వచ్చినట్లు వ్యక్తమౌతూ న్నది. ఇద్దరు పోలీసులు ఆయనను గోడవద్దనుంచి ఊడపీకారు. ప్రహారాల వర్షంలో స్పృహ తెలియకుండా పడిపోయాడు. ఆయన టోపీని ఫుట్‌బాల్‌లా ఒకపోలీసు ఎగురతన్నాడు.

పోలీసులు ఉన్మాదంగా చేతికందిన వారిని చావ మోదుతున్నారు. కాని ఆ ఊరేగింపును మాత్రం చెదరగొట్ట లేకపోయారు. అంత కంటెకు ముందుకు నెట్టుకొస్తూన్న ప్రజా సమూహాపు ఒత్తిడికి వారు వెనుకకు వెళ్ళవలసి వస్తోంది. కార్మికులు, వీలున్నంత వరకూ తమ్మును రక్షించుకుంటూ ఒక్క అడుగు కూడా వెనక్కి వెయ్యడం లేదు. ఒక్క ప్రదేశంలో వెనుకకు నెట్టివెయ్యబడినా మరొకచోట ముందుకు నెట్టుకు వచ్చేస్తున్నారు.

క్రొత్త రిజర్వు దళాలు వచ్చినపుడు మాత్రమే పోలీసులు ఊరేగింపును చెదరగొట్ట గలిగారు. కాని వీధులన్నీ ఇంకా ఖాళీ అవలేదు. మరల యీల వారిని వెనుకకు రప్పించింది. కొన్ని ఆజ్ఞల్తో పోలీసులు లారీలలోకి దూకి వెళ్ళిపో

యాయి. బహుశా మరొక ప్రదేశంలో పరిస్థితులు చాలా అపాయకరంగా వుండి వుండవచ్చును.

కొద్ది నిమిషముల అనంతరం ఒక కార్మికయువకుడు నెట్టెల్ బెక్ ప్లాజ్‌లో కేంద్ర స్థలంలో ఇసుక పెట్టెమీద నిలబడి వేలకొలది కార్మికులకు ఉపన్యసించాడు.

Z Z Z Z Z Z

పాల్‌ను వెతుకుతున్నాడు కర్టు. ఆఖరుకు పాల్ కనిపించాడు.

"పేటకు తక్షణమే వెళ్ళాలి పాల్—అక్కడేం జరుగుతోందో చూడాలి" పోలీసుల దాడి అక్కడ కేంద్రీకరింపబడిన సంగతిని వారెరుగుదురు. రీనిక్కెండార్ఫర్ స్ట్రాసీ మీదుగా వారు త్వరత్వరగా నడిచివెళ్ళారు.

కార్మికుల పేటవైపు పరిగెత్తుతున్నారు. వారి ననుసరించి వేగంగా పాల్ కర్టులు కూడా పరిగెత్తారు. వీసెన్ స్ట్రాసీ మళుపులో ఊఫర్ స్ట్రాసీ నుంచి వస్తూన్న ఊరేగింపును కలుసుకున్నారు.

"పాల్ అదుగో అటో!—ఎర్రజండా పట్టుకుని ముందునుంచున్నాడు." కర్టు బిగ్గరగా చెప్పి ఊరేగింపులో కలుసుకునేందుకు పరిగెత్తాడు.

## ఆ న్నా

పోలీసుల మేకులువేసిన బూట్ల ధ్వని వెనకాల వినపడుతోంది.

ఊరేగింపును జేరుకోవాలని పరుగుస్తూ కర్ట పరిగెత్తుతున్నాడు. కాని అతడు స్థూలకాయుడు! పోలీసు యువకులు వేగంగా పరిగెత్త గలరు.

కర్టును సమీపించి "నిన్ను పట్టుకొని తీర్తానురా! "పంది" అని ఒక పోలీసుయువకుడు అరిచాడు. పోలీసులు ధ్వనిచేస్తూ ఊపిరి పీల్చుకోవడం వింటున్నాడు. మరుక్షణంలో లాఠీ అతని బుర్రమీాద పడింది. కాని, కోలిన్‌స్ట్రాసీ మలుపు జేరుకుంటూన్న ఊరేగింపును అందుకునేందుకు ఆపోలీసు గబగబా కర్టును దాటిపరిగెత్తాడు.

ఒకపోలీసు ముందున్న పతాకధారుని మీాదకు రోషావేశంతో దూకేడు. అతను ఆటో మీాదకు లాఠీని యెత్తడం కర్ట చూచాడు.

విద్యుల్లత కంటె వేగంగా, జరిగింది. ఆపోలీసుయువకుడు ఉండ్రుముక్కలాగు క్రిందపడి దొర్లుతున్నాడు. అతని శిరస్త్రాణం ఎగిరి క్రిందపడింది. పోలీసులు అక్కడికి పరిగెత్తుకు వచ్చారు. ఒక కార్మికుని లాఠీలతో చావమోది క్రిందపడవేసి బూటుకాళ్ళతో త్రొక్కుతున్నారు.

"లేచినిలబడు వెధవా—" అని ఉరిమాడు ఒకపోలీసు ఆమనిషి మూల్గుతూ తనకాళ్ళవైపు చూపించాడు. అతని కాలు ఒకటి కర్రది. "నీకు పరుగెత్తడం నేర్పుతానురా" అని అరుస్తూ ఆతనిమీద గ్రుద్దుల వర్షం కురిపించాడు. పోలీసుసోదరుడు క్రిందపడి పొర్లుతూన్నప్పుడు మాత్రమే ఆవికలాంగునివదలి పోలీసు, పతాకధారి వద్దకు పరిగెత్తాడు.

బాధతో మూల్గుతూన్న ఆనిస్సహాయుని కర్త ఒక ఇంట్లోకి త్రోసుకు పోయాడు. "నా చిరునామా ఇదిగో. నన్నొక సాక్షిగా వేసుకోవచ్చును. అట్టే లాభం వుండదు! ఈవెధవలు వీటికేమీ లెఖచెయ్యరు. ఐనా ప్రయత్నించి చూడు." అంటూ ఒకకాగితం మీద తనవిలాసం బరికి ఆతని జేబులో దూర్చేడు.

కోలిన్ స్ట్రాసీ మళుపులో జండాకొరకు పెనగులాట రేగింది. దొడ్లలోకి కూడా వినపడేట్లా, ఆటో అరిచాడు. ఒక చేత్తో అందినవారినందరినీ, బలంకొద్దీ ప్రహరిస్తూ, రెండవ చేత్తో చిరిగిన ఆజండాని, పట్టువదలకుండా ఆటో పట్టుకున్నాడు ఆటో బుర్ర పెంబడి రక్తధారలుకట్టి ఆతని రక్తసిక్తాంగుని చేశినా, పట్టు వదలలేదు!

కోలిన్ స్ట్రాసీ అవతలవైపునుండి పాటలధ్వని వినపడుతూన్నది పాంక్ స్ట్రాసీనుంచి ఒకక్రొత్త ఊరేగింపు బయల్దేరి వెడ్డింగుస్ట్రాసీని దాటి వస్తూన్నది. ఒక ఎర్రగుడ్డను ఆక్రొత్త

ఊరేగింపువారికి కనబడేట్లు ఎగురవేస్తూ "ఇల్లారండి!" అని కర్టు శక్తి కొద్దీ అరిచేడు.

వీధి అవతల చివరనున్న ఊరేగింపు ఆగింది. కార్మికులు సందేహంతో నిలబడ్డారు. ఆజండానూపేవాడు వాళ్లని ఏమిచెయ్యమంటున్నాడో వారికి తెలియలేదు.

హఠాత్తుగా భయకంపితమైన "కర్టు!" అనే కేక కర్టుకు వినపడింది.

వేగంగా వెనక్కు తిరిగాడు. వీసెన్ స్ట్రాసీ మలుపులో అన్నా, నిలబడి ఆతని వెనుకవైపుకు చూపుతోంది. బారు చేసిన రివాల్వర్లతో పోలీసులు ఆతనిమీదకు పరిగెత్తుకుని వస్తున్నారు. వారి పిచ్చికోపంలో నిస్సందేహంగా కర్టును కాల్చివేస్తారు. కర్టు ప్రక్కకు లంఘించి దగ్గరనున్న 6 వ సంఖ్య ఇల్లు చేరుకున్నాడు.

"ఉన్నచోటనే నిలబడు!......కదలకు!... వెధవా!" అని అరుస్తూ పోలీసులు ఆతనివైపుగురిచూచారు

పింగ్......పింగ్......పింగ్......పింగ్......

గోడమీదనుండి బెల్లులూడిపడ్డాయి. కర్టు సావడిలోంచి లోపలికి పరిగెత్తాడు. వాడ్డిత్రోవలో ఉన్న అద్దాలతలుపు ఆతనికి తగిలి వెయ్యిముక్కలైంది.

"కట్టూ, వాళ్లు నీవెనక్కాల వస్తూన్నారు." అని ఒక కిటికీలోంచి కేక వినపడింది. అతడు దొడ్లో మధ్యనున్నాడు. పోలీసులు మళ్లీ తుపాకులు ప్రేల్చారు.

పెంగ్... పెంగ్. అతని నుదురుమీదుగా చల్లగాలి జోరుగా పరిగెత్తింది. ప్రక్క ఇంటిద్వారం దగ్గర ఉన్న గోడ మీదనుండి తెల్లటి సున్నప్పొడి క్రిందరాలింది.

"కిటికీల దగ్గర్నుంచి వెనుకకు తప్పుకో!"

కిటికీవైపు పోలీసు కాల్చిన క్షణాన్నే కట్టు వెనుకఉన్న మెట్లపైపు ఒకదూకు దూకేడు. పైనుండి వినవచ్చిన కేకయే, అతని ప్రాణాన్ని రక్షించివుంటుంది. మెడక్రిందభాగమున ఉన్న వసారాలోకి వచ్చి దాగుకున్నాడు అతనిప్రక్కనుంచి, మూసివేయబడిన తలుపు దగ్గరనుండి పోలీసులు పైకి ఎక్కుతూన్న ధ్వని వినపడుతూన్నది కట్టుకు. ప్రక్కగదిలో పోలీసులు ప్రవేశించి, చాకలివదుచు గుడ్డలమూటలన్నీ చెల్లాచెదరుగా చిమ్మి, బానల్లో దాక్కున్నాడేమో అని బానలను కూడ బ్రద్దలుకొట్టి చూచారు.



కట్టు దాక్కున్నవసారాకు ఎదురుగానున్న గదిలో తుపాకిప్రేలింది. ఆసమయంలోనే పోలీసుల కండ్లబడకుండా

అన్నా మార్గంలో దాక్కుంది. "నువ్వుకూడా రివాల్వరు చేత ప్రేల్చివెయ్యబడతావా?" అని ఒక కార్మికుడు ఆమెను తనగదిలోకి బలవంతంగా తీసికొని వెళ్ళేందుకు ప్రయత్నించాడు.

"నన్ను వెళ్ళనియ్యి—మాకూ్సా" చాలవింతగొల్పే బొంగురుగొంతుకతో అన్నా అంది. "వినపడుతోందా, మాకూ్సా—వెళ్ళనియ్యినన్ను!" తనను గట్టిగా పట్టుకొని ఆపిన వ్రేళ్ళను పట్టువదలించుకు నేందుకు వృథాగా ప్రయత్నిస్తోంది. రివాల్వరుదెబ్బలు వినపడుతున్నాయి. ఆ కార్మికునికేసి ఒక నిమిషం చూచి రెండవచేత్తో వరుసగా రెండుదెబ్బలు బలం అంతా ఉపయోగించి ముఖంమీద కొట్టింది. గోడమీదకు పడిపోయాడు. తలుపులు ధడాలున తెరుచుకుని బైటకు పరిగెత్తింది. మళుపులో పతాకధారి, మరియొకడు అరెస్టు చెయ్యబడి లారీలో పడత్రోయబడ్డారు. జండా వెయ్యిముక్కలైంది.

ఊఫర్ స్టేషన్నుండి నాలుగుపోలీసువాన్లు వీసిన్ ప్రాసీకి వచ్చాయి ఆమళుపుఅంతా ఖాళీచెయ్యబడింది.

6 వ సంఖ్య ఇంట్లోంచి కర్టును పట్టుకొని రాకుండానే పోలీసులు ఇవతలికి వస్తూండటం అన్నా చూచింది. స్తంభింపచేసే ఒకఆలోచన ఆమెకు పట్టింది. కర్టు ఎక్కడవున్నాడు? ఆ పతాకధారిని తీసికొని వెడుతూన్నట్లే ఆతనినికూడ ఎందుకు

తీసికొనివెళ్ళుటలేదు? ఆమెకు కండ్లు-చీకట్లు క్రమ్మాయి. కర్రు ముఖం నేలవైపుపెట్టి పడివున్నట్లు భావించుకుంది.

ప్రజలు పరిగెత్తుకొనివెళుతూ ఆమెనికూడా తమతో లాక్కుపోతున్నారు

"పస్తుల (ఉపవాసాల) .........ప్రభుత్వం...... నశించాలి!"

పోలీసులు లాఠీలనెత్తిపట్టి వారివెంట పడ్డారు ఒక కార్మికుడు నేలమీద పడ్డాడు. ఒకభయంకరమైన లాఠీ దెబ్బతో పైకిలేచిన శిరస్సు మూల్గుతో వ్రాలిపోయింది.

"కమ్యూనిస్టు పార్టీకి జయ్! కమ్యూనిస్టు పార్టీ వర్ధిల్లాలి!"

ప్రజలు అరిచారు. వీధి అంతా ఊరిమింది. వారితో పాటు అన్నాకూడా అరిచింది. "జయ్......జయ్......... జయ్!" ఒకవైపున పోలీసులు వారిని తరుముతూంటే మరో వైపునుంచి వారు అరుస్తున్నారు. పోలీసుల తలలపైని కిటికీల లోంచి కార్మికులు జయజయధ్వానాలు చేస్తున్నారు. రెండవ అంతస్తుమీదనుండి రివాల్వరు దెబ్బతిని ఒక ఎర్రజండా క్రింద పడింది. వెంటనే ఒకయువతి భూమిమీదనుండి ఎర్రజండా తీసింది.

పెంగ్.........పెంగ్.........పెంగ్.........

గుండ్రటి పిస్తోలుగుళ్ళ కన్నాలు, గోడలమీద మసూచికపు మచ్చల్లాగు కనబడుతున్నాయి.

భీకరమైన రివాల్వరు ప్రేలుడు శబ్దముల ప్రతిధ్వనులు చుట్టుప్రక్కల పేటల్లోని కార్మికులకు భయంపుట్టిస్తున్నాయి. ఆపేటలోనికి పోలీసులు మందుగుండు సామానుతో అధికంగా రాసాగేరు. పట్టణంనుంచి వచ్చినవారు అన్నిచోట్లా పోలీసులు నిర్దాక్షిణ్యంగా కార్మికులను క్రూరంగా మొత్తుకుంటు న్నారని వార్తలు చెబుతున్నారు. హాకెమీసంతలో పొగాకు కార్మికుల ఊరేగింపుమీదకు కాల్చారు. ఆకాల్పుల ఫలితంగా ముగ్గురుపనివాండ్రు భూపతితులయ్యారు—ఒకడు చనిపోయాడు. క్లీమ్స సావిళ్ళలో సీసపుపనివాండ్రు సభచేసుకుంటూంటే వారిమీద రివాల్వర్లు ప్రేల్చబడ్డాయి. పదినిమిషాలక్రితం బాడ్ స్ట్రాసీలో ఒకఊరేగింపు వేటకుక్కలచేత యేవిధంగా చెల్లాచెదరు చేయబడిందో ఒకస్త్రీ వర్ణించింది. ఎర్రచిహ్నాలు ధరించిన ప్రతివారు పోలీసుల వీరవిహారానికి గురిఐపోతున్నారు. పోలీసుల అనుజ్ఞతోటే చేసుకుంటూన్న ఒకసభలో పాల్గొన్న నలభైమంది వడ్రంగిపనివాండ్రను అరెస్టుచేసి లారీల్లో యెక్కించి పోలీసుప్రెసిడియమ్‌కు తీసికొనిపోయారు.

లారీలవెంబడి లారీలు కోలిన్‌పేటకు దొర్లుకొస్తున్నాయి. ఎక్కడైతే పోలీసులు, లారీలు దూకి కార్మికులనూ లాఠీ

లతో మోసుతూంటారో వారివెనుకనే మరలప్రజలు ఊరేగిం
పుకు సాగిస్తున్నారు నెట్టెల్ బెన్ ప్లాజ్‌లో ఏదో వినాదంచేసి
వుంటాడనే అనుమానంమీద ఒకకార్మికుడు అరెస్టు గావింప
బడ్డాడు. ఆతడు కారులో పడవేయబడినతరువాత పోలీసుల
మధ్య కూర్చుండి వీధుల్లోవున్న కార్మికులకేసి గుప్పిడిబిగించి
"రెడ్ ఫ్రంట్" అని జయధ్వానం చేశాడు. కారువేగంగా పరి
గెత్తింది. ఆతడు మరిమాట్లాడకుండా నోరునొక్కి వేయ
బడ్డాడు

పోలీసు వానులు వీధులవెంబడి దూసుకుపోతూన్న
ప్పుడు ఉద్రేకపూరితులైనప్రజలు చెవులుగింగుర్లెత్తేట్లా అరు
స్తున్నారు. ఎప్పటికప్పుడే క్రొత్తక్రొత్త ఊరేగింపులు బయ
ల్దేరుతున్నాయి. కొన్నివందలగజాలదూరం వెళ్ళేటప్పడికి
పోలీసులు చెదరకొడుతున్నారు కాని ప్రజలు మరల మరల
బారులుతీరి ఉత్సవాలను జరుపుతూ వీధులవెంబడి తిరుగు
తున్నారు.

మధ్యాహ్నం అయ్యేటప్పటికి యీవిధంగా జరిగింది.

నెట్టెల్ బెక్ ప్లాక్జ్‌లో లీనిక్కెండార్ఫర్ స్ట్రాసీమార్గంలో
జనులు లేకుండా వుండేందుకు దట్టించిన రివాల్వర్లతో పోలీ
సులు తిరుగుతున్నారు. నిర్జనమైనవీధిమధ్య అప్పుడే ఒకసుకా
ణంనుంచి బయటకువచ్చిన ఒకయువతి అపాయస్థలంనుండి
తప్పించుకునేందుకు ప్రయత్నిస్తూన్నది.

## ఆజ్ఞ

ఆమె ఒకపౌరస్త్రీ. పొరపాటున ఆఅపాయప్రదేశంలో ప్రవేశించింది. హఠాత్తుగా ఒకపోలీసు ఆమెను తరమడమారంభించాడు.

హడలిపోయి, తడబడుతూన్న పాదాలతో ఆమె పరుగెత్తనారంభించింది. పదిఅంగలలో పోలీసు ఆమెను సమీపించి ఆమె శిరస్సుమీద లాఠీతోకొట్టాడు వీధికడ్డంగా దెబ్బలవర్షంలో కరిగెత్తింది. ఇరవైఅడుగుల తరువాత ఆమెబలం క్షీణించింది. శక్తిహీనతతో ఇటూ, అటూ తూలుతూ ఒక గోడమీద పడిపోయింది. శిరస్సు ఒకవైపుకు వ్రాలిపోయింది. మళ్లీ ఆపోలీసు అరిచాడు కాని, ఆమెభయంతోటి బాధతోటీ కదలలేకపోయింది. లాఠీమెత్తి బలంకొద్ది ఆబాలికముఖంమీద కొట్టాడు. ఆమెబుర్ర పగిలి క్రిందపడిపోయింది. మలుపుదగ్గర కార్మికులు గబగబావచ్చిచేరారు. రాళ్లు రివ్వురివ్వున యెగిరివచ్చి పోలీసులమీద పడుతున్నాయి. ఒకసైనికాధికారి శిరస్త్రాణం యెగిరి బురదలోపడింది.

పోలీసులువచ్చి మీదపడేముందు కార్మికులు వెనుకకు మరలిపోయారు. కాని యీసారి వళ్లుతలుపులు తాళం వేసుకున్నారు. మళ్లీ గోడలమధ్య రివాల్వర్లు ప్రతిధ్వనించాయి. నిర్జనమైనవీధిలో ఎర్రజెండాలు జ్వాలల్లా యెగురుతున్నాయి. మూలలనుంచీ, దాక్కున్నప్రదేశాలనుంచి, వందల

కొద్దీ కళ్లు, కోపంతో చిందరవందరగా పరిగెత్తి ఇండ్లమీద రివాల్వర్లను ప్రేలుస్తూన్న పోలీసుల్ని పరికిస్తున్నాయి. వీధుల్లోంచి వెళ్లిపోండి!......లేకపోతే ప్రాణాలమీద ఆశ వదలుకోండి!" అనిపోలీసులు అరుస్తున్నారు.

మూడవఅంతస్థు 19 వసంఖ్య గదికిటికీతలుపు తెరిచి, ఒకకార్మికుడు క్రిందనున్న పోలీసులవైపు చూస్తూ స్నేహ పూర్వకంగా పలకరించాడు. "హాల్లో కామ్రేడ్!".

గృహంబయట ఇద్దరుపోలీసులు నిలబడివున్నారు. వెంటనే వారు తెరచివున్నకిటికీ పైకి గురిచూచారు. ఒక్క క్షణంలో రివాల్వరు మీటనొక్కారు. పింగ్!

ఆకార్మికునిహస్తం వ్రాలింది. శిరస్సు కిటికీ అంచు మీదకు మెల్లిగాపడింది. మెల్లిగా ఆశరీరం గదిలోకి దొర్లుకుపోయింది. ఆకిటికీ ఖాళీఐంది ................

హఠాత్తుగాఆముఖాన్ని కబళించివేసిన ఖాళీ వైపు పోలీసు చూచాడు. భయభ్రాంతుడై చుట్టూచూచి ప్రక్కనున్న పోలీసుతో యేదోచెప్పి యిద్దరూ అక్కడనుండి అతి వేగంగా పరిగెత్తుకొని పోయారు.

కొద్ది నిమిషాల తరువాత పోలీసులందరూ వెళ్లిపోయారు. ఆపేట మరల నిర్జనమైంది. నిశ్శబ్దత ఘనీభవించింది.



# అన్నా

6వ సంఖ్య గది తలుపు తెరుచుకుని కర్టు గబగబా పరిగెత్తి 19వ గదిలోకి మాయమయ్యాడు.

తలుపు తెరిచివుంది. అప్పటికప్పుడే పొరుగువాళ్లు కొందరు ఆగదిలోకి వచ్చివున్నారు. ఆగవాక్షం క్రింద, జర్మనీ సోషల్ డెమాక్రాటిక్ పార్టీ, రీచ్ బానర్ ల సభ్యుడైన ఏభై రెండేళ్ల మాక్స్ జెమిాన్ హాట్ రక్తపు వరదలో పొర్లుతున్నాడు. గదిలో స్మశాన నిశ్శబ్దత ఆవరించి వుంది. కిటికీనుండి క్రిందకు ఒక సన్నటి రక్తపుధార వుంది. దానిలో గిలగిల కొట్టుకుంటూన్నది ఒకయీగ!

పక్క గదిలో నివశిస్తూన్న స్త్రీ, కర్టును గదినుంచి బయటకు తీసికొని వెళ్లి రహస్యంగా అడిగింది. "కర్టూ— రివాల్వరు యెవరు ప్రేల్చారో చూశావా?"

ఈరోజున మొదటిసారి కర్టు వణకడమారంభించాడు. ఆచీకటిదారి లో గోడకు జార్లబడి పోయాడు. ఆకఠిన సత్యాన్ని గ్రహించేందుకు అతని బుర్ర వ్యతిరేకిస్తోంది! ఆఖరికి చాలా భారంగాఅన్నాడు.

"నేను చూశాను. వాణ్ణి గుర్తు పట్టాను. అమ్మో! అదిహాత్య!"

* * * * * *

పది నిమిషాల తరువాత, ఊఫక్ స్టేషనులో వున్న హేబర్‌స్ట్రాకు, మరొక సార్జంటుకు బదిలీ ఆర్డర్లు వచ్చేయి. ఆనిమిషం మొదలుకొని సార్జంటు హేబరుస్ట్రా, కొలిన్‌స్ట్రాసీ లోని తన తండ్రి గృహంలో మళ్ళీ అడుగు పెట్టలేదు!

సార్జంటు హేబరుస్ట్రా, అతని తండ్రీ కూడా సో. డె. పార్టీ సభ్యులే!

# ఆన్నా

సీసపు పనివాళ్ల మీద పిస్తోళ్లు ప్రేల్చబడ్డాయి అనే వార్త వెడ్డింగ్ అన్ని మూలలకీ దవానంలా అలుముకుంది. దుకాణాలకు, స్టేషన్లకు, రైళ్లకు కూడా అది వ్యాపించింది. భయభ్రాంతులైన రైలు ప్రయాణీకులు పట్టణంలో నాలుగు మూలలకీ కూడా మోసుకుపోయారు. గుడిసెలలోకు, మేడ అంతస్థుల మీదకు, భాగ్యవంతుల భవనాలలోకి కూడా చొరుచుకు పోయింది.

"నీకు తెలిసిందా?.........నువ్వు విన్నావా..."

"ఎర్రి పేటలో పోలీసు ఒకమనుష్యుని ముఖంమీద పేల్చాడు. వాడు వెంటనే చచ్చిపోయాడు........"

ఇండ్ల లోంచి కార్మికులంతా పరిగెత్తు కొనివచ్చారు. ఆహత్యా వివరాలు ఒక కార్మికుడు చెబుతోంటే గుంపులు గూడి వింటూన్నారు. కార్మికుల గుడిసెలలో, ఉదయాన్ని ఉన్నంత శాంతంగా లేదు మేదినోత్సవం నాడు. పోలీసులందరూ, యేవిధంగా ప్రజల ప్రబల శత్రువులయ్యారో స్వయంగా

చూడని మనిషి ఒక్కడు కూడా లేడు. నెట్టెల్ బెక్ ప్లాజ్ చుట్టు ప్రక్కలనున్న వీధుల్లో పెద్దపెద్ద గుంపులుగా తిరుగుతూన్న ప్రజల ముఖాలలోని నరాలన్నీ బిగబట్టి వున్నాయి. రివాల్వరు ప్రేలిన తరువాత ఒక గంట వరకూ ఆచుట్టు ప్రక్కల ఒక పోలీసు కూడా కనపడ లేదు.

కోలిన్ స్ట్రాసీ గోడల మీాదవున్న, పిస్తోలు, రివాల్వరు గుండ్ల కన్నాలను చూచేందుకు మరీమరీ ప్రజలు రాసాగేరు.

మూాడవ అంతస్థు కిటికీ తలుపులు మూాసి వేయబడ్డాయి. వందల కొలది ప్రజలు క్రింద నిలబడి పైకి చూస్తున్నారు. కిటికీ సమీాపంలో ఒక యెర్ర జండా యెగుర్తూన్నది. ఆ జెండా మీాద నాలుగు గుండ్రటి చిల్లులు స్పష్టంగా కనిపిస్తున్నాయి. మళుపు దగ్గర నున్న కసాయి దుకాణం బయట ఒక గుంపు కూడింది. ఒక అపరిచిత కంఠం కార్మికుల కుపన్యసిస్తూన్నది.

"బ్రేవో శభాష్" ఒకరు అరిచారు.

"ఆయన చెప్పేదంతా నిజం."

పోలీసులు వెడలిపోయిన తరువాత వీధిలో కనపడిన అన్నాను కర్టు వెంట బెట్టుకొని వస్తూ ఆజన సమూహాన్ని చూచేడు. పరిస్థితులను గూర్చి చర్చించేందుకు థామస్, పాల్ లకొరకు చూస్తూన్నాడు. కాని వారెక్కడా కనపడడం లేదు. ఆపేటలోని పరిస్థితులు నిమిష, నిమిషానికి అపాయ

కరంగా మారుతున్నాయని ఆతడు దృఢంగా నమ్ముతున్నాడు. ఏక్షణాన్నైనా పోలీసులు తిరిగి రావచ్చును. అప్పుడేమి జరుగుతుందో ఎవరూ ఊహించ లేరు. ఉద్రిక్త జనసమూహా లను చేతిలోవుంచుకొని నాయకత్వం నిలుపుకోవడం అత్యవసరం!

"కర్టూ! చూడు. అక్కడ ఎవరో మాట్లాడు తున్నారు" అని అన్నా ఆతనితో చెప్పింది. కసాయిదుకాణం బయట నిలబడిన వారు నవ్వుతున్నారు. పొగడు తున్నారు. అప్పుడు మరల పెద్ద కంఠస్వరం మరల వినపడ సాగింది. కర్టు దృష్టి ఇప్పుడు పూ[illegible] ఆకర్షింప బడింది. "ఎవరది!"

గుంపులో జొర[illegible] మనుష్యుల్ని ఇటూ అటూ త్రోసుకుంటూ ముందుకు [illegible] దుకాణపు మెట్లమీద తోలు జాకెట్టు ధరించిన వ్యక్తి నిలబడి వున్నాడు. ఆతని ముఖం ఉద్రేకంతో ఉబ్బి ఎర్రబడి వుంది. చాలా తరుచుగా కిచు గొంతుక పడుతోన్నది. "తమాషా మనిషే!" అని అనుకున్నాడు కర్టు.

"అది ఒక్కటే ఐయ్యుండదు," ఆ ఉపన్యాసకుడు అరుస్తున్నాడు. "మనం, మనగుప్పిళ్ల తోటి, రివాల్వర్లు మర ఫిరంగులను వ్యతిరేకంగా పోరాడాలేమిటి?"

"తప్పకుండా నిజం" ఒక యువతి చప్పట్లు చరుస్తూ అరిచింది.

"రివాల్వర్లకు రివాల్వర్లొక్కటే సమాధానం చెబుతాయి!"

"బ్రేవో!"

మొట్టమొదటి సారి అపాయకరమైనట్టి, ఉద్రేకపరచేటి ఈపదము పడి వెంటనే నాటుకుంది. చాలా తీవ్రమైన చర్చ రేగింది. తక్షణమే అందరూ అరుస్తున్నారు. "ఔను—ఆతడు చెప్పింది నిజమే! ఈహంతకుల్ని పేల్చి పారవెయ్యండి. వాళ్లు మనల్ని కాలుస్తూంటే, మనస్వరక్షణార్థమే మనం కూడా కాల్చాలి. ఇంకా మనలో అనేకమంది చచ్చే వరకూ మనం వేచి వుండాలా?" మెల్లిగా [illegible]త్రోవ చేసికొని ముందుకు వెళ్లాడు.

"కామ్రేడ్స్! ......" ఆ [illegible]్యాసకుడు తన వ్రేలితో చూపుతూ "ఊఫక్ స్ట్రేమర్ణలో పిస్తోళ్లు, రివాల్వర్లు, మందుగుండుసామాన్లు, కావలసినన్ని వున్నాయి ...... రండి—వెళ్ళి తీసుకొద్దాం!"

ప్రజలందరూ ఈలలు వేస్తూ, చప్పట్లు చరుస్తూ ఆతనిని పొగడుతూంటే కర్టు ఆస్తూలకాయుని సమీపించి చెయ్యి గట్టిగా పట్టుకున్నాడు.

"అయన్ని ఒదిలెయ్యి! ఆయన చెప్పిందంతా యదార్థం" ఒక స్త్రీ అరిచింది. అస్తూలకాయుని వదనం వివర్ణమైంది. వెళ్ళిపోయేందుకు దారులు వెతుకుతున్నాడు.

# అన్నా

"ఆగు. కదలకుండా నిలబడు! నువ్వెవడవ్? ఎక్కణ్ణుంచి వచ్చావ్?" కర్టు గట్టిపట్టును వదలిపించుకొనేందుకు చాలా శ్రమపడ్తున్నాడు. "నన్ను వెళ్ళనియ్యి!" ఆతడు మూలిగాడు. "ఎవని ఉద్దేశ్యంవాడు చెప్పకూడదు, కామ్రేడ్స్? నేనో కార్మికుణ్ణి" హఠాత్తుగా కూలివాని వలె బెర్లిన్ కార్మికులు మాట్లాడే భాష ఆరంభించాడు.

"ఏమిటి?—కూలివాడివా?" అందరూ వినగలిగేటంత గట్టిగా అరిచాడు. "ఐతే ఒక్కసారి నీ చేతులు చూపించు!"

ఆవీధిలో కొందరు పిల్లలు "అరుగో, అక్కడ ఇంకో కట్టె పట్టుకున్నారు అక్కడ"అంటూ అరుస్తూ పరిగెత్తుకొచ్చారు. వీపువెనక్కాల దాచుకుంటూన్న చేతులను బలవంతంగా లాగి ఆతని మణికట్టులను గట్టిగా పట్టుకొని బాగాబలిసిన గులాబీవర్ణపు వేళ్ళను చూపించాడు కర్టు. ప్రక్కనే నిలబడి వున్న ఒకముసలి కార్మికుడు "వాటితోటి మురాలపడియున్న ముసలిదానిమీద మాత్రమే నువ్వు పనిచెయ్యగలవు!" అన్నాడు నవ్వుతూను. అందరు పకాలున నవ్వారు. "ఓరి తంపుల మారి వెధవా!*" అని ఉరిమాడు కర్టు. "ప్రజలను ఉద్రేకపరిచేందుకు వచ్చావా? పందీ!" ఆసమయంలోనే ఆలావుపాటి

* ప్రోవొకేచర్: అనవసరసమయాల్లో ప్రజలను ఉద్రేకపరచి పోలీసులమీద తిరగబడ్డారనే నెపంమీద పోలీసులచేత కాల్పించేందుకని నియమింపబడినవాడు.

బొందమనిషి వెనక్కు గెంటాడు. ఆతని టోపీ ఒక ప్రక్కకు పరిహాసాస్పదంగా వేళ్ళాడుతూన్నది.

ఆపోలీసు యేజెంటు తనజేబులో చెయ్యివెట్టాడు.

"చూడండి, ఈపందికొక్కు కాల్చిచంపాలని చూస్తున్నాడు!" అంటూ కర్ర రెండవసారి ఆతని భుజంమీద కొట్టేడు ఇప్పుడు తక్కిన కార్మికులు కూడా అందుకున్నారు. దగ్గర దగ్గరగా వాడుపన్నిన వలలో చిక్కుకున్నామని వాళ్ళిప్పుడు తెలుసుకున్నారు.

"ఆసందులోకి గెంటుకుపోండి వాణ్ణి!" ఎవరో అరిచారు. "పొడవండి పందిని!" "మళ్ళీ వీధిముఖం చూడకూడదు వీడు!"

ఒక యువకుడు "కామ్రేడ్స్—వెళ్లిపొండి! వీధిలో అనేక మంది పోలీసుయేజంట్లు ఉన్నారు. మళ్లీ పోలీసులు వస్తారు!" అని హెచ్చరించేడు.

సందులోంచి గుమ్మాపోట్లధ్వని, పోలీసుయేజెంటు ఆర్తనాదం, వినపడుతున్నాయి మరొక ఏజెంటు "రెడ్ నైటింగేల్" లో పట్టుబడిచావుదెబ్బలుతిని, ఆఖరునిమిమంలో తప్పించుకుని బయటపడ్డాడు. క్రొత్తముఖాలు అనుమానాన్ని కలుగచేస్తున్నాయి. సాదాబట్టలు కట్టుకొని మామూలుగా

వ్యవహరిస్తూన్న పోలీసు గూఢచారులుకూడ వీరిలో కలిసే తిరుగుతున్నారు.



'మూడుగంటలవేళ పీసెన్ స్ట్రాసేనుంచి, కోలిన్ స్ట్రాసేకి బిగ్గరగా పాడుకుంటూ ఒక గొప్పఊరేగింపు వస్తూన్నది. ఒక కమ్యూనిస్టు యువకుడు నడిపిస్తున్నాడు ఆఊరేగింపును పేటలోనుండి. కార్మికులందరూ ఆఊరేగింపులో పాల్గొనేం దుకు పరిగెత్తారు. "విప్లవశ్రేణి సైనికులు!" అని అరిచారు. అందరూ కిటికీలలోంచి ఎర్రజండాలు ఊపుతున్నారు. యుద్ధ సైనికులవలె బారులు తీర్చి నిలబడి గొప్పశిక్షణను ప్రద ర్శిస్తూ వెడుతూన్న కొద్దీ పెరుగుతూన్న ఊరేగింపు ఆవీధి వెంట సాగుతోన్నది.

ఆవర్తిదర్శకుల పత్రిక అన్నా పరిగెత్తుతూన్నది. ఆ పేటలోవున్న మనుష్యుల ముఖాలమీద వున్న భావాలను ఎంతవింతగా యీఊరేగింపు మార్చింది? అని ఆలోచిస్తోంది అన్నా. మనుష్యులలో వ్యక్తమైన వ్యగ్రభావం ఇప్పుడు అంతర్ధాన మైంది. హఠాత్తుగా వారంతా ఆత్మవిశ్వాస పూరితులై, క్రమం తప్పకుండా భుజము, భుజముతాకలిపి నడు స్తూంటే నూతనశక్తితో ఉద్దీపించారు.

జీవితంలో ప్రథమపర్యాయం అన్నా వేలకొలది ప్రజలతో బాటు తానుకూడా కదంత్రొక్కుతూ పదంపాడుతూ అడుగువేస్తూన్నప్పుడు, హృదయంలో లేచి, ఎర్రబారిన కళ్ళవరకూ మహోల్లాసం, దర్పం నిండివుండుటను అనుభవించింది. అది ఒక ఆంతరంగిక పరవశభావం కాబట్టి ఆవిడ కన్నులకు మిరుమిట్లు కొల్పింది. ఆవివర్ణ వదనాల్లో కాన్పించే తేజస్సుకిదే కారణభూతం అనుకుంది. అన్నా ఈఅనుభూతినే తాను కూడా పొందుతూన్నందుకు అన్నా చాల సంతోషిస్తూన్నది.

ఊరేగింపు రీనిక్కెండార్ఫర్ స్ట్రాసీ గడిచి వీసెన్ స్ట్రాసీ జేరుకుంటూన్నది. పాట హఠాత్తుగా ఆగిపోయింది. ప్రక్కనున్న ప్రజలందరూ చప్పట్లు చరుస్తూ ఈలలు వేస్తూ "కార్మికుల హంతకులు నశించాలి!" అని రణగుణధ్వని చేస్తూన్నప్పుడు మాత్రమే ఆమె పోలీసుల శిరస్త్రాణాలు తమముందే ఎండలో తళతళలాడటం చూచింది.

ఆవిడ భయభ్రాంతఐనది. తనకొరకు కాదు — తన కామ్రేడ్స్ కొరకు—అందరికోసం! ఇప్పుడు బెడ్డలుతీస్తూన్న కామ్రేడ్స్ కోసం!

"మీరెక్కడ ఉన్నరో అక్కడేనిలబడండి, కామ్రేడ్స్!" అని ఎవరో అరిచేరు, తోటివారితో పాటు ఆమెకూడ ముందుకు నెట్టివేయబడింది. వివర్ణ వదనాలనుండి శాంతమైన

తేజస్సు అంతర్ధానమైంది. చెవులను గింగుర్లెత్తించే ఒక స్త్రీ కంఠస్వరం కిటికీలోంచి వినపడింది. "వేటకుక్కలు"

ప్రజలశిరస్సులమీద ప్రహారుగాలివలె ఆయువతి కంపిత గాత్రం ప్రతిధ్వనించింది. వారి వెనుకభాగాన్ని రీనిక్కాండార్ఫర్ వీధినుండి పోలీసు వారు వస్తూన్న ధ్వనివినపడుతూన్నది. చాల దూరంలో ఎక్కడ నుంచో ఒక కొత్తకంఠధ్వని "కాల్చండి!" అని వినపడింది.

ఆమెముందున్న యువకుడు వెనుకకు తిరిగేడు ఆతని చొక్కాగుండీ కన్నంవద్దనున్న ఎర్రిపాతకం ఆమె కండ్ల ముందు నాట్యం చేశింది. అది అంతకంతకు మరీ పెద్దదైంది. పిచ్చివేగంతో గిరగిరా తిరిగిపోతూన్న చక్రం క్రింద మారింది...........

పెంగ్......పెంగ్.........పెంగ్ అతిత్వరితంగా కాల్చబడుతూన్న పోలీసు పిస్తోలుగుళ్లు ప్రజలగుంపులో మారుతున్నాయి.

"ఓ......ఓ...ఓఓ!" ఆమెముందున్న కార్మికుడు పొట్టను చేత్తోపట్టుకుంటూ, బాధాకరమైన మూల్గులతో క్రింద కూలిపోయాడు. కొద్దిగజాలదూరంలో పాలిపోయిన పోలీసు ముఖం సాక్షాత్కరించింది.

ఒకరాయి రుంయ్ మంటూవచ్చి ఆపోలీసు నున్నటి దేహాని చీల్చింది. ఆతని శిరస్త్రాణం ఎగిరి అవతలపడింది.

రక్తంకారుతూవున్న ఆతని తలమీద జుట్టు ఎంతపలచగా వుంది. వింతగొల్పుతోంది. దానితరువాత అన్నా మరేమీ జ్ఞాపకంవుంచుకోలేక పోయింది.

పోలీసులు, తుపానువలె ఆమెను క్రమ్మివేసి ముందుకు సాగిపోయారు. లారీలు, గుండ్లు, వీధిని ఖాళీచేశాయి. చుట్ట చుట్టుకుని, బోర్లగితలపడివున్న దేహాలు రోడ్డుమీద పడివున్నాయి. ఆయువకుని కడుపులోనుంచి రక్తం చారికలుకట్టి బొట్లుగా రోడ్డురుఖ్ఖుమీద పడుతూన్నది. కొద్ది అడుగుల పైన, బూడిదవర్ణంగా వున్న ఒకముఖం ఆకాశంవైపు చంచలమైన కండ్లు నిగుడించి పడివుంది. తెరవబడివున్న నోటినుండి, ఎర్రబుడగలు వస్తున్నాయి. గుండు ఆతనివీపును చీల్చుకుని ఊపిరితిత్తుల్లో ప్రవేశించింది. గుండుదెబ్బతిన్న కాలుతో ఒక మనిషి మెల్లిగా వీధులోంచి అవతలి ప్రక్కకు డేక్కుంటూ వెడుతున్నాడు. ఒకచిన్నకుర్రాడు కడుపు ఉబ్బేట్లా రోదిస్తూ దోవ, తెన్ను తెలియక ఇటూ అటూ విరిగిన చేతితో పరిగెత్తుతున్నాడు. ఆంబ్యులెన్సు కారును ఒకరు పిలుస్తున్నారు.

నలుగురైదుగురు కూలీయువకులు క్షతగాత్రులను జాగ్రత్తగా ఒకయింటికి మోసుకొని వెళ్ళారు. నిర్జనమైన వీధిలో మూడునాలుగు రక్తపుబురదగుంటలు మాత్రం మిగిలివున్నాయి.

తలుపు లన్నీ తాళములు వేయబడ్డాయి. పోలీసులు గబగబా వాటిప్రక్కనుండి పరిగెత్తుతున్నారు. పిచ్చికుక్కల రోషావేశపు మొరుగులవలె రివాల్వరు గుండ్లు ఎత్తుగోడల మధ్య ప్రేల్తున్నాయి. కిటికీ తలుపులవెనుక కార్మికులు—తమశత్రువులు—దాక్కొని వున్నారు. పోలీసుల ముఖాలు శిరస్త్రాణములక్రింద, భయగ్రస్తములై ముడుచుకొని పోయాయి. వారిముందు, వెనుక, పైన, శత్రువులు వందలకొలది వున్నారు. కమ్యూనిస్టులు వేచివున్నారు — వందలు — వేలు— ఆపేటంతా వారితో క్రిక్కిరిసివుంది — పట్టణం అంతా వారితో నిండివుంది.

పెంగ్... పెంగ్... వణుకుతూన్న వ్రేళ్లు వాటంతటవే ట్రిగ్గర్లను మీటుతున్నాయి. తుపాకులను కాలుస్తూన్నంత కాలం, ఆదిష్టిపిడత కార్మికులముఖాలు కనపడవు. ఎర్రజండాలు ఒక్కటే మిగుల్తాయి— అసహ్యకరమైన ఎర్రపీలికలు!

"ఆపీలికల్ని నాశనంచెయ్యండి!" ఒకఉద్యోగస్తుడు ఆజ్ఞాపించాడు. నిప్పుగోళాలు ఎర్రజండాల మీదకురిశాయి. ఒక వెదురుబద్ద విరిగి క్రిందపడి, గుండుదెబ్బ తిన్న మనిషికి మళ్ళే గోడకు ఆనుకొని పడివుంది.

"కిటికీల దగ్గరవున్న జండాలన్నిటిని మాడ్చివెయ్యండి" గాజు టపటపలాడింది. మట్టిపూత బెల్లులూడి పడ్డాయి ఆకస్మికంగా — ఒక వందకంఠాల్లోనుంచి రోషార్భాటం! ఒక

పెద్దపతాకం నాలుగవ అంతస్తునుండి, క్రిందపడితే ఒక పోలీసు దానిని పీలికలక్రింద చింపుతూ తలవెనుక భాగాన్ని పెద్ద ఆర్తనాదం చేస్తూ నొక్కుకుంటున్నాడు. మాంచి సూది రాయి అతని బుర్రకు తగిలించి.

క్రిందనున్న నీలపు దెయ్యాల చేతుల్లో పడకుండా, ఎర్రజండాల్ని కిటికీలలోనున్న వారు లోపలకు లాక్కున్నారు. కాని మొదటి అంతస్థు మూడవ కిటికీలో ఇంకా ఒక చిన్న పతాకం యెగురుతూనేవుంది.

"ఎర్రపీలిక భస్మం అవ్వాలి" "క్రిందకు లాగండి జండాని!"

నలుగురు పోలీసులు ఒకరి వెంబడి ఒకరు కాల్చేరు. ఆకిటికీ అద్దపు ముక్కలు టప్‌టప్‌న క్రింద పడ్డాయి. కాని ఆగోడ మీద నుంచి ఆ ఎర్రచుక్క అంతర్ధాన మవలేదు. ఒక మందపవనం ఆజండా గుడ్డను తటతట కొట్టుకొనేట్లాచేశి, ఆ అగ్నిగోళాల శక్తిహీనతను వెక్కిరిస్తోందా! అనిపించేట్లా చేశింది.

ఆకస్మికంగా, పోలీసులను విభ్రమచిత్తులను చేశేటి, అపాయకరమైనట్టి విశేషం జరిగింది. ఒక ఆడది నవ్వింది! మందపవనం ఒక స్త్రీ అపహాస్యాన్ని మోసికొని వచ్చింది. విజయ గర్వంతో అపహాస సూచకమైన ప్రతిధ్వనించే నవ్వు! భయభ్రాంతులైన పోలీసుల శిరస్సుల మీద పక్షివలె ఆధ్వని

కొద్ది కాలం ప్రేళ్ళాడి ఆపైని క్రమంగా అంతర్ధానమై పోయింది.

వీధిలో ఉన్న వారంతా దానిని విన్నారు. అది, ఇళ్ళ ముందు ప్రతిధ్వనించి, గోడలకెగప్రాకి, గదుల్లో మ్రోగింది. అకస్మాత్తుగా, వివర్ణములైన శ్రామికుల ముఖాలు, తేజస్సుతో బలోద్దీపకాలైనవి.........కాలుస్తూండండి......కాల్చండి, కాల్చండి! హత్యచెయ్యండి! చంపండి!.........ఎవర్ని చంపుతున్నా రనుకుంటున్నారు? మాపంటల్ని చంపగలరా?......మాఆకల్ని?......మారోగాల్ని?.........మానిరుద్యోగాన్ని?......ఓకార్మికుల హంతకులారా! మీరివాల్వర్లతోగాని, మీఫిరంగులతోగాని, ఏనాటికీ నాశనం చెయ్యబడజాలనివి. దీర్ఘకాలం వర్ధిల్లుగాక! ప్రపంచవిప్లవం వర్ధిల్లాలి!

ఇప్పుడు పోలీసుల ముఖాలు తెల్లబోయాయి. అవ్యక్తమైన, అపరిచితమైన నవ్వు, వారిలో పిరికితనాన్ని కలుగచేసింది. ఉన్మాదంతో మళ్ళీ గోడలమీద, కిటికీల్లోకి, గడియలు బిగించబడిన తలుపులమీదకు కాల్చడం ఆరంభించారు.

ఎర్రజండా ఎగుర్తూన్న మూడవగది కిటికీ తలుపులను భేదించుకుని సీసపు గుండ్లు, ఆల్బర్టు హీడక్ తోలుపటకాలో ప్రవేశించి శరీరంలో పెద్దగాయం చేశింది. తలుపు వెనుక కాళ్లు బిగిసిపోయి ఆతడు భూపతితుడయ్యాడు.

# ఆనాం

పాల్, లెనిన్‌లు

రీనికెక్కండార్ఫర్ స్ట్రాసీలో జరుగుతూన్న పెద్ద ప్రదర్శనం మూలాన్ని ఆవీధినుండి పోలీసులు వెళ్లిపోయారు. దూరాన ఉన్న వీధులలో కార్మిక ప్రదర్శనాలు వారికి తొందర కలుగ చేశాయి కాబట్టి కొంత కాలం వరకూ పోలీసులు వీధికి దూరంగానే వుండిపోయారు.

ఆవీధికి ప్రక్కవీధులు లేవు పారిపోయేందుకు అవకాశాలు లేవు ప్రదర్శకులు ఒక ఎలుకల బోనులో చిక్కుకుంటారని పోలీసులు గ్రహించారు. వీధికి రెండువైపులను కాచి పిస్తోళ్ళతో ప్రేలుస్తూంటే రక్షణ వుండదు. కోలిన్ స్ట్రాసీకి అడ్డంగా వీసెన్ స్ట్రాసీ T యీఆకారంలో వుంది అంతే కాకుండా ఇక ముందు ఆవీధిలో వారికి ఇండ్లు రక్షణ సాధనములు కాజాలవు. పోలీసులు గృహాలను కూడా అగ్నిగోళాల్తో ముంచేత్తేస్తూ కార్మికులను ఇండ్ల లోకి కూడా తరుముకొస్తున్నారు. దొడ్లనుండి పారిపోదలచువారు ఒకవైపున వెడ్డింగ్, రెండవ వైపున రీనికెక్కండార్ఫర్ స్ట్రాసీ వరకు మాత్రమే జేరగలుగు

దురు. కాని ఈరెండు వీధులు పోలీసుల పిస్తోళ్ళ బారులోనే వున్నాయి. రెండవ వైపుదొడ్లు పాంకేనీళ్ళవొడ్డునవున్నాయి. ఒకవేళ వారు దానిని దాటగలిగినచో వీసెన్ స్ట్రాసీ మాత్రమే చేర గలుగుతారు.

ఇండ్ల వరుసను చుట్టుముట్టడం అతి తేలికైన పని. త్వరలో పోలీసులు అంతపని చేస్తారు. అప్పుడు గతి ఏమిటి?

ఆవీధిలోని గదుల్లో, గోడలమీద సామాన్ల మీద పిస్తోలు గుళ్ల గురుతులు కనపడుతున్నాయి. రాలి పడు తూన్న బెల్లుల మూలకంగా పిల్ల లనేకులు గాయపడ్డారు. గోడకు నాలుగు పిస్తోలు గుళ్లు తగిలి, ఒక పండ్రెండేండ్ల పిల్ల, మట్టి బెల్లులతో కప్పుపడిపోయింది.

పిల్లల్ని ఆవీధినుంచి దాటించడానికి అగ్నిగోళమండలం దాటవలసివుంది. క్రిందనున్న "నీలపుదెయ్యాల్ని" (పోలీసుల్ని) శాపనార్థాలు పెడ్తూ యేడుస్తున్నారు తల్లులు.

"మీరు మొగాళ్లేనా?" కార్మికుల కేసి అరుస్తున్నారు.

"మీపిల్లల్ని, పెళ్లాల్ని పోలీసు గుళ్లకు ఎరగా విస్తున్న పిరికిపందలు, దద్దమ్మలు! పిల్లలకి మల్లే శెడ్డలువేసి పారిపోతూంటారంతే!"

"మీరు అర్థంచేసుకోరు—" అని మాత్రమే పురుషులు సమాధాన మివ్వగలుగుతున్నారు. "మాఅంతట మే యీరోజున విప్లవం లేవదియ్యలేం"

అర్బే—మీరు గంభీరోపన్యాసాలు మాత్రం ఇవ్వ గలరు!" "మీ మొహంకల్లో మీకు పట్టులేదు! పిరికి పందలు మీరు! ఆపందుల చేతుల్లో పిస్తోళ్లు ఉన్నాయి కాబట్టి వాటిని తీసుకో లేకుండా బట్టలు తడుపు కుంటున్నారు — ఏం కమ్యూనిస్టులయ్యా మీరు!

అప్పుడు పురుషులు మళ్ళీ వీధుల్లోకి వెళ్ళి వారిలో వారు అనుకోవడమారంభించారు. "ఆ ఆడాళ్ళు చెప్పింది నిజం—కాని, పిరికి వాళ్ళమా మనం? కాదు. మనం పందలం కాదు. ఈ ఎర్రవీధి అల్లాటిది కాదు. —కాని—ఐతే ఏమిా? మనమేంచేస్తాం? ఏంచెయ్య గలం? వెధవ పోలీసులు."

"రెడ్ నైటింగేల్" ఇరుకు సందు అంతా ఉద్రిక్త వద నులతో కిటకిటలాడి పోతూన్నది. ఎలక్ట్రిక్ దీపస్తంభము క్రింద ప్రజలు గుమికూడి వున్నారు. థామస్ పాలులు కూర్చున్నారు. థామస్ చేతికి కట్లు కట్టబడ్డాయి. ఆతని టోపీ నెట్టిల్ బెక్ ప్లాజ్‌లో ఎక్కడో పడివుంది.

"కామ్రేడ్స్—" కర్టు శాంతంగా చెపుతున్నాడు. "ఇంకా కొద్ది గంటల్లో చీకటి పడుతుంది. అప్పటికూడా యీవీధిలోనే వుండేటట్లైతే ఏంజరుగుతుందో మీకే తెలు స్తును. మనఇండ్లలో చచ్చిన వారు ఇద్దరై వుండరు. బహుశా, ఇరవై మంది ఔతారు!"

కర్ట్ ఒక్క క్షణం ఆగి వారి ఆలోచనలను చదువు తూన్నట్లు కార్మికుల ముఖాలు పరీక్షించి మరల కొనసాగిం చాడు. "ఈపోలీసుల్ని మళ్ళీ మన వీధిలోకి రానియ్య కూడదు, అని తోస్తూన్నది నాకు, కామ్రేడ్స్!"

"నువ్వు చెప్పింది నిజం, కర్ట్!"

"కామ్రేడ్స్, అది ఒట్టి పిచ్చి తనం," పాల్ అరిచి, ఉద్రేకంతో ఛటాలున లేచాడు. "మీఅంతటమీరే ఓ అం తర్యుద్ధాన్ని లేవ తీయ తలుచుకున్నారా? నేను, అసమ్మతిని తెలియ పరుస్తున్నాను—"

థామస్, ఆతణ్ణి కుర్చీలోనికి లాగి అణచి కూర్చోపెట్టాడు. "పాల్, ఒకనిమిషం మాట్లాడ కుండా వుండు. కర్ట్ ఏమి చెప్పదలచుకున్నాడో చూద్దాం"

కర్ట్, కనుబొమలు ముడిచి పాల్ వంక తీవ్రంగా చూ చేడు. తమ చుట్టూవున్న కార్మికులకు పాల్ కమ్యూనిస్టు వీధి సంఘానికి ఈరోజుకు ఉపనాయకుడని తెలుసును అన్నమాట కర్ట్ బాగా యెరుగును. దానిని గూర్చే ఆలోచిస్తున్నాడు.

"కామ్రేడ్స్, పోలీసు లిక మనవీధిలో అడుగు పెట్ట కూడదని నేను చెప్పాను. పోలీసులు కాకుండా మనమే వీధిని ఆక్రమించి, ఇతరుల్ని లోపలికి రానియ్యకుండా అడ్డగించాలి. ముఖ్యంగా మనం కార్ల్‌ను రాకుండా చూడవలసివుంది!"

"ఆఁ! అదే పరమ ముఖ్యమైన విషయం, ఆపోలీసు టాంక్‌లు!"

"ఆమూల ఇండ్లు కట్టే సామాన్లు ఉన్నాయి. మనం తక్షణమే వీధికి అడ్డంగా ఒక చిన్న కోట గోడని (బారికేడ్) తాత్కాలికరక్షణార్థమై నిర్మించాలి!" మేజాబల్లపైని తన వెడల్పాటి చూపుడు వ్రేలును నొక్కాడు. "ఇది, వీధి" తన వ్రేలితో గీతగీసి, "ఇది వెడ్డింగ్ — ఇది పాంక్‌స్ట్రాసీ."

ఆవ్రేలు వంకర టింకర త్రిభుజాన్ని గీసింది. కార్మికులు తదేకధ్యానంతో ఆమరకల మేజాబల్లమీాద, ఆతని వ్యూహ రచన వంకచూస్తున్నారు.

"ఇక్కడ," తన గొంతుతో మెల్లిగా, కొట్టాడు. "మన మొక అడ్డుగోడను కడతాం—ఇక్కణ్ణుంచి, ఇక్కడికి రెండవది. ఆమూలనుంచి అడ్డంగా ఇక్కడికి మూడవది తిన్నగా వీధి ప్రవేశందగ్గర అప్పుడు, మొత్తం మలుపు అంతా మూాయబడి పోతుంది. పోలీసులు, అక్కణ్ణుంచి గాని, ఇచ్చటనుండిగాని లోపలికి ప్రవేశించలేరు!"

తదేకదృష్టితో చూస్తూన్న నేత్రాలు, ఆవ్రేలి గోరు బల్లమీాద చేస్తూన్న ప్రయాణాలను వెంబడిస్తున్నాయి.

కర్టు పైకిచూచాడు. ఆతని ముఖం ఇంతకిత్రం వున్నంత శాంతంగా లేదు. తన పన్నాగం, పోరాటాన్ని పూర్తిగా,

తీవ్రతరం చేస్తుందని ఆతడు పూర్తిగా యెరుగును. రాత్రి పడుతూన్నకొద్దీ మహాభయంకరం ఔతున్న పోలీసు భయం నుండి ప్రజలను రక్షించాలంటే, అంతకంటే వేరే గత్యంతరం లేదు. పోలీసులు చేసిన ఆఖరిదాడికి ముందు దారికి అడ్డంగా కొన్ని దూలాలను పడవెయ్య నారంభించారు. ఆవీధిలో నున్నవారు, ఎట్టి ప్రతిఘటనా చూపకుండా ఒకరి తరువాత మరొకరుగా కాల్చి వేయబడటానికి ఒప్పుకోరు అని కర్టు యెరుగును. ఇంతకిత్రమే, మేడమేట్లమీద, దొడ్లలోను, కావలసినంత చూచాడు, విన్నాడు.

థామస్ లేచి నిలబడి, పిడికిటితో బల్లమీదగ్రుద్ది "నిశ్చయమైంది, కర్టూ—లేవండి, అబ్బాయిలూ, ఒక్కక్షణం కూడా వృధా చెయ్యకూడదు.

కార్మికు లందరూ ఒక్కుమ్మడిని లేచారు. "తక్షణమే బయల్దేరండి! అవతల బోలెడంత పనుంది."

అందరూ, అరుస్తూ ఇటు అటు పరిగెత్తు తున్నారు. నిస్సహాయ నిస్పృహాల వాతావరణం, నిశ్చితమైన, బలపూరిత మైన, శక్త్యుద్ధకమైన, భావానికి తావిచ్చింది.

| | | | | |

మేజాబల్లవద్ద కర్టు, పాలులు మాత్రమే నిలబడి వున్నారు. ఆగది పూర్తిగా నిర్జనంగా వుంది. ముందుగదిలో, బ్లాక్‌విల్లీ గ్లాసులు కడుక్కుంటున్న చప్పుడు వినపడుతోంది. తక్కిన కార్మికులకు ప్రోత్సాహమిచ్చి పని పూర్తి చేయించాలని కర్టు కున్నది కాని, పాల్‌ను ఆషిథంగా మూకీభావంగా ఉండనివ్వడం మంచిది కాదు. అనుకున్నాడు కర్టు ఆతనితో త్వరగా మాట్లాడ వలసివుంది. విషయం చాల ముఖ్యమైనది.

పాల్, మెల్లిగా ముఖం యెత్తి కర్టువైపు చూచాడు. ఆతని ముఖం పూర్తిగా మారింది. ఉద్రేకంతో కంపిస్తూన్న స్వరంతో ఆతడు నెమ్మదిగా అన్నాడు. "కర్టు—నువ్వేం చేశావో నీకు తెలుసునా? ఇక ముందు జరిగేదానికి, నేనే మీ బాధ్యత వహించను. ఈఉద్యమంలో, ఇరవై యేళ్ళ నుంచీ, పనిచేస్తూన్నానని నీకు తెలుసుకదా! నేను పిరికి పందను కాదు. వింటున్నావా?" భయపెట్టేట్లా గొంతుకను పెద్దది చేశాడు "నేను పిరికి పందనుకాను కాని, దీంట్లో నేను జోక్యం కలుగచేసుకోను!"

ఆతనిముఖం వివర్ణంగా వుంది. కర్టు ఆతనికేసి, ఆశ్చర్యంగా చూచాడు. పాల్ చాల కొత్తగా మాట్లాడుతున్నాడు! పాల్ వైపు కొద్దిగా ముందుకువంగి, భుజంమీద చెయ్యివేసి, యీవిధంగా అన్నాడు.

"పాల్, అట్లా అంటున్నావేమిటి? నువ్వు పిరికివాడవు కాదని అందరూ ఎరుగుదురు కాని, నువ్వింకా యీ మే దినోత్సవం రోజున యేమి జరిగిందో, గ్రహించలేదు. ఈ వీధిలో వున్న మనతోటే కాదు, పట్టణంలోవున్న ప్రతివారి తోటీ పోలీసు లీవిధముగానే వ్యవహరిస్తున్నారు. ఏమనుకుంటున్నావు చెప్పు, పాల్, ఇప్పుడు న్యూకోన్‌లో ఏం జరుగుతోంది? వాళ్లెందుకు చేస్తున్నారు, ఆవిధంగా తక్కిన రోజుల్లో కాకుండా, ఈ మే దినోత్సవంరోజునే, వాళ్లు ఊరేగింపుల్ని ఎందుకు నిషేధించారు? ఎందుచేత సోషల్ డెమాక్రాట్ నాయకులు వాళ్ల పోలీసుప్రెశిడెంటుతో కలిసి పోలీసుల్ని కార్మికులను కాల్చండి అని ఉసిగొల్పుతున్నారు?"

కర్టు, ఇప్పుడు పాల్‌తో బిగ్గరగా చెబుతున్నాడు, ఆతని భుజాల్ని తనగుప్పిళ్లతో పట్టుకున్నాడు. "ఎందుకంటావ్, పాల్? మన కమ్యూనిస్టులే ఈనాడు విప్లవకార్మికుల నాయకులు కనుక! అర్థం చేసుకోలేదూ, పాల్? ఈరోజున మన్ని అణచివేద్దామని వాళ్లు చూస్తున్నారు. ఈదెబ్బతో ప్రజలు మనదగ్గరకు జేరకుండా మన్ని సైన్యాలులేని సేనానాయకుల్లాగు ఏకాకులుగా చేశెయ్యాలని వారి ఉద్దేశ్యం! స్త్రీలను, పిల్లలను వారు బాదుతూన్నంతసేపూ, కమ్యూనిస్టు పార్టీనే మనస్సులో వుంచుకున్నారు. ప్రజలను, ఉపవాసాల

ప్రభుత్వానికి వ్యతిరేకంగా రెచ్చగొట్టుతున్నామనే నెపం మీద, కమ్యూనిస్టులుల్ని నాశనం చెయ్యాలని, రీచ్ స్వేరు, పోలీసులు, సోషల్ ఫాసిస్టులు ప్రయత్నిస్తున్నారు."

హఠాత్తుగా, అతని కొక ఆలోచన తట్టింది. ఉద్రేకంతో, జేబులు తడిమి, అచ్చుకాగితాలను తీశాడు. నలిగిన కాగితపు ముక్కను సాఫ్ చేసి, బల్లమీద పెట్టేడు. ఆ కాగితం మీద "లెనిన్: మే దినోత్సవం!" అనే వ్యాసాన్ని చూపించాడు. ఆపత్రిక ఆరోజున్న వెలువడిన రోట్‌ఫానీ.

ఉదయం కర్టు ఆవ్యాసాన్ని చదివినప్పుడు ఎడంచేతి వైపున కొన్ని భాగాలు పెన్సిలుతో గీటుపెట్టి వుంచాడు. ఆగి, ఆగి చదివి వినిపించాడు. "నిరంకుశ ప్రభుత్వాలకు వ్యతిరేకంగా, సాయుధ తిరుగుబాటు, కేవలమూ విప్లవవాదుల కార్యక్రమ పట్టికల్లోనూ, బుర్రల్లోనూ భావనామాత్రంగానే అభివృద్ధి చెందడంలేదు. సహజంగానూ, ఆచరణీయంగానూ, ఉద్యమంయొక్క తప్పని సరియైన తరువాతి మెట్టుగాను పరిణమిస్తుందని యిట్టి సంఘటనలు చూపుతున్నాయి. ప్రజా సమూహాలయొక్క వృద్ధి పొందుతూన్న కోప, అనుభవ, ధైర్యాల ఫలితమే సాయుధ తిరుగుబాటు." ప్రతిమాటను ఒత్తుతూ, బల్లమీద వ్రేలితో కొడుతూ ఆవాక్యాన్ని నొక్కి చదివాడు.

"అది ఎవరు వ్రాశారు పాల్? 1902 లో రాజకీయ ప్రజాసామాన్యపు సమ్మె జరిగినప్పుడు, దానిని వ్యాఖ్యానం చేస్తూ కామ్రేడ్ లెనిన్ కార్మికుల కొరకు వ్రాశాడు. ఇప్పుడైనా అర్థం చేసుకున్నావా, పాల్? విప్లవం, స్టాలిన్ చెప్పినట్టుగా నేనిక్కడ ఒకమాటు నొక్కితే జర్మనీలో ఒకతిరుగుబాటు జరుగదు. కాని అది క్రమంగా ప్రతీకార్యంతోను, ప్రతీ ఆర్థిక పోరాటంతోనూ, ప్రజాబాహుళ్య రాజకీయ సమ్మెతోను జరగాలి—మే దినోత్సవం అంటే అదే! అదొక శలవు దినం కాదు, పాల్! లాకీల్తో మోదబడుతూన్నా రివాల్వర్లతో కాల్చబడుతూన్నా వాళ్లెందుకు ఇళ్లల్లో కిమ్మన్నాస్తిగా కూర్చో కూడదు?" తన ముందున్న కాగితంమీద గ్రుద్దాడు.

"విపరీతంగా వృద్ధి ఔతున్న ప్రజలకోపం! పార్టీకి చెందిన మనం, ఇది గ్రహించకపోతే మనం వారికి వెనక్కాల పడతాం. కార్మికులు మన యందుంచిన విశ్వాసాన్ని కోలుపోతాం కాని, మనం నాయకులం.. మనం ఎల్లప్పుడూ, వారి ముందుండాలి" ఇంత వరకూ చెప్పిందంతా ఒక్కవాక్యంలో గుదిగ్రుచ్చ దలచుకొన్నట్లు కొనసాగించాడు. "ఆత్మసంరక్షణ —పాల్—సాయుధ తిరుగుబాటు కాదు!—కాని, ఆత్మ రక్షణను వదలి, దాడివెడల గలిగేటంత శక్తి వచ్చేవరకూ, యీఒక్కమార్గంలోనే బలాన్ని సంపాదిద్దాం."

తన దీర్ఘోపన్యాసానంతరం, కర్టు మౌనంగా కిటికీలోంచి అవతలికి చూస్తున్నాడు. పాల్ ఇంకా తనముందు ఉన్న పత్రి కవంక చూస్తూనే వున్నాడు. ఆ వ్యాసాగ్రభాగాన్ని, 'లెనిన్!' అనే మూడు పెద్దఅక్షరాలు అలంకరించాయి. వీధిలో కార్మికులు చావ మోదబడడం, రివాల్వర్లను పేలుస్తూన్న పోలీసులు, ఎర్ర జండాలను క్రింద పడ వెయ్యడం, చీకటిమార్గంలో కడుపు బ్రద్దలై చచ్చిపోయి పడివున్న హైడక్‌ను, ఆతడు చూచాడు. శ్రామికుల చేతుల్లో రాళ్లుండటం చూచాడు.

పాల్ ప్రాత సోషల్ డెమాక్రాటుల అభిప్రాయ వాతావరణంలో మసలిన వాడు. ఆతని అభిప్రాయాలు, ఆలోచనలు అలవాటు పడిన ఆందోళన పోరాటపు పద్ధతుల హద్దుల్లోనే ఇమిడి వున్నాయి. ఆపద్ధతులు కాలానుగుణ్యంగా లేవనీ, ఇప్పటి నూత్నపరిస్థితులు నూత్న యెత్తుగడల అవసరాన్ని చూపిస్తున్నాయని ఆతడు తెలిసికో గలిగేడు. బాగా తీక్షణంగా వున్న దోపిడి విధానం, ప్రస్తుత పెట్టుబడిదారీ విధానం, వెరుకటి వారికంటె ఇప్పటి యువకుల్లో వర్గచైతన్యాన్ని బాగా కలిగించాయి. బహుశా, కర్టు చెప్పిందంతా నిజమై ఉండవచ్చును. అందరికీ అర్థమయ్యే భాషలో ఆపత్రికలో అచ్చువెయ్యబడి వుంది. అంతే కాకుండా—లెనిన్ చెప్పివున్నాడు!

ఆతడు లేచి, కర్టుతో వీధిలోకి శాంతంగా వెళ్లాడు...

# ఆన్నా

బూాలస్వరంతో ప్రకటన బల్ల వీధి కడ్డంగా పడింది. పాంక్ట్రాసీలో బాగుచేతపనులకు తెప్పించిన బరువైన పెద్ద ఇనుప పైపులు వీధికడ్డంగా దొర్లించి వేయబడ్డాయి. ఇనుప కమ్మీలు, బల్లలు చప్పుడుచేస్తూ నేలమీద పడుతున్నాయి.

"చూడండి!—వెదకండి, కామ్రేడ్స్!"

ఫెళ ఫెళ—బరువైన పెద్ద బండి, వీధి ప్రవేశం దగ్గర సోమరిపోతులాగు చక్రాలు గాలిలో కదలుతూండగా పడి వుంది. దీపస్తంభాలు వీధిలో పడుతూంటే గాజుబుడ్లు టప టప మంటున్నాయి. ఈపనులన్నిటినీ వందలకొద్ది మోటచేతులు చేస్తున్నాయి. సున్నాపుబస్తాలు చెల్లా చెదరుగా పడవేయబడుతున్నాయి. ఇసుక గుట్టలను, స్త్రీలు సరిగా దిబ్బవలె పోస్తున్నారు. దూరాన్నున్న ఒక వీధినుండి రివాల్వరు గుండ్ల దెబ్బలు వినపడుతున్నాయి. ఆధ్వని వీరు చేసేపనిని మరి కొంచెం వేగిర పరచింది.

"రెడ్ నైటింగేల్" బయట వంకర టింకరగా వున్న త్రిభుజాకారంలో అడ్డుగోడలు లేచాయి. వెడ్డింగ్ స్ట్రాసీ, వీధి, పాంక్ స్ట్రాసీ ప్రదేశములకు అడ్డుగా గోడలను కట్టివేశారు.

చాలా రోజులనుండి ఒక దొడ్లో, చిరిగిన ప్రాతచాప పడివుంది. ఇద్దరు స్త్రీలు దానిని మోసుకుపోయి ఆ అడ్డు గోడల మీద పడవేశారు. ఇసుక, ఇనుపకమ్మీల గుట్టల మధ్య కార్మికులు ప్రాకుతున్నారు. వీధి కట్టడాలనుండి ఇటుకల నూడపీకి పేర్చడంలో స్త్రీలు సహాయం చేస్తున్నారు.

"జప్, మంచాలుకూడా తీసుకు రాగేం, మీరు?" ఒక యువతి వారిని అడిగింది.

"నీమంచం తీసికొని వస్తే, దాన్నున్ననల్లులు యీ అడ్డుగోడనే యీడ్చుకు పోతాయి."

"అట్లా చెప్పకు. నామంచం చాలా మంచిది. పోలీసులచేత కాకపోయినా అనేక బొప్పిలు కట్టున్నాయి దానికి!"

వారు నవ్వుకుని వారి పనిని చూచి చప్పట్లు చరిచారు. దేవదారుపెట్టెలు, కర్రలు, బల్లలు, ప్రాతబుట్టలు, వారి చేతులు దేనిమీద పడితే అదల్లా యీ అడ్డుగోడ మీదకు దూకిందన్నమాటే! నడుంవంగిన ఒక ముసలమ్మ వీధివెంట తిరుగుతూ రాళ్ళు ఒళ్ళో పోసుకొచ్చి అడ్డుగోడను బలపరుస్తూంది.

రివాల్వరు కాల్పులు సమీపిస్తున్నాయి. పోలీసులను ఎంతదూరంలో ఉంచగలిగితే అంతదూరంలోను ఉంచేందుకు థామస్ కొందరు కార్మికయువకుల్ని పంపాడు. ముందున్నంత శాంతంగా లేదు. ఇద్దరు ముగ్గురి జేబుల్లోనుంచి పిస్తోళ్లు లాక్కోవలసి వచ్చింది. వారు నిర్మించిన అడ్డుగోడలు పోలీసులు చొరుచుకొని రాకుండా మాత్రమే అని వారికి నచ్చచెప్పేందుకు కూడా సమయం లేదు. పోలీసుల మారణయంత్రాల నుండి తప్పించుకునేందుకు యీ అడ్డుగోడలు చాలకాలం రక్షణ సాధనంగా వుండజాలవు. అందులోను ముఖ్యంగా వీధి పోరాటంలో వారి పైనబడి పోరాడేందుకు అసలే ఆధారభూతంగా వుండవు.

"హల్లో........థామస్!"

"థామస్ ఎక్కడున్నాడు?"

థామస్ వారి వైపు తిరిగాడు. అడ్డుగోడమీద నిలబడ్డ కార్మికులు అతనిని కేక వేస్తున్నారు. వేగంగా వారివద్దకు వెళ్ళాడు. అవతలప్రక్క ఒక సైకిలుమీద వచ్చిన వార్తాహారుడు నిలబడి వున్నాడు. థామస్‌ను చూచిన తక్షణమే, సైకిల్ వదిలేశి, అతని దగ్గరకు పరిగెత్తాడు. అతని లేత ముఖము చెమటతో తడిసి పోయింది.

"థామస్! రెండు కార్లు, ఒక మరఫిరంగికారు, వెడ్డింగ్ స్టేషనునుంచి వస్తున్నాయి!"

అతను పూర్తిచేసేవరకూకూడ థామస్ ఆగలేదు. కార్మికుల వైపు తిరిగాడు. "కామ్రేడ్స్! తక్షణమే ఇళ్ళల్లోకి వెళ్ళిపోండి. తలుపులు తాళాలు వేసెయ్యండి. ఎవ్వరు కాల్చ కూడదు. వీధిని పరీక్షిస్తూండండి. వీధిలో ఒక్క పురుగు కూడా వుండ కూడదు. ఖాళీ చేసెయ్యండి. కొద్దిమంది యువకులు వీధిలో అరుస్తూ పరిగెత్తారు.

"అందరు ఇళ్ళల్లోకి వెళ్ళిపోండి! తలుపులు తాళాలు వేశేయండి!"

చెవులు గింగుర్లెత్తించే పోలీసు కార్ల పెద్దచప్పుడు ఇప్పుడు నెట్టిల్ బెక్ప్లాజ్ నుంచి వినవస్తూన్నది. వీధికి బారు చేసివున్న రివాల్వరు నల్లనీడవలె అపాయం మళ్ళీ హఠాత్తుగా తిరిగి వచ్చింది......

మెత్తటి అందమైన కేశములున్న ఒక యువతి, నీటి కుళ్ళాయి దగ్గర బురదలో ఆడుకుంటూన్న ఇద్దరు పిల్లల్ని రెక్కలట్టుకు ఇంట్లోకి బర బరా లాక్కు పోయింది.

6 వ నెంబరుకు చెందిన పిల్లల్నందరినీ ప్రోగుచేసు కొచ్చి అన్నా, రెండో అంతస్థుమీదవున్న ఒక సురక్షితమైన గదిలో వుంచింది. ఆవిడకు కనబడిన పిల్లల్నందరినీ ప్రోగుజేసు కొస్తోంది. "రా! త్వరగా రా; కుర్రవెధవా," హెర్మన్ పన్నెండేళ్ళ కుర్రాణ్ణి కేక వేసింది అన్నా.

"రాను. అన్నా, వెనక గదులు నాకు తగిన చోటు కాదు."అని ఆక్రుర్రాడు నవ్వుతూ సమాధానంచెప్పి రాళ్ళతో నిండివున్న జేబును గల గల లాడించాడు. పురుషులతో కలసి "రెడ్ నైటింగేల్" కు పరుగెత్తాడు.

అన్ని తలుపులు తాళాలు వెయ్యబడకుండానే శర వేగంతో మొదటి పోలీసు కారు మలుపువద్దకు వచ్చింది బరువైన ఆలారీని వెనక్కి లాగేటప్పటికి బ్రేకులు కీచుమన్నాయి. కారు ముందు ఒక గజందూరంలో నిశ్శబ్దమైన బెదరింపు— ఒక అడ్డుగోడ నిలబడివుంది! వెనుకవున్నవీధి నిర్మానుష్యంగా వుంది. కిటికీల నుండి వెనుకటికిమల్లేనే ఎర్రజెండాలు మాత్రం గాలితో ఆడుకుంటున్నాయి.

అక్కడ శ్మశాన నిశ్శబ్దత అలముకొని వుంది. మోటారుమాత్రం బర్రు బర్రు మని గోల చేస్తోంది. దాకున్న స్థలాల్లోంచి కారులో తెల్లమచ్చల్లాగ వున్న పోలీసుల ముఖాల్ని పరీక్షించి చూస్తున్నారు. కార్మికులు తక్కిన కారు కూడా వచ్చి మొదటిదానివెనుక నే ఆగింది. అనిశ్చితంగా తటపటాయిస్తూ దిక్కు తెన్ను తోచక భయ విభ్రాంతులై వేచి వున్నారు.

డ్రైవర్ స్థానానికి ముందున్న అద్దంగుండా మేజర్ బీల్ చూపులు, చప్పుడులేని నిర్మానుష్యమైన వీధిలోకి అడ్డుగోడమీదుగా తిరుగుతున్నాయి. తన ముందుగా అడ్డగోడ

వల్ల తమ మార్గం అడ్డగింప బడిందని అతని బుర్ర గ్రహించే లోగా కొన్ని నిమిషాలు గడచిపోయాయి. ఆఅడ్డుగోడ వెన కాల ఏముంది?

ఆ అధికారి చెతిమేజోళ్లలోని చేతులు చెమటతో తడిసి పోయాయి. ఆ వీధిలోని ముఠా ఎప్పటికి మల్లేనే రణ గొణధ్వని ఎందుకు చెయ్యడంలేదు?

"వెధవచెత్త — చాలా మంచి గూఢచారులు!" కారులోంచి క్రిందికి దూకాడు.

"వల్నర్"

"అయ్యా"

"నేను రాయబారం నడుపు తూంటాను. నేను ఈల వేసినప్పుడు గాని, మొదటి పిస్తోలు దెబ్బకు గాని మీరు అడ్డుగోడను ఒక్కపెట్టుగా పేల్చి వెయ్యండి"

"తప్పకుండా అట్టాగే చేస్తామండి"

"చూస్తూవుండు, వల్నర్, నేను వెడుతూన్న వైపుకి"

అతడు తిరిగి అడ్డుగోడవైపుకు వెళ్లాడు. వివర్ణమైన అతని ముఖంమీద శిలీస్త్రీ కాపు నన్నటి తోలుపటకా ఒక నల్లటి గీతలావుంది. చేత్తో ఒక తెల్లటి జేబురుమాలును ఎగుర వేస్తూ నడుస్తున్నాడు.

బయటకు కనబడని పందలకొలదికళ్లు, అడ్డుగోడల బయట సాక్షాత్కరించిన యీతెల్ల చుక్క మీద నిలబడి వున్నాయి.

ఒకరివల్ల లొంగి పోవడమా?

"రెడ్ నైటింగేల్" తరువాత వున్న తలుపు తెరుచుకుని థామస్ బయటకు వచ్చాడు.

ఒక నిమిషంవరకూ వాళ్లిద్దరు ఒకరి కొకరు ఎదురుగా నిశ్శబ్దంగా నిలబడ్డారు. ఆకష్ట జీవియొక్క గోధుమవర్ణపు జాకెట్టు మీద నలిగిన ఎర్రిజెండా, ఆఉద్యోగస్తుని నీలపు యూనిఫారంమీద వెండి భుజకీర్తులు! ఆ అడ్డుగోడకు ఒక వైపున ఒకరు, మరియొకవైపున మరియొకరు! ఒకరివైపు మరియొకరు చూచుకుంటున్నారు.

"నువ్వేనా నాయకుడవు?" ఆమేజరుయొక్క కఠిన స్వరం మామూలుగా వుండేటంత తృణీకారంగా లేదు. ప్రస్తుతం అతడక్కడ విజయోన్మాదుడుగా నిలబడి లేడు.

"నీకు ఏంకావాలి?" ఆ అడ్డుగోడవైపుకు మరియొక అడుగువేశాడు మేజరు.

"ఆగు! ఉన్నచోటనే నిలబడు." థామస్ తీవ్రంగా కఠినస్వరంతో చెప్పాడు. ఆ ఉద్యోగస్తుడు అడ్డుగోడ బలం చూడటానికి వచ్చాడని థామస్ గ్రహించాడు. తక్షణమే మేజరు ఆగాడు.

"మీరు యీఅడ్డుగోడల్ని తీసిపారేసే టట్లయితే ఆ సమయంలో మిమ్మల్ని, మామనుష్యుల్ని ఇక్కడ నుంచి వెళ్ళిపొమ్మని ఆజ్ఞాపిస్తాను."

"తరువాత వచ్చి వీధి నంతా చుట్టుముట్టేందుకే కాదూ? మేజర్?" థామస్ వేళాకోళంగా సమాధాన మిచ్చాడు. "వెడ్డింగ్ నుంచి పూర్తిగా ఒక్క పోలీసువాడు కూడా మిగులకుండా వెళ్ళిపోయి మేము మీ ఎవ్వరి ఆటంకం లేకుండా ఊరేగింపు చేసుకోవచ్చుననే హామీ యిచ్చేటంత వరకూ యీ అడ్డుగోడలు ఇల్లాగే వుంటాయి!"

"బ్రేవో!" — మేజరు ఉలిక్కి పడ్డాడు — ఒక స్త్రీ కంఠస్వరం. అతడు మళ్ళీ థామస్ వైపుకు తిరిగి ఊపిరి బిగబెట్టి అన్నాడు'

"మా ఆటంకం ఏమీ లేకుండా ఇదంతా తీసిపారవేయ వచ్చునని నేను హామీ ఇస్తున్నాను"

"మన షరతులు నేనప్పుడే చెప్పాను. మేజర్!" రెడ్ నైటింగేలు ప్రక్కనున్న తలుపు దఢాలున మూసుకుంది. మేజరు ఒక్కడే అడ్డుగోడ ముందు నిలబడి వున్నాడు.

అతని ప్రతి అడుగు, పని,కూడా అసహ్యాభావాల్ని వెలిగ్రక్కుతూన్న తీక్షణమైన వందలకొలది కళ్ళు పరీక్షించి చూస్తున్నాయి అని అతడు భావించాడు. ఇప్పుడు వారే

పరాజితులని అతడెరుగును. బడిపిల్లకాయవలె చూడ బడ్డా డిప్పుడు. పరమ అసహ్యాభావంతో తృణీకారసూచకంగా ఆ యువతి ఇప్పుడే కిటికీలోంచి తన వంక చూసింది. అతడు రివాల్వరు తీసి మెదడు ఊడగొడతాడనే భయంకూడా లేకుండా పరిహసించింది. అతడు కార్ల దగ్గరకు మళ్లాడు.

"నడవండి!—స్టేషను దగ్గరకి!"

ఆసమయంలో వీధిలో వున్న నిశ్శబ్దత చప్పట్లతో వీ, బూ! బూ! లతోనూ భంగపరుప బడింది. కిటికీతలుపులు తెరవబడ్డాయి.

"నరకానికి పొండి—వేట కుక్కల్లారా!"

"పిరికి పందలోయ్!"

"రెడ్ ఫ్రంట్!"

అసహ్యాభావంతో నిండిన అరుపులు, నవ్వులతో ఆ వీధి బ్రద్దలై పోతూంది. బాంబు, ధ్వనిలాగు, ఆచప్పట్లు నవ్వులు గాలిని చీల్చుకుని పోలీసుల అవనిత వదనాలపై నుండి ప్రతిధ్వనించాయి.

రోషావేశంతో పెనుబొబ్బలు పెడుతూన్న శక్తిహీన మైన ఆమోటారుకార్ల ధ్వని అంతకంతకు మందగించింది. వారువెళ్ళిపోయారు—ఓడిపోయారు. ఒక పిస్తోలూ ప్రేలలేదు. ఒకరాయీ విసరబడలేదు. అతిత్వొందరతో వేయబడిన ఒకే ఒక అడ్డుగోడ వారిని కలవర పెట్టేందుకు, భయవిహ్వాలులను

చేసేందుకు సరిపోయింది. ప్రతిఘటించేందుకు వారు సిద్ధపడలేదు.

కొద్ది నిమిషాల తరువాత వీధి మళ్ళీ అడ్డుగోడను అతి వేగంగా బలపరుస్తూన్న ప్రజలతో నిండి వుంది. పోలీసులు కొద్ది సేపట్లో సాయుధహస్తులైన సైన్యాలతో వచ్చి చుట్టుముట్టుతారని ప్రతివారు అనుకుంటున్నారు. ఎవరికీ ఈవిషయమై సందేహం లేదు. అదే సమయంలో ప్రతివాళ్ళూ యీ రెడ్‌స్ట్రీట్ పోలీసుల్ని జయించిందని అనుకుంటున్నారు.

‡ ‡ ‡ ‡ ‡

మెల్లిగా సాయంకాలపు చీకట్లు పడుతున్నాయి. పిల్లలకు చాపలు, దుప్పట్లు పరిచి పక్కలు వేస్తోంది అన్నా. హెర్మన్ రెండవ కూతురు ఒకమూలజేరి తన పిల్లి బొమ్మని జోకొడుతూంది.

అన్నా చిన్నపిల్లలందరిని ఒకరి ప్రక్కను మరిఒకరు చొప్పున పడుకోబెట్టి జోకొడుతోంది. ఏడుపులతోటి, ఆటలతోటి వారంతా అలసి పోయారు. ఎదురుగుండా వున్న ఇంటి పిల్ల తలచుట్టూ ఒక తెల్లటిగుడ్డతో గాయానికి కట్టుకట్టుకుంది. మధ్యాహ్నం పోలీసులు ఇండ్లలో చొరబడి పిస్తోళ్ళు పేలుస్తూన్నప్పుడు ఒకబెల్లు ఎగిరి వొచ్చి ఆ అమ్మాయి నుదురును గాయపరిచింది.

అన్నా, కిటికీ తలుపు తెరచి మెల్లగా నిశ్శబ్దంగా ప్రవహిస్తూన్న పాంకేజలావైపు చూస్తూ నిలబడింది. రెండు వైపులా వున్న ఎత్తైన ఇళ్ళు వీధిలో నిరోరడు పారచేస్తున్నాయి. కాలవ రెండు ప్రక్కల అక్కడక్కడ వున్న డొంకలు పచ్చటి ఆకులు తొడిగి లేతమొగ్గలతో నిండి వున్నాయి. వసంత ఋతువు యీ యెత్తు గోడలమధ్యకు చాల ఆలస్యంగా వచ్చింది. ఇక్కడ మానవుడూ, ప్రకృతీ కూడా ఒకే విధంగా చెత్త, దుమ్ములతో తమ మనుగడకోసం పోట్లాడవలసి వస్తోంది.

ఆమె వెచ్చటి ముఖం మీద సాయంకాలపు మంద వాయువు వీచింది. అప్పుడే మే నెల వచ్చేసింది. పట్టణ పరిసర ప్రాంతాల్లో అప్పుడే వేసవికాలం వచ్చేస్తుంది. అలసటతో ఆమె తన శిరస్సును కిటికీ అంచుమీద ఆన్చింది. చల్లటి మందపవనం ఆమె ఫాలతలాన్ని, మెడను, చేతుల్ని తాకుతూంది. బయటనున్న ఇసుకలో ఊరపిచ్చుకలు గంతులు వేస్తున్నాయి.

కొద్ది నిమిషాల క్రితం, కోల్బెర్గర్ స్ట్రాసీలో రైల్వే బ్రిడ్జివద్ద ఫ్రోబియస్ అనే దుకాణదారుడు నోట్లో కాల్చబడి చంపబడ్డాడని ఏడుగంటలు దాటిన తరువాత వీధిలో ఉన్న వాళ్లందరికీ తెలిసింది. ఒక కాఫీహోటల్లోకి పారిపోదామని

ప్రయత్నిస్తూన్న, యుద్ధంలో వికలాంగుడైన రీన్‌టాక్‌ను పోలీసులు పిస్తోలుతో కాల్చి చంపేశారు. వీధిలో రక్తంకక్కు కునిమరీ చనిపోయాడు రీన్‌టాక్. సహాయం చేద్దామని ప్రయత్నించిన ప్రతివారిమీద పోలీసులు కాల్చారు. పదిహేనేళ్ల వయసు ఐన ఎర్నాజీక్ మోకాల్లో పిస్తోలు గుళ్లు దూరాయి. వార్త తరువాత వార్తగా అనేక దారుణవార్తలు "రెడ్ నైటింగేల్" లో తెలుస్తున్నాయి – చనిపోయిన, క్షతగాత్రులైన, నిర్దయగాచావ మోదబడిన, అరెస్టు చేయబడిన, పురుషులు, స్త్రీలు, బాలురు! ప్రతికొత్తవార్తకూడ, ఎన్నికష్టాలు పొందినప్పటికీ స్త్రీలను పిల్లలను కాపాడేందుకు గాను వీధిని రక్షించితీరాలనే స్థిరసంకల్పాన్ని బాగా దృఢపరుస్తూన్నది. వ్యక్తిగతంగా వారే రాజకీయ భావాలను కలిగి వున్నాసరే ఏరాజకీయ కక్షికి చెంది నాసరే, వారు లెఖలోకి తీసికోవడం లేదు. పోలీసు ప్రెశిడెంటు కనపడిన ప్రతి కార్మికుడ్ని లాఠీలు రివాల్వర్లు ప్రయోగించ వలసిన చిహ్నాలుగా యెంచ వలసినదని పోలీసుల కాజ్ఞాపించాడు. 6 వ నెంబరు గదిలో నున్న సోషల్ డెమాక్రాట్ హైనెక్ మీదకు వారు రివాల్వరు గుండ్లను వదిలారు.

"ఈవీధికంతా శిక్షార్థమే యీదాడి పోలీసువాళ్లు చేస్తూన్నారు" అన్నాడు. వృద్ధ హబ్నర్ అడ్డుగోడను నిర్మించడానికి తోడ్పడ్డ వారిలో ప్రథములో అతడొకడు.

నికెల్ కళ్ల జోళ్లను పైకెత్తుతూ ఒకడు అన్నాడు. "ఈవీధి ఎర్రివెడ్డింగ్‌కు హృదయంలాంటిదని వారికి తెలుసును"

'హల్లో!......కామ్రేడ్ స్పీకర్! అని అరచి కర్రపాలిపోయిన ఆయువక కామ్రేడ్ భుజం తట్టాడు,

"నువ్వు రావడం చాలా బాగుంది".

తక్కిన వారు కూడ అతనిని పలకరించారు. వీరంతా యీ అపాయ కరమైన స్థితిలో తన్ను సందేహిస్తూ చూడకుండా వాళ్లలో ఒకని క్రిందే చూస్తున్నందుకు ఆయువకుడు చాలా సంతోషించాడు. "రెడ్ నైటింగేల్" లో వీధి సంఘంలో తానుపన్యసించి నప్పుడు ఉన్న ఏకొద్దమందికో తప్ప తాను మిగతా వాళ్లకి అపరిచితుడు.

ఒక పావుగంట తరువాత అనేకమంది వార్తాహారులు, పోలీసులు ఆపేటనంతా చుట్టముట్టుతున్నారని చెప్పారు. పోలీసులు నెటిల్‌బెక్‌ప్లాజ్ వద్ద ఒక పదిహేనేళ్ళ కూలీ కుర్రి వార్తాహారుణ్ణి సైకిల్ మీద వస్తూండగా కాల్చారు వీపు మీద చాలా పెద్దగాయం తగిలింది. అతడు కదలలేకుండా పడిపోయాడు.

చీకటిపడుతోంది. రీనెక్కెండార్ఫరుస్ట్రాసీలోని దుకాణదారులందరూ దుకాణాల గవాక్షాలను ఇనుప రేకులతో కప్పారు. గుడిసెల్లోని కర్రి మరతలుపులన్నీ మూసివేయ బడి

నాయి. చుట్టుపక్కల వీధులన్నీ మళ్ళీమళ్ళీ ఊరేగింపు చేస్తూన్న కార్మికులు, నగరమధ్యంవరకు వెళుతున్నారు. దూరప్రదేశంలో గుండ్లు పేల్తున్నాయి.

వీసెన్స్ట్రాసీ మలుపులో గుండ్ల మ్రోతలు ఆరంభమైనాయి. వీధిలో ఉన్న దీపాలన్నిటిని బద్దలుకొట్టి ఆర్పి వేస్తున్నారు. గ్యాసుకడ్డీ పైన ముక్కలైన చిమ్నీ మధ్య ఒక చిన్న నీలపుమంట మండుతూన్నది. ప్రాగరకపు యెత్తుతక్కువ దీపస్తంభాలమీదకు కుర్రాళ్లు యెగబ్రాకి గ్యాసును త్రిప్పి వేశారు. అంధకార చక్రం అడ్డుగోడలను దాటి దూరదూరంగా విస్తరించింది. పెద్ద కీసీడలు మాత్రమే వింతవింత స్వరూపాలతో మినుకుమినుకు మంటూన్న తారకలకాంతిలో కనపడుతున్నాయి.

ఎనిమిది గంటలైంది. బరువైన పోలీసు కార్లు దొర్లుకొస్తున్నాయి. రివాల్వర్లు పిస్తోళ్లు పేలుతూన్న ధ్వని వినపడుతూన్నది. ఉద్రేకపూరితమైన చప్పట్లు వీధిలో మ్రోగుతున్నాయి తలుపులు ధడాలున మూయబడ్డాయి. కిటికీలలో వున్న దీపాలు ఆరిపోయాయి.

అడ్డుగోడల వెనుక నిర్జనమైన వీధి అలికిడిలేకుండా నిశ్శబ్దంగా వుంది.

పాంక్ స్టాసీ మళుపులో నుంచి ఒక పెద్దదీపపుకాంతి నిర్జనంగావున్న ఆస్థలాన్ని అంతనీ ముంచేత్తింది ఆవెల్తురు ఆవీధిలో వున్న ఇండ్లమీద గోడలపైకి నెమ్మదిగా ప్రాకనారంభించింది.

నక్షత్రాల మిలమిలలేని ఆరాత్రి అంధకారంలో దాక్కున మేడలను మిద్దెలను ఆతెల్లటి కఠినమైన వెల్తురు గోడలమీదకు, పైకప్పులమీదకు, వనమార్గంలో వున్న చీకటిని మింగుతూ వెళ్లింది. అటుపైని, ఆకాంతివెల్లువ వెడల్పాటి, ఎత్తైన ఆ అడ్డు గోడమీదకు ప్రసరింప బడింది. దాని వెనుకనే శత్రువులున్నారు.

కఠినమైన ఆజ్ఞ ఖరుసైన ఇనుపయీటెవలె చొరుచుకు వచ్చింది. వందలకొలది పోలీసులు క్రిందకు దూకి రివాల్వర్లను పేల్చారు. బ్రహ్మాండమైన ధ్వని గోడలకు తాకి ప్రతిధ్వనించి వెడ్డింగ్‌లో వున్న అన్ని వీధుల్లోకి దొర్లుకు పోయింది.

వేట ఆరంభమైంది. తెంపు లేకుండా పేల్తున్నాయి బాంబులు. ఒకరాయి రివ్వున వచ్చి సెర్చిలైటును బ్రద్దలు కొట్టింది. ఆదీపం, ఆరుతూ, వెలుగుతూ, చివరకు తనకన్ను మూతపడిపోగా గ్రుడ్డిదైపోయింది. నృత్యంచేస్తూన్న నిప్పుకణాల మాదిరిగా చేతి తుపాకులనోళ్ల నుంచి మంటలు వస్తు

న్నాయి. ఋస్సుమంటూ సీసపుగుళ్లు గోడలకు తాకి పెద్దపెద్ద పెల్లులను క్రిందకు పడగొట్టుతున్నాయి. చెత్త డబ్బాల రేకు లకు గుండ్లు తగిలి పెద్దధ్వని చేస్తున్నాయి.

అకస్మాత్తుగా ఒకస్త్రీ ఆర్తనాదం వినపడింది కాని అది మెడ తెరిపి లేకుండా కాల్చబడుతూన్న రివాల్వర్ల శబ్దం చేత మ్రింగివేయబడింది. ఆసమయాన్నే రెండవ వైపున రీని క్యాండార్ఫర్ స్ట్రాసె నుండి మరియొక సెర్చిలైటు వెలిగింది. చలిస్తూన్న కాంతిరేఖల్లో దుమ్ముమేఘాలు, దట్టంగా అలము కొనిన దుపాకిమందు పొగలు కన్పిపిస్తున్నాయి.

ఒకేసారి పోలీసులు రెండువైపులనుంచీ దాడి సాగి స్తున్నారు. అడ్డుగోడల గుండా యేమిచేస్తున్నదీ తెలియని భయోన్మత్తతలో ఒకరి వైపుమరొకరు, తుపాకులు, ఫిరం గులు కాలుస్తున్నారు.

అడ్డుగోడల త్రిభుజాన్ని చుట్టి, వంగి గబగబా ఒక నల్లటి మానవఛాయ తిరిగివచ్చింది. ఆకస్మికంగా, ఆతడు ఆగి ముందుకు వంగి, రక్తం కక్కుకుంటూ క్రింద పడిపోయాడు. అప్పుడు మళ్లీ నిశ్శబ్దం ఆవరించింది.

ఆఅడ్డు గోడలవద్ద తుపాకి గుండ్ల వర్షంలో ఏకాకిగా ఆతడు పడివున్నాడు. ఈవిషాద దృశ్యాన్ని బ్రిద్దలైన ఒక కిటికీలోనుంచి ఒకడు చూచాడు. ఆతడు కిటికీ నుండి ఇప్పుడు

ఒకచేతి తుపాకితో ఆరుగుండ్లను ఒకదాని వెంబడి మరొకటిగా పోలీసుల మీదికి కాల్చుచున్నాడు. చిన్నమంట వెల్తురు— పెంగ్. ఆవీధినుండి పేల్చబడిన తుపాకి దెబ్బలలో మొట్ట మొదటిది ఇదే!

ఇంత వరకూ ప్రతివానివద్దనుండి తుపాకులు, పిస్తోళ్లు, రివాల్వర్లను లాగుకొనిన థామస్నే ఆకిటికి వెనుక నిలబడి వున్నది. తొట్రుపాటు లేకుండా గురిచూచి కాలుస్తున్నాడు. దాంట్లో ఆరుగుండ్లు వున్నాయి. అవ్వి అయిన తరువాత ప్రక్కగదిలోనికి వెళ్లి మరలగుండ్లను దట్టించి కాలుస్తు న్నాడు. థామస్ వున్న చీకటి గదిలోనికి ఒక కుర్రివాడు పరుగెత్తుకొని వచ్చిన శబ్దం వినపడినప్పుడు మాత్రమే ఒక సారి థామస్ వెనుక్కు తిరిగి చూచాడు కాని మళ్లీ తన పనిలో నిమగ్నుడయ్యాడు.

ఆసమయాన్నే సెర్చిలైటు కాంతి యీగోడమీద ప్రాలి, భయవిహ్వలుడైన ఆకుర్రివాని మీదకు ప్రసరిం చింది. భయోన్మాదంతో కుర్రివాని ముఖం వివర్ణమై పోయింది.

"కాల్చరా.........వెధవా!" థామస్ గద్దించాడు, "ఇట్లా...పేల్చు...చూశావా" పెంగ్......పెంగ్...... పెంగ్. ఆవిరిగిన ఆగవాక్షంలోంచి చేతి తుపాకిని ఖాళీ చేశాడు.

"5 వ గదిలోని ఎమిల్ అక్కడ పడివున్నాడు……
వింటున్నారా? ఇప్పుడు సమయం వచ్చింది…కుర్రాళ్ళూ…
తుపాకులున్న వాళ్ళందరూ ఉపయోగించి తీరాలి……లేక
పోతే ఊరూ పేరూ లేకుండా అందరం నాశనమై పోతాం."
ఒక గుండు థామస్ ముందున్న గోడ అంచుకి తాకి అక్కడ
వుండే మట్టి బెల్లును దొలిచి క్రిందకు పడగొట్టింది. థామస్
చాలగంభీరంగా వెనుకకు తిరిగాడు.

"కర్టు జిమ్నర్‌మన్ ఎక్కడున్నాడు? పాల్ ఎక్క
డున్నాడు?"

"3 వ గదిలో ఉన్నారనుకుంటాను."

"అక్కడకు వెళ్లు–దొడ్డిగోడ ఎక్కి వెళ్లు–అర్థమైందా
తుపాకులున్న వారి నందరినీ ఆపవద్దని చెప్పు."

"ఆంబ్యు…లెన్సు……కారు!"పై అంతస్థు మీద
నున్న ఒక స్త్రీ వెర్రి అరపు అరిచింది.

"తుపాకులున్న వారందరూ కాల్చండి!" థామస్
అరిచాడు. ఆకుర్రాడు గదిలోంచి బయటకు పరిగెత్తాడు.

z z z z z z

పాంక్ స్ట్రాసీలో వున్న పోలీసులు కూడ ముట్టడి వద్దకు
వచ్చారు.

వీధి మీద, గవాక్షాల మీద జోరుగా తుపాకులు కాల్చబడుతున్నాయి. అగ్నివర్షం కురిపిస్తూ పోలీసులు ముందుకు చొరుచుకు పోసాగారు. శిరస్త్రాణాలు నికెల్ బొత్తాములు వీధి ప్రవేశస్థలం వద్ద తళతళ పరిగెత్తుతున్నాయి. ఈ పరిస్థితులన్నిటినీ స్పష్టంగా చూడజాలని అవతల వైపున ఉన్న పోలీసులు తమ పోలీసులమీదే అడ్డుగోడల మీదుగా కాలుస్తున్నారు. చీకటి కిటికీల్లోంచి రాళ్లు రువ్వబడుతున్నాయి. కేకలు వేస్తూ తుపాకులు కాలుస్తూ బాహాబాహీ యుద్ధం చెయ్యడానికి సిద్ధపడి అడ్డుగోడల దగ్గరకు దూకేరు. ఆఅడ్డుగోడ—'ఖాళీ!'

"అమ్మ దొంగముండా కొడుకులు!"

ఒక రాయివచ్చి ఒక తూర్పు ప్రష్యా రైతు యువకుని ముఖాన్ని బ్రద్దలుకొట్టింది. "వెధవల్లారా" అంటూ ఆతడు రక్తాన్ని తుడుచుకుంటున్నాడు. కాన్పించని ఆఎర్ర (కమ్యూనిస్టు) భూతాన్ని పేల్చి పారవేస్తున్నారు ఆయోధులు. గురిమాత్రం కుదుర్తేనా.

కమ్మీలమధ్య, నేలమీద కదలిక లేకుండా చాప చుట్టవలె బిగుసుకు పడిపోయిన మృతదేహాన్ని, ఒకఉద్యోగస్తుని బూటుదొర్లించివేశింది. పొత్తికడుపు మీద నల్లటి పెద్ద మచ్చవుంది.

"ముందుకు నడవండి" అని పోలీసు అధికారి హెచ్చరించాడు "వాళ్లు లోపలఉన్నారు."

"రెడ్ నైటింగేల్" ద్వారం ముక్కముక్కలై కూలి పోయింది. కోల్రి పేటలోని కమ్యూనిస్టుల ఆయువుపట్టు ఇక్కడ వుందని పోలీసులు ఎరుగుదురు

"చేతులు పైకెత్తండి—మీరందరూ, ఇవతలికి రండి!" ఆ చీకటి గది నాలుగు మూలల్నీ మేజరు టార్చిలైటు తుడిచి పెట్టింది. అది—ఖాళీ!

"దొంగముఠా!" ఒకడు వెళ్ళి ఎలక్ట్రిక్ దీపంస్విచ్ నొక్కేడు. మీట టక్ మంటూ క్రింద నుండి పైకి వెళ్ళింది కాని దీపం వెలగలేదు. గోడమీద ఒక వార్తా పత్రిక అంటించ బడివుంది. దానిమీద "1929 పోరాటపు మే దినం!" అని వుంది. ఒక పోలీసు నానాతిట్లు తిట్టి ఆ కాగితాన్ని చించి ముక్కలు చేశివేశాడు. ఒక్క కార్మికుడు కూడా కన పడలేదు.

వెనుక చావడిలోనికి వెళ్లే మార్గం అంధకారమయంగా వుంది. పోలీసుకు "రెడ్ నైటింగేల్" కొత్త కాబట్టి అచ్చటి మార్గాలేమీ వారికి తెలియవు. ఒకమార్గాన్ని మేజరు కనిపెట్టి రివాల్వరుతో కాలుస్తు ముందుకు దారితీశాడు. అమార్గం చివర వున్న తలుపు ఒక్కతాపుతో విడివడింది. దానివెన క్కాల ఒకదీపం వెలుగుతూన్నది. ఆగది ఖాళీగా వున్నట్టు కనపడింది కాని ఒకమూల ఇద్దరుకుర్రాళ్ళు కూర్చుని ఆడుకుం టున్నారు—పేకాట!

ఆగదిలో వారికి దొరికింది తుపాకిగుండ్ల డొలకలు మాత్రమే! పేకాడుతూన్న కుర్రాళ్ళజేబుల్లో కొద్ది బొత్తాములు, ఒకతీగముక్క, సిగరెట్లు, మాసినజేబురుమాలు—ఇవీ వాళ్లకి దొరికినవి. "రోట్ఫ్రంట్ కాంప్ఫెర్ బండ్" (ఎర్ర విప్లవదళం) సభ్యత్వ రికార్డు కాని, కమ్యూనిస్టు, యువజనసమితి సభ్యత్వ రికార్డులు కాని వారికి వ్యతిరేకంగా మరేవిధమైన సాక్ష్యం దొరకలేదు. ఆకుర్రాళ్లిద్దరూ, పోలీసులు గుంజుతూంటే పెదిమలు బిగబట్టి బాధపడుతున్నారు.

నిశ్శబ్దంగావున్న ఆచీకటి సందులో వెళ్లడానికి ఎవ్వరూ సాహసించలేదు. "రెడ్ నైటింగేల్" బయట సెర్చిలైటు వెల్తుర్లో, ఒకకొత్త కటాలం మెడతెరిపి లేకుండా ఫిరంగులు పేల్చి అడ్డు గోడల్ని క్రిందకు పడగొట్టాయి. ఆవీధికి రెండు వైపుల రెండు పోలీసుదళాలు నిలిచి కిటికీలమీద అవ్యాహతంగా కాలుస్తున్నాయి. ఆగోడలలోని నల్లకన్నాలు ఎర్రవీధి భూతం యొక్క అసంఖ్యాకమైన తీక్షణమైన భయంగొల్పే కండ్లు! పూర్వపు భూతాలమల్లే వందలకొద్దీ గాయాలనుండి రక్తం ఓడిపోతూన్నా ఇంకా దుర్భేద్యంగా, లోబడకుండా వుండి, ఇంకాగాలి పీల్చుకుంటూ ఇంకా జీవించేవుంది. ఆహృదయం—వెడ్డింగ్ యొక్క ఆఎర్రహృదయం—మొరుగుతూన్న పోలీసుల రైఫుళ్లకంటె ఎక్కువ బలవత్తరంగా సమ్మెట పెట్టులు పెడుతూనేవున్నది.

పోలీసులు వెనుకుతూ, ఒక ఇనప చెత్తతొట్టిని తొలగింపగా, ఒకచిన్న చెయ్యి క్రిందపడింది అక్కడ వున్న బల్లలు, కమ్మీలు తొలగించి వేసిన తర్వాత పదహారేళ్ళ కూలీ కుర్రవాని ముఖం టార్చిదీపంలో కనపడింది. ఎడమకంటికి పైని నుదురుమీద ఒకనల్లటి గుండ్రని కన్నంపడి, ఆగాయం లోంచి రక్తం ధారగట్టి యిప్పుడు యెండిపోయింది.

ఆ మృతకళేబరం ప్రక్కవున్న ఇసుకలో ఇకరైఫులు, గుండ్లమీదవుండే చిన్న టోపీలు పడివున్నాయి.

పోలీసు టార్చి అక్కడనుండి వెళ్ళిపోయింది.

‡ ‡ ‡ ‡ ‡

ఆఅడ్డుగోడలకోట వశమైంది. కాని వీధిమాత్రం లోబడలేదు. ఎత్తైన ఆఇండ్లమధ్య నున్న చీకటి బాటమాత్రం దుర్భేద్యంగా కనపడుతూన్నది.

రోడ్డుమీదవున్న అడ్డుగోడల మధ్యనుండి చాల కష్టం మీద ఒక త్రోవ యేర్పాటు చేయబడ్డది. పోలీసులు మరలిపోయారు. వారి బూట్ల టక్ టక్ ధ్వానుల స్థానే చెవులు బ్రద్దలయ్యే రణగుణధ్వని, రీనిశ్క్యాండార్ఫల్ ప్రాసీనుండి వినవస్తూన్నది. చాల తేజోవంతమైన ఒకసెర్చిలైటు ఆవీధినంతా పట్టపగల్లాగు చేసింది. ఆక్షణానుంచీ ఒక మరఫిరంగి వర్షం కురిపించడం ఆరంభించింది. అడ్డుగోడల శిధిలాలగుండా, మరఫిరంగి మోటారు వస్తోంది.

వీధిమీదదాడి!

టక్...టక్...టక్ తళతళ మెరుస్తూన్న ఉక్కుపూత పూసిన తెల్లగుండ్లు, శాంతి భద్రతల పాటను యీలవేస్తున్నాయి. పోలీసులలోని ముఖ్యులు, ధైర్యవంతులు, యువకులు, మహాక్రూరులు బారులు తీర్చి దండయాత్ర సాగిస్తున్నారు!

మరల వేట ఆరంభమైంది. ప్రతిగృహం, సందు, దొడ్డి కూడ లోబడాలి. రివాల్వర్లు గురిపెట్టి స్త్రీలను, పిల్లలను, ప్రక్కల మీదనుంచి యీవలకు లాగి, చాపల్ని, పెట్టెల్ని, గదుల్ని వెదుకుతున్నారు. ప్రాణభయంతో పరిగెత్తుతూన్న వారు చావమోదబడి, యీడ్వబడి, అరెస్టు చెయ్యబడ్డారు. కాని పోలీసులకు కావలసిన మనుష్యుల జాడమాత్రం కనుపడలేదు.

"ఇంతవరకూ మీగదుల్లోంచి తుపాకులు ప్రేలాయి."

"ఔను గోడలకేసి చూడండి. మీ తుపాకి గుండ్లే కనపడతాయి."

"నోరుమూసుకో!— ఎక్కడ దాచేరు. ఆకుక్కల్ని మీరు? ఏం......?"

"మీరే వెదుక్కోండి..." స్త్రీలు వెక్కిరిస్తూ సమాధాన మిచ్చారు. పోలీసులు వీధిలోపలికి జొరుచుకొని వెళ్ళ సాహసించలేరని వారెరుగుదురు. అప్పుగోడల దగ్గరనున్న

ఇండ్ల నేలనంతటినీ తవ్వివానసరే, అక్కడ నల్లులు, తమలపాకులు తప్ప మరేమీ కనపడవు. పురుషుడొక్కడూ కాన్పించడు.........

*　*　*　*　*　*

కమ్యూనిస్టు పీధిసభసభ్యులందరూ, వీధిపనులలోనో, సభల్లోనో ఊపిరి పీల్చుకునేందుక్కూడా తీరుబడి లేకుండా పనులలో నిమగ్నులై వున్నారు. న్యూకోన్‌లోని తక్కిన వీధులుకూడా అడ్డుకోటగోడలచేత ఫిరంగి మోటారు కారుల బారినుండి కార్మికులవలన రక్షింప బడుతున్నాయి. కూలీ గూడెముల ముట్టడినుండి పోలీసులను వెనుకకు మళ్లించవలసినదని ప్రెశిడెంటును పార్టీసభ్యులు కోరినకోరిక నిరాకరింపబడిందని పాల్‌కు తెలియును. వీధి మీదదాడి, పోలీసు ఉద్యోగస్థుల బాధ్యతా రహితమైన ప్రవర్తన అంతే కాని, పోలీసు కేంద్రానికి యీవిషయం తెలియదనే సోషల్ డెమాక్రాటులు ప్రతినిధులు ఇంకా నమ్ముతున్నారు.

ఆప్రతినిధులు పోలీసు ప్రెశిడియమ్‌కు పోలీసుల్ని వెనుకకు రప్పించి యీదారుణహత్యలు మాన్పవలసిందని కోరుటకు రాత్రి పది గంటలవేళ ప్రయత్నించారు.

“కోలిన్‌స్ట్రాసీలో ఈక్షణాన్ని యేం జరుగుతోందో నీకు తెలుసునా కలోనల్? సోషలిస్టు వ్యతిరేక చట్టాల కాలం

తరువాత మళ్ళీ యీలాటి కసాయిచర్యలు, నిరాయుధులైన పురవాసులమీద జరుపబడలేవు! బజారుపోరాటాలు యెచ్చటా లేవు. కేవలం పోలీసుల అమానుషవధలుతప్ప! తక్షణం పోలీసు పటాలాల్ని వెనుకకు పిలిపించవలసిందని మేము కోరుతున్నాం.

కలొనల్ హెర్రీజెల్ సమాధాన మిచ్చాడు.

"కమాండర్, హీమాన్సుబర్గుగారు ఒక పావుగంట క్రితం అచ్చటి పరిస్థితులను స్వయంగా పరీక్షించడానికి వెళ్లారు. ఆయన ఆజ్ఞలు లేందే స్వతంత్రించి చేశేందుకు నాకు శక్తి లేదు. ఈవిషయంలో నేనేమీ చెయ్యలేను.

"ఈసందర్భంలో మీరు వెంటనే సేనానాయకునితో సంప్రతించాలి!"

"అట్లాగే చేస్తాను. దయచుంచి యిరవైనిమిషాల తరువాత మళ్ళీ పిలవండి."

ఇరవైనిమిషాలు.........! ఈలోపుగా ఏం జరుగగలదో ఊహించడానికి కూడా భయానకంగా వుంటుంది! ఇంకా ఎంతమంది కాల్చివెయ్యబడతారో ......! పోలీసు ప్రెసిడెంటు, అధికారులకు సంపూర్ణాధికారాలు ఇచ్చాడన్న సంగతి బెర్లిన్ ప్రజల కందరకూ తెలుసును ప్రస్తుతసమయంలో ఏఉద్యోగస్థులూ ఈఅధికారాలను ఉపయోగించకుండా

మానసను. ఇంతకాలానికి, పోలీసుల హృదయస్థవాంఛను సఫ
లం చేసుకో గలుగుచున్నారు! కార్మికులను తరిమారు. నేల
మీద యీడ్చేరు. పిచ్చికుక్కల్ని కాల్చేటట్లు కాల్చారు.
వారి నన్నివిధాలా రెచ్చకొట్టి, వారిచే ఆత్మరక్షణకై రివా
ల్వర్లను కాల్పించారు. ఈహత్యాప్రకాండ జరుగుతోన్నది!
అకస్మాత్తుగా యీక్షణంలో అంతా ఆపివెయ్యడమా? ఎప్ప
టికి జరుగదు! పోలీసు ప్రెసిడియంలోవున్న మేజరుల—కొరకు
ఒక బూర్జువా పత్రికా విలేఖరి టెలిఫోనులో మాట్లాడగా
యీసమాధానం వచ్చింది. "మేజరుగారు రణరంగంమీద
ప్రథమ శ్రేణిలో ఉండి పోరాడు తున్నారు.

ప్రెసిడెంటు గదిలో వేచియున్న పోలీసుఉద్యోగస్తు
లందరూ యుద్ధసమయంలో కలిగివుండే ఆత్రితను, భావాలను
కలిగివున్నారు. దాడెత్తు తున్నామనే భావంతో వారు మత్తు
లై వున్నారు. "అసలు ఏమీ ఆలోచించని" ఉపాధ్యక్షుడు
సెలవుమీద ఉన్నాడు. అయన తనదయాంతఃకరణను కాపా
డుకునేందుకు ఘోరదృశ్యంనుండి పారిపోయాడు......

ఇరవై నిమిషాల తరువాత టెలిఫోనుగంట మ్రోగింది.
"కలోనల్?"

"అయ్యా, కోలిన్ స్ట్రాసేనుండి పోలీసులు వెనుకకు
రప్పింపబడ్డారు. ఆవీధిలో చాలా శాంతంగా వుంది. మీ వలు

కుబడి అంతా వినియోగించి ఇకముందు పోలీసుల నెదురుకో కుండా చూస్తారా?

"కలోనల్, కార్మికులు ఒక్కసారికూడా శాంతిని భంగ పరచి వారంతటవారే పోలీసులను ఎదురుకోలేదు. గతనలభై యేళ్ళనుంచీ 'మే' దినోత్సవం జరుపుకుంటూన్నట్టుగానే వారు యీ రోజునకూడా ఉత్సవం చేసుకునే హక్కును నిలపెట్టు కుందాం అనుకున్నారు. ఈరోజున ఒక్కసారికూడా పోలీసుల మీద శత్రుభావంతో యేచర్యా కార్మికులు చెయ్యలేదు— కాని వారి ఓపికకుకూడా ఒకహద్దుంది."

సో. డె మాక్రాటు ప్రతినిధుల సందేహంకూడా పూర్తిగా నివారణైంది. వీధినుంచి పోలీసులు వెనుకకు రప్పింపబడలేదు. పైగా భీకరంగా కాలుస్తూన్నట్టు టెలిఫోనులో వార్తలు వచ్చాయి. పోలీసులు చెప్పిన వన్నీ పూర్తిగా మోసపుమాటలు!

z z z z z z

అనేకగంటల తరువాతగాని కోలిన్ స్ట్రాసీ న్యూకోలిన్ లోని యుద్ధప్రాంతాలలోని పరిస్థితులు శాంతిపొందలేదు.

---

# ఆ న్నా

తెల్లవారు ఝామున రెండు గంటలవేళ "ఎర్రగది"లో కామ్రేడ్స్ అందరూ సమావేశమయ్యారు. అప్పుడప్పుడు, అక్కడ తుపాకిమ్రోతలు వినపడుతూనే వున్నాయి. పొగ చూరిన ఆగదిలో బాగా అలిసి జిడ్డోడుతూన్న ముఖాల మీద లాంతరు కాంతి ప్రకాశిస్తూన్నది.

దీపంకీసిడలో, మంచంఅంచుమీద కూర్చున్నఅన్నా, మేజాబల్లముందు కూర్చుండి, వ్రాసుకుంటూన్న కర్టును చూస్తూంది.

అప్పు డప్పుడు ఆలోచనతో పైకిచూస్తూ ఒక్కొక్క వాక్యమే మెల్లిగా వంకర టింకరగా వ్రాస్తున్నాడు.

అందరికంటె, ఆఖర్ని పాల్ వచ్చాడు. కమ్యూనిస్టు యువజనసమితికి ప్రతినిధిగా ఆటో వచ్చాడు. విశాలమైన వక్షస్థలం, పొడుగైన దేహం, హాసవదనం, గంభీరహృదయుడు. ఆటో నవ్వుతో కూర్చున్నాడు. పైనున్న ఎలుగుబంటి బొమ్మను నొక్కి, అది పంజాపాదాల్ని పైకి క్రిందికి ఊగుతూంటే, చిరునవ్వులు ఒలికిస్తున్నాడు. పాల్ చాలాకోపంతో,

ఆతని వైపు చూచి ఎలుగుబంటిని ఊవడం ఆపేడు. ఒక చిన్న బల్ల మీద చుట్ట కాల్చుకుంటూ థామస్ కూర్చున్నాడు. ఆతనివెనుక, ముగ్గురు కార్మికులు నిలబడి వున్నారు. వారు ఆ వీధి కమ్యూనిస్టు సంఘసభ్యులు.

కర్టు ఆ నిశ్శబ్దతను భంగపరిచేడు. "కామ్రేడ్స్, నమ్మ కస్తుడైన ఒక వార్తాహరుణ్ణి మనం పంపించాలి. మరణించిన వారి యొక్క క్షతగాత్రులయొక్క చిన్నవివరణపత్రికను తయారు చేశాను...... అది తక్షణమే పంపివేయబడాలి.

థామస్ ముఖం పైకి యెత్తాడు. దీపకాంతి డస్సిన ఆతని ముఖం మీద పడింది.

"ఎంత మంది?"

"ఐదుగురు చచ్చిపోయారు......ఇంతవరకూ...... కాని ఇంకా ఎక్కువ ఉన్నారేమో నాకు తెలియదు. బహుశా మీలో కొందరు ఇంకా కొందర్ని యెరుగుదురేమో!...... నేను ఇట్లా వ్రాసేను.

3. గుండెలమీది కాల్చబడ్డారు (చనిపోయారు)

1. చేతిమీద కాల్చబడ్డాడు (విర్షోఆసుపత్రి)

1. స్త్రీ తలమీద కాల్చబడింది. (చనిపోయింది)

1. శిరస్సు మీద కాల్చబడ్డాడు (చనిపోయాడు)

1. స్త్రీ కడుపుమీద కాల్చబడింది. (విర్షోఆసుపత్రి)

2. కాళ్లమీద కాల్చబడ్డారు (ఇంటివద్ద)
2 చేతిమీద కాల్చబడ్డారు (విగ్గో ఆసుపత్రి)
1. దవడమీద కాల్చబడ్డాడు (విగ్గో ఆసుపత్రి)
1. రెండుకాళ్లమీద కాల్చబడ్డాడు (ఫైర్ స్టేషన్)
1. మడమశీలమీద కాల్చబడ్డాడు (జ్యూయిష్ ఆసుపత్రి
2. మోకాలిమీద కాల్చబడ్డారు (ఇంటివద్ద)

1. స్త్రీ పోలీసు కుక్కలచేత అనేక కాట్లు వెయ్యబడింది. (ఇంటివద్ద) తక్కిన వారిని నే నెరుగను. ఇంకా వున్నారని నానమ్మకం"

కర్ట్ ముఖం బూడిదవర్ణ మైంది. అది చూచి అన్నా భయపడింది. ఇతరులకు ఆజాబితాను. అందిచ్చాడు. కాని ఎవరూ పుచ్చుకోలేదు. దానిని యదార్థవృత్తాంతంగా నమ్మి ఆజాబితాను అందుకు నేందుకు ప్రతివారూ భయపడుతూన్నట్లు కనపడుతోన్నది.

మరఫిరంగుల భీకరసమ్మెట పెట్టులతోటీ ప్రజలకోలాహలంతోటీ, రక్తసిక్తగాత్రులైన ప్రబలహాహాకారాల్తోటీ రైఫుల్ రివాల్వర్ల ఢాంఢాములతోటీ వారిచెవులు ఇంకా గింగుర్లెత్తున్నాయి.

కార్మికులకు అన్నివిధాలా అక్రమంగా హింసించి, కోపం రగుల్కొల్పారు కనుక వాళ్లు కూడా పోరాడి దెబ్బకు

దెబ్బ తీర్చుకోవలసివచ్చింది—అంతేకాని మరేమీకాదు. ఈ భయానకజాబితా దానిఫలితం.

నిగనిగలాడ్తూన్న శిరస్త్రాణాల వెనుకవున్న తెల్లటి, క్రూరముఖాలు, మే దినోత్సవ సంఘటనల రాజకీయముఖంగా వారు అర్థం చేసుకుంటున్నారు.

ఆవీధి యొక్క సంకుచితవాతావరణమును దాటి పరిస్థితులు బాగా అభివృద్ధి చెందాయి. ఏస్వాభావికవర్గబాధ్యత మీద వారీచర్యకు పూనుకున్నారో, ఆభావాలు రాజకీయ చైతన్యాన్ని కోరుతున్నాయి. అన్నిటికంటె ముఖ్యంగా, వారి బుర్రల్లో యీప్రశ్న రేగుతోంది.

ఒక కార్మికుడు లేచి ఆజాబితాను తీసికొని, మాట్లాడకుండా అవతలికి వెళ్ళిపోయాడు.

తన గడియారం వైపు చూచి థామస్ చెప్పాడు. "కామ్రేడ్స్, ఇప్పుడు రెండున్నర ఐంది. ఒక గంటలోగానే మనపనులన్నీ పూర్తిచేసుకోవాలి. కర్టు ప్రస్తుత పరిస్థితులను గూర్చి వివరించాక, చర్చించి, ఏమిచెయ్యాలో, నిర్ణయిద్దాం" పాల్ యొక్క ఖిన్నవదనాన్ని చూచి, యీరోజున ఆతడేమీ వుపయోగించడని థామస్ నిర్మొగమాటంగా కర్టును మాట్లాడమన్నాడు.

కర్టు చాలా మారిపోయాడు. ఆతని మోటుప్రవర్తన అంతా, నేడు సుదృఢమైన కఠోరంగా మారింది. మా ఖవిషయా

లమీద తరువాత చెయ్యవలసిన పనులమీద ఆతని ఆలోచన లన్నీ కేంద్రీకరింప బడ్డాయి.

ముందుగా ఊహించలేని పరిస్థితులలో, విప్లవనాయకులుగా తమకు తెలియకుండానే మారిపోయే శ్రామికుల వంటివారు కర్టు జమ్మర్ మన్.

ఒక అరగంట ముందు కర్టు నాటి భయానక సంఘటన లన్నిటినీ వివరణబుద్ధితో ఆలోచించి, ఇకముందు తాము అనుసరింపవలసిన సుస్పష్ట మార్గాన్ని అన్వేషిస్తున్నాడు. హెర్మన్ అచ్చటలేనంతకాలమూ రాజకీయభాధ్యత అంతా తన భుజాలమీద వుందని ఆతనికి తెలుసును. పదవీరూపంలో బాధ్యత తన మీద పెట్టబడిందా, లేదా అని ఆలోచించ లేదు.

"కామ్రేడ్స్" కర్టు చర్చను ప్రారంభించాడు. "తక్కిన పార్టీ కేంద్రాలతో ఉత్తరప్రత్యుత్తరాలు జరిపే సౌకర్యాలు మనకి లేవు. పరిస్థితులీవిధంగా అభివృద్ధిచెందుతాయని మన కామ్రేడ్స్ ఎవ్వరూ ముందుగా ఊహించలేదని స్పష్టంకాతూన్నది. మనంకూడా అందుకు సిద్ధమైలేము. కాని హెర్మన్ మేజాబల్లమీద నేనొక కాగితంచూచాను. దాన్నిబట్టి ఇంతకు ముందే పరిస్థితులీరూపాల్ని దాలుస్తాయని కొందరు ఊహించినట్లు తెలుస్తూన్నది." ఆకాగితాన్ని బిగ్గరగాచదివి వినిపించాడు. "మే ఒకటవ తేదీ—బెర్లిన్ చావుదినం—" మే దినోత్స

వం అనేక కార్మికకుటుంబములమీదకు తీసికొనివచ్చే ...
కష్టాలన్నిటినీ కమ్యూనిస్టులమీదకు త్రోసివెయ్యడం చాల సులభం. నిషేధాజ్ఞను ధిక్కరించి కమ్యూనిస్టులు ఊరేగింపులు జరిపి ఉండకపోయేవారు. కాని 'నువ్వు చంపకూడదు' అన్న నిబంధనను ధిక్కరించేందుకు సిద్ధమైన 'హంతకుని' పక్షమున పోరాడుట నిష్ఫలం. 1929 పోలీసుప్రెశిడెంటుగారు కార్మికులను కాల్చేందుకు సిద్ధం ఔతూండగా, ఆయనను క్షమింపుడని కోరిన లాభమేమిటి? రాజ్యాధికారంకోసం, కార్మికజీవితములు త్యాగం చెయ్యబడుచున్నప్పుడు పార్టీయీ విషయంలో జోక్యం కలుగచేసుకోవలసివుంటుంది."

"ఓయ్, ఆదెక్కడ అచ్చయింది?" చాలఉద్రేకంతో అరచి గబుక్కున లేచి నిలబడ్డాడు థామస్.

"ఇది ఏప్రిలు 19 వ తేదివాడు 'సాషిస్సీవాక్స్‌బ్లాట్' అనే సోషల్ డెమాక్రాటు పత్రికలో ముద్రించబడింది" శాంతంగా కర్టు జవాబిచ్చాడు.

"బెర్లిన్ చావుల దినం" పాల్ అరిచాడు..."అది నిజమే—వాళ్లు ముందే యెరుగుదురు.........!"

"అనేక నకళ్లు తీసి వెడ్డింగ్‌లో పంచిపెట్టాలి!"

"కరపత్రాలు పంచిపెట్టవలసిన మాట నిజమే! మన సంఘానికి, ఒక 'సైక్లస్టాయిల్ యంత్రం' గాని రోటరీ గాని

లేకపోవడానికి ఫలితం అనుభవిస్తున్నాం. పార్టీ కేంద్రం రేపటిలోగా సహాయం చేయగలదో? లేదో? ముందు ముఖ్యమైన విషయం యెత్తుకుందాం. ఈపత్రికలో సోషల్ డెమాక్రాటులచే నడిపింపబడనున్న యీహత్యాకాండకు రాజకీయ కారణాలు ఉదహరింపబడకపోయినప్పటికీ, వారి ఉద్దేశ్యాలు మాత్రం వెల్లడింప బడ్డాయి. ఈవిషయంలో అతివాద సోషల్ డెమాక్రాటులు మనతో ఏకీభవిస్తున్నారు. 'రేపేమిజరుగుతుంది?' అనేది మనకు చాలముఖ్యమైన విషయం.'

అకస్మాత్తుగా తలుపుతట్టిన చప్పుడైంది.

"ఎవరది?" కార్మికులు ఖంగారుతో ఒకరి ముఖం మరొకరు చూచుకుంటున్నారు.

"దీపం ఆర్పెయ్యి!" థామస్ మెల్లిగాఅన్నాడు.

కర్టు దీపం ఆర్పేశాడు. ఆతలుపు కొట్టినది పోలీసులైతే ఆచీకటి గదిలో కూర్చున్న వారంతా సర్వనాశనమే మెట్ల మీద నుండి ఎవ్వరో పిలిచిన కేక వినపడింది.

"వాళ్ళు పోలీసులు కారు." ధైర్యంతో ఆటో అన్నాడు.

"వాడు ఫ్రిట్జు. తలుపు తెరవండి. ఆటో తలుపు తెరిచి గుమ్మందగ్గర నిలబడి "సంగతేమిటి, ఫ్రిట్జు?" అని అడిగాడు.

"సంగతేమిటా? మలుపులో ఉన్న దుకాణంలోనుంచి తుపాకులు అన్నీ లాక్కొస్తున్నారు వాళ్లు!"

"ఏమిటీ? తుపాకుల్ని ఎవరు తీసుకుంటున్నారు?"

"బాగుంది. పోలీసులుకాదోయ్ పెయ్యమ్మా!"

ఆటో గదిలోకి వచ్చాడు. దీపం మరల వెలిగింప బడింది.

"రండోయ్, కుర్రాళ్ళూ!" అన్నాడు కర్ట సంతోషం తో "తుపాకులమకాణాన్ని వాళ్లు ఖాళీ చేసేస్తున్నారు." ఆతని కండ్లు తళతళలాడేయి. "మనం మాట్లాడుతూనే వు న్నాం, వాళ్లుమాత్రం పని చేసేస్తున్నారు."

వికసించిన కర్ట వదనం చూచి అన్నా ఉకాలున నవ్వింది. "నువ్వెందుకు నవ్వవలసి వచ్చిందో అర్థంకాలేదు." మండిపడ్డాడు కర్ట. తనకే యీఊహ ఎందుకు తోచిందికాదు అని బాధ పడుతున్నాడు. రేకటి విషయం కూడా ఆలోచించ వలసి వుందన్న మాట నిజమే! కొద్ది రోజుల్లో పరిస్థితులెట్లా పరిణమిస్తాయో తెలియదు.

"బాగుంది కామ్రేడ్స్! మనం అంతా త్వరగా క్రింద కెళ్ళి వాళ్ళేంచేస్తున్నారో చూద్దాం రండి!"

‡ ‡ ‡ ‡ ‡

వీధిలో గాఢాంధకారం ఆవరించుకొని వుంది. హాయిని గొల్పే రాత్రివాయువు కార్మికులను ఆహ్వానించింది. అక్క డక్కడ ఇళ్ళముందు నల్లటి మానవచ్ఛాయలు కనబడుతు

న్నాయి. చీకటితలుపుదోవల్లో సిగరెట్లు ఎర్రగా కాల్తున్నాయి. మనుష్యులు ఒకరితో నొకరు గుసగుసలాడుకుంటున్నారు. ఆరాత్రి యెవరూ కూడా నిద్రపోలేక పోతున్నారు.

నిశ్శబ్దంగా వున్న ఆచీకటి వీధినుండి మళుపువద్ద నున్న "ఆయుధసామగ్రులు, ఉక్కు-సామానులు" అమ్మబడు దుకాణాం వద్దకు కట్టు, ఠక్కున కార్మికులు గబగబా వెళ్ళేరు. వీధి ముందు నిలబడితే చప్పుడు వినపడుతూన్నది.

వారుదొడ్డిదోవలోంచి దొడ్లోకివెళ్ళేరు.

"ఎవరక్కడ?" అని ఒకమూల దాక్కున్న వ్యక్తి ప్రశ్నించగా థామస్ బదులు పలికేడు.

చడీ, చప్పుడు చెయ్యకుండా కొందరు వ్యక్తులు దొడ్డి వైపు కిటికీనుంచి కొన్నిమూటలతో క్రిందికి దిగివస్తున్నారు. అతివేగంగానూ, చురుగ్గానూ, నిశ్శబ్దంగానూ పనులుచేస్తున్నారు దుకాణంలో తీసుకోవలసినవి అట్టేలేవు. అదుకాణం కాదు. దాంట్లోవున్న సామానులలో కత్తెరలు, చాకులు మంగలి కత్తులు, అధికంగా వున్నాయి ఉపయోగపడే ఆయుధాలు తప్ప మరేమీ ఎవరూ తీసుకొని పోకుండా ఒకకార్మికుడు ద్వారంవద్ద కాపలా కాస్తున్నాడు. చిన్నపిస్తోళ్లు ఉన్నాయి. బాకులు కృపాణములు తర్లించి వెయ్యబడ్డాయి. అసలు లేనిదానికంటె గ్రుడ్డి బావమేలుగా మరి.

# అన్నా

ఒక పావుగంటలో పని అంతా పూర్తిఐపోయింది. ఒక సురక్షితస్థానంలో కొన్ని తుపాకులు దాచబడ్డాయి. కొన్ని నమ్మకస్థులైన కార్మికులకు పంచేరు. పార్టీసభ్యుడౌనా? కాదా? అనే ప్రశ్న కార్మికుల అర్హతల్ని నిర్ణయించడం మానుకుంది. ఈరక్షణ వెనుక నే వీధి అంతా నిలబడివుంది.



పోలీసు స్టేషనులోను, అపాయకర ప్రదేశాల్లోనూ కూడా పరిస్థితులు తారు మారయ్యాయి.

వల్నర్ ఆసాయంకాలపు పోరాటంలో పాల్గొన్నాడు. అడ్డుగోడలవద్ద పడివున్న కుర్రవాడికళేబరాన్ని చూచాడు. అడ్డుగోడలమీాద దాడి సలిపేముందు అచ్చట తిరిగిన తెల్లటి వ్యక్తిని చూచినప్పటి నుండీ ఆదృశ్యాన్ని మరవలేకుండా వున్నాడు. అవతలప్రక్కనుంచి సెర్చిలైటు ప్రకాశించినప్పుడు ఆతడే జాగ్రత్తగా గురిచూచికాల్చాడు. తక్కిన పోలీసుసోదరుల వలెనే ఆతడు కూడా ఉద్వేగం పొందాడు. భయపడ్డాడు. ఆఅంధకారమయవీధిని చూచి ఆమానసికపరిస్థితిలో ఆతడు కాల్చాడు.........

డసిన్నన ఆతని బుర్రలో ఆయాలోచన స్థిరపడి వుండ వచ్చును. ఆయువకుని ముఖంమీాద టార్చివేసి చూచిన మొదటి క్షణాన్నే ఎడమకంటిపైని పడివ గుండ్రటికన్నం తనతు

పాకీగుంటు చేసినదే! అనే అభిప్రాయం స్థిరపడింది. పోలీసు సార్జెంటు వల్నర్ — ముగ్గురు పిల్లల తండ్రి — ఒక హంతకుడయ్యాడు.

ఆగదిలో కూర్చున్న తూర్పు ప్రష్యాయువకుల మనసుల్లోంచి దండెత్తుతున్నామనే భావోద్రేకం మాయమైపోయింది. వారిభయం ఎంత ఎక్కువవుందో, వారంత క్రూరులైపోయారు. అవ్యక్తమైనది, మాయతో కూడినది శక్తివంతమైనది, ఏదో ఒకటి — ప్రజాసమూహాలు — వారిని ఎదుర్కొన్నాయి.

"సార్జెంటు వల్నర్‌ను మేజరుగారు రమ్మంటున్నారు." అను పిలుపు వినబడింది. వల్నర్ ఉలిక్కిపడి వెనుకకు తిరిగేడు "నాతో ఏమిపని ఉంది వారికి? నేనొక హంతకుడనని ఎరుగుదురా? అందుకుగాను శిక్షిస్తారా? అనేకమంది తుపాకులు కాల్చారు......ఆజ్ఞానుసారంగాను.........

కాలరు బిగించుకుని, గదిలో ప్రవేశించి, తలుపులు మూసి, విధేయతతో నిలబడ్డాడు. ఆతని ముందున్న బల్లవద్ద మేజరు బీల్, కాప్టెన్ వాన్ మార్జ్లా మేజరు బ్రానిజ్, మరొక ఉద్యోగి కూర్చున్నారు. ఆనాలుగవ అధికారి రీచ్‌స్వేర్ నుంచి వచ్చేడని బ్రాండెన్‌బర్గు నుండి వచ్చిన పోలీసులు చెప్పేరు.

"దగ్గరకురా వల్నర్! మేజరు అడిగాడు. «అవతల వున్న వాళ్లెవరూ వినవవసరంలేదు. బాగుంది. వల్నర్, ఇక్కడవున్న వాళ్ళందరిలోనూ నువ్వు చాలానమ్మకస్థుడవు ప్రత్యేకం నీకొక ఆజ్ఞవుంది."

ఈక్షణంలో వల్నర్ మీద పరిపూర్ణమైన మార్పు వచ్చింది. «నేను చాలానమ్మకస్థుణ్ణి. ఎందుచేతంటే నేనో కుర్రాణ్ణి హత్యచేశాను గనుక» అనుకున్నాడు వల్నరు... మళ్ళీ అట్టిపనినే పురమాయిస్తారు......అబ్బే!......ఆతడు తిరస్కరిస్తాడు. ఆతడు నమ్మకస్థుడు కాడు. ఆతడు పూర్తిగా స్తంభించి పోయాడు. ఉద్రేకంతో ఆతని మోకాళ్ళు వణకుతున్నాయి.

«ఏమిటిది? ధైర్యంతో వుండవోయ్! కార్మికులపేటలన్నీ కారుమీద వెళ్ళి ఏంచూచావో వచ్చి మాతో చెప్పు. అడ్డంవచ్చిన ప్రతివస్తువునీ కాల్చిపారవెయ్యి. అర్థమైందా? సహాయంగా కావలిశొస్తే కొందర్ని తీసికొనివెళ్ళు. ఈపని సరిగా నెరవేర్చు. ఇకపో" అన్నాడు మేజరు.

కాని వల్నర్ వెళ్లలేదు. ఆచోటనే నిలబడి ఇంకా మేజరువైపు చూస్తూనే వున్నాడు.

«నాఆజ్ఞ విన్నావా?" మేజరు నెమ్మదిగా బెదరించే కంఠస్వరంతో రెట్టించాడు. "విన్నానండి అయ్యా."

"ఐతే, ఇంకా యెందుకు ఆలస్యంచేస్తున్నావ్?"

ఔను, వల్నర్ ఎందుకు ఆలస్యంచేస్తున్నాడు? పై ఉద్యోగస్థునివైపు తేరిపారచూస్తున్నాడు. క్రిమంగా అతని వేళ్ళు బిగుసుకొని పోతున్నాయి. అరచేతులను గోళ్ళతో నొక్కుకున్నాడు. ఇప్పుడు నిశ్చయించుకున్నాడు. మనస్సులో అరవాలనీ, చప్పట్లు చరచాలనీ, గట్టిగాచెప్పాలని అనుకున్నాడు కాని చాలనెమ్మదిగా నత్తుతూ నిస్సహాయునివలె చెప్పగలిగేడు. "అయ్యా, ఆపని నేను చెయ్యలేనండీ!" మేజరు ముఖం కోపారుణితమైంది. "చెయ్యలేవ్?" అని అరిచాడు.

"ఔను" వల్నర్ సమాధానమిచ్చాడు. "అది అసాధ్యం. నేను ఒకమానవుణ్ణి హత్యచేశాను.

"క్షమించండి, అయ్యా" కాప్టెను జోక్యం కలుగచేసుకున్నాడు. "అతడు పూర్తిగా మనోస్థైర్యాన్ని కోలిపోయాడని నానమ్మకం. ఏమిఅంటున్నాడో వాడికే తెలియడంలేదు."

మేజరు నిశ్చేష్టుడై కదలకుండా నిలబడిన వల్నరును సమీపించి సిగరెట్టుపొగ ముఖంమీదకు వదలి "పిరికి పంద" అని బుసకొట్టేడు. "పో—పంది, బోల్షివిక్ వెధవా— తక్షణం పో!" అని ఉరిమాడు.

ఆయుధికారులు తమ ఆసనాలమీద నుండి లేచారు. వల్నర్‌కు తానేవిధంగా అవమానపరచపడుతున్నాడో తెలు

సుకునేందుకు కొంత కాలంపట్టింది. నోరు తెరిస్తే బొరుమని యేడుపు తప్పక వస్తుందని మాత్రం మెరుగును. ఇక, అతడు పట్టలేకపోయాడు. "అది హత్య, మీరు హత్యలు చేస్తున్నారు. హత్యలు! నేనుపిరికివాణ్ణి కాదు! పదేళ్లనుంచీ ఉద్యోగం చేస్తున్నాను ఎప్పుడూ పిరికితనం లేదు. ఇల్లాంటిది అఖర్లేదు ఎప్పుడూ వద్దు!''

ఆయుద్యోగస్థులు అడ్డగింపగలిగే ముందే గోడకు జారగిల వేయ్యబడిన చిన్నతుపాకిని మేజరు పాదములమీదకు బలంకొద్దీ విసిరాడు.

వల్నరును అరెస్టుచేశి, ఆరాత్రే పోలీసు ప్రెశీడియంకు తీసికొని పోయారు.

మైకాఫక్ బారక్సునుంచి ముగ్గురు పోలీసులు అరెస్టు చేయ,బడి, ఆనాడే తీసికొని పోబడ్డారు.

---

# ఆ న్నా

"మే" రెండవ తేదీ. అరుణోదయం అవడంతోటే జన సామాన్యపు అభిప్రాయం ఏవిధంగా వున్నదీ, చూచేందుకు, కొంతఆచోకీ ప్రోగుచేసుకొని పప్పు వీధిలో నివశిస్తూన్న కార్మికులకిచ్చేందుకు, కర్టు నగరంలోకి వెళ్ళాడు.

వార్వర్ట్సు ముఖపత్రంమీాద "కమ్యూనిస్టుల రక్తపాత దోషం" అనిముద్రించ బడివుంది. "మాస్కో శవాలను వాంఛిస్తూన్నది" అను శీర్షికతో, వాక్స్లబ్లాటు ఒకవ్యాసాన్ని ప్రకటించింది. దానిని చూచి కార్మికులు నవ్వేరు: పోలీసు ప్రెశిడెంటు పట్టపగటి "మే దినోత్సవహంతకుడు" అని వ్రాసిన సోషల్ డెమాక్రాటు అతివాదులే కమ్యూనిస్టు ఎరగాంధ్రు ఉన్మత్త తాండవం చేసి పైశాచిక హాసం చేశారు అనివ్రాశారు. ఈపార్టీ పత్రికలు అబద్ధాలు వ్రాయడంలో బూర్జువా పత్రికల్ని మించుతాయి.

సోషల్ డెమాక్రాటు పత్రికలన్నిటిలోను కొద్ది మార్పులతో "మాస్కో శవాలను కోరుచున్నది" అను శీర్షికక్రింద వ్యాసములు ప్రచురింపబడ్డవి.

చేతికి దొరికిన పత్రికలన్నిటినీ ఆవేగంతో కర్టు చదివి పారవేస్తున్నాడు. వాటన్నిటినీ కొనుక్కోలేదు. ఒకవ్యక్తి పత్రికతో నిలబడితే ఆయనను ప్రార్థించి తీసికొని చదువుతున్నాడు. "ఒట్టి పిచ్చితనం! అన్నీ అబద్ధాలే?" అని పదేపదే అనుకుంటున్నాడు. తనవీధిని గూర్చి వ్రాయబడిన వ్రాతలను మున్ముందు చూచేవా.

ఒక పత్రికలో "రెడ్ నైటింగేల్"కు ఎదురుగా నిర్మింపబడిన అడ్డుగోడల మీద పోలీసులు జరిపిన దాడిని గురించి యీావిధంగా వర్ణింపబడినది. "...ఆజ్ఞాపింపబడిన తక్షణమే చుట్టుప్రక్కలనున్న 150 కమ్యూనిస్టులు ఇండ్లలోనుండి బయటకు వచ్చి ఆరు అడుగులయెత్తు అడ్డుకోటగోడలను, లారీలు, బండ్లు, గ్యాసుపైపులు, రాళ్లు, ఇనుపకమ్మీలు, కర్రదూలాలతో వీధికడ్డంగా నిర్మించారు. వాటివెనకాల సైన్యపు రైఫుళ్ళు, రివాల్వర్లను ధరించిన 100 మంది కమ్యూనిస్టులు సురక్షితమైన స్థానంలో నిలబడి తుపాతులు కాల్చడం ఆరంభించారు. పోలీసుల ముందుభాగాన్ని మాత్రమే వారు కాల్చారు. కమ్యూనిస్టులు అటకలను, ఇంటిపైకప్పులను, ఆక్రమించుకుని ఎడతెరిపిలేకుండా కాల్చగా కొద్దిసేపట్లోనే బలహీనమైన పోలీసుపటాలం వెనుకకుతగ్గి సహాయంకోసం ఎదురుచూడవలసి వచ్చింది." కర్టు ఆశ్చర్యచకితుడయ్యాడు.

పోలీసులు మొదటిసారి వచ్చినప్పుడు ఒక తుపాకికూడా పేల లేదు. అడ్డుగోడవెనుక పోలీసులు దాడిసాగించినప్పుడు ఇద్దరు చనిపోయి పడివున్నారు. వారేనా వీరిమీద కాల్చింది?

ఆతడు అంతకంతకు కంగారు పడిపోతున్నాడు. ఎవరు పారేశారు దీనిని? పత్రికను గుండ్రంగా త్రిప్పాడు-వార్తాపత్రిక-ఎలుగుబంటివలె రొప్పుకుంటూ ఇంటికి ఘటాన్ని జేరవేస్తున్నాడు. దారిలో ఒక పోలీసుని చూచినప్పుడు అసహ్యంతో వణకిపోయాడు.

ప్రజలందరూ, శాంతంగా ఏమీజరుగనట్లు యెందుచేత ఇటూ, అటూ తిరుగుతున్నారు? ట్రాంకార్లు యథాప్రకారంగానే పరిగెత్తుతున్నాయి. బ్రిడ్జిలమీదనుండి రైళ్లు దొర్లుకొని పోతున్నాయి

ఇన్ని అబద్ధాలను విరజిమ్మేస్తూన్న ఆముద్రణాయంత్రాల్ని కార్మికులెందుకు ధ్వంసం చెయ్యరు? తిట్టుకుంటూ, మామూలుగానే ఫ్యాక్టరీలకు ఎందుచేత పోతున్నారు?

♦ ♦ ♦ ♦ ♦ ♦

ప్రతిచోటా, 'రోట్‌ఫానీ' అమ్ముడౌతూన్నది. దాని కొరకు కార్మికులొక్కరేకాదు యెదురుచూస్తూన్నది.

కర్లు, ఎలానక్స్ట్రాసీ నుండి పరిగెత్తుతున్నాడు. బూలో ప్లాజ్ సమీపిస్తూన్నకొద్దీ కిటికీలనుండి వ్రేళ్లాడే ఎర్రజండాలు

అంతకంతకు అధికమౌతున్నాయి. ఈప్రాంతంలో కార్మికులు నివశిస్తున్నారు.

పోలీసులతో నిండివున్న ఒకబరువైన లారీ శర వేగంతో పరిగెత్తింది.. వారిచేతులలో దట్టించిన రైఫుల్లు వున్నాయి. లారీలో వెనుక బల్లమీదనుండి ఒక మరఫిరంగీ త్రొంగిచూస్తూన్నది. కండ్లు లోతుకు దించుకుపోయిన వివర్ణ వదనాలు. కట్టు కణతలు బ్రద్దలౌతున్నాయి.

రోజన్‌థాలర్‌లో పత్రికలువేమీ దొరకడం లేదు. ఒక ఫలహారశాలనుండి వేడివేడివంటకాల కమ్మటి వాసన కొడుతూన్నది. అప్పుడు ఆతనికి అకస్మాత్తుగా తాను నిన్న ఉదయాన్ని మాత్రమే భోజనం చేశానని జ్ఞాపకం వచ్చింది. తరువాత తరువాత—ఇప్పుడు ఆతడు చాలా ఉద్రేకకరవశుడై వున్నాడు. కూరల బజారు దగ్గర దొర్లుతూన్నది. దుకాణముల బయట ప్రజలు నిలబడి మాటలాడుకుంటున్నారు. 'వాక్సెబూగ' కమ్యూనిస్టు వెనుకపార్టీ కేంద్రకార్యాలయం యొక్క "కారల్—లీబ్‌నెట్‌భవనాలు" ఉన్నాయి. ఆభవన 'టవల్' మీద ఒకపెద్ద ఎర్రజండా ప్రపంచశ్రామికవీరగాథల్ని గాలిలో చిత్రిస్తూన్నది. వీధిలో 'రోట్‌ఫానీ' చదువుతూ మనుష్యులు గుంపులుగుంపులుగా నిలబడి వున్నారు.

"ఫ్యాక్టరీలను బహిష్కరించండి."

కార్మికులహంతకులకు వ్యతిరేకంగా ప్రజాసామాన్యపు రాజకీయసమ్మెను చెయ్యండి.

జార్జిబెల్ ప్రభుత్వం నశించుగాక! వర్గసంఘర్షణ ఖైదీలను వదిలించండి! హంతకుల్ని శిక్షించండి!"

"అన్ని ఫ్యాక్టరీల్లోనూ, అవసరసభలను పిలిపించండి! సమ్మె చెయ్యండని ప్రబోధం కావించండి! ఫ్యాక్టరీల ప్రతినిధులు నియుక్తులు, ఫ్యాక్టరీ సలహాసంఘసభ్యులు యీరోజు రాత్రి 8 గంటలకు సోఫియన్ చావడిలో మహాబెర్లిన్ ప్రతినిధి సాధారణసభాసమావేశమౌతుంది. ప్రతినిధులను పంపకుండా ఏఫ్యాక్టరీకూడా ఉండకూడదు.

"మరణించినవారు 10, క్షతగాత్రులు 150! — బెర్లిన్ శ్రామికవర్గం పనిముట్లను క్రింద ఉంచేస్తోన్నది. బెర్లిన్ ఫ్యాక్టరీలు యీరోజున పొంగుతూన్న సముద్రాలు జార్జిబెల్ చేసిన యీభయానక రక్తస్నానాన్ని ఏసోషల్ డెమాక్రాటు సభ్యుడూ సమర్థించలేదు! హద్దూపద్దూ లేని రోషావేశం ఉబుకుతూ గట్లు తెగించుకుంటూ వుంటుంది. అదిరాజకీయ హర్తాలును జరుపవలెననే ప్రజాబాహుళ్యపుకోరిక రూపాన్ని తాలుస్తూన్నది.

"ఈలోపుగానే ప్రజలు పనిచెయ్యక హర్తాలును చేస్తున్నారు. కార్పొరేటు భవనం హెర్మన్ప్లాజీలవద్ద, కార్మి

కులు పనిచేయ నిరాకరించారు. పోలీసుప్రెసిడెంటు పోయి తీరాలి! అదే బెర్లిన్ శ్రామికుల ఏకగ్రీవమైనకోరిక.

"హోజ్ అండ్ కోఫరమ్ డూబెన్స్ట్రాసీలలో సీసపుపని వాండ్రు, భయంకరమైన కార్మికులవధకు. తమతీవ్రమైన అసంతృప్తిని తెలియబరుస్తూ, పనిముట్లను ముట్టలేదు.

"సో డె. పోలీసు పరిపాలనను తుదముట్టించేందుకు మహత్తరమైన సమ్మెచేయుడని జర్మనీ కార్మికుల కుద్బోధిం చుచు జాకొబోవిజ్ కార్మికులు సమ్మెచేశారు.

"హెబాల్జమన్ నిమిటెడ్ ఫరమ్లోని 500 మంది కార్మికులు హాజరై మే దిన రక్తపాతాన్ని ఖండిస్తూ, తక్ష ణమే జర్మనీ కార్మికులు రాజకీయ హర్తాల్‌ను జరపాలని తీర్మానించుకున్నారు. కమ్యూనిస్టు అంతర్జతీయ విప్లవగీతాన్ని పాడుకుంటూ పనిమానివేశారు. వాక్సెపార్క్‌లోని కార్మి కులు సమ్మెచేస్తున్నారు. ఈఉదాహరణలను అనుసరించండి!"

కార్మికులమధ్య నిలబడి అపత్రిక లోని అక్షరాలన్నీ నృత్యం చేస్తూన్నట్లు కనపడేవరకూ కర్టు చదువుతున్నాడు. డస్సినదేహం, ఒరిసినకండ్లు మండుతున్నాయి. ఇప్పుడు అంతా సరియైన స్థితిలో క్రమబద్ధం గావుంది. గతరాత్రి వృధా అవలే దని అనుకున్నాడు.

కానింతక్రితం భయ విహ్వలుడైనందుకు, కర్ట సిగ్గు పొందేడు. అబద్ధప్రచారం చేస్తూన్న పత్రికల వ్యాసాలను చూచి, కోలిన్‌స్ట్రాసీ, న్యూకోన్‌లలో పోరాడిన వాళ్ళందరూ దొంగలూ తుంటరులూ అని నమ్మిన కార్మికులు ఆతడిచ్చుటకు వస్తూన్నప్పుడు కమ్యూనిస్టులను శాపనార్థాలు పెట్టి బండబూతులు తిడుతున్నారు. అందరూ ఆవిధంగానే తిడుతున్నారేమో అని ఇంతవరకూ భయపడ్డాడు. వర్గపోరాటములు జరిగినప్పుడల్లా, ఆపోరాటాలన్నీ తుంటరులు, దోషులచేత నడపబడ్డాయని ప్రకటించి, అసత్యప్రచారం చేశి కార్మికులందరూ ఐకమత్యంతో తమ వర్గాధికార్ని స్థాపించుకోకుండా, బూర్జువా వర్గమూ, సోషల్ డెమాక్రాటులు, పన్నే పన్నుగడలు కదా! అని కర్ట అప్పుడు గ్రహించగలిగాడు.

కర్ట ఆంతరంగిక శాంతిని పొంది, కుదుట పడ్డాడు. ఆతడెంత ఆయాసపడ్డాడో, ఎంత ఆకలిగా ఉన్నాడో, ఇప్పుడు గ్రహించగల్గాడు. అదియదార్థంగా మానసికతత్వప్రభావం! వీధికి పోయే ట్రాంకారు యెక్కి వీధిని జేరుకున్నాడు కర్ట.

ఆపగలు అసంఖ్యాములైన ఫ్యాక్టరీలలోను, పరములలోను నిరసన తీర్మానములు చెయ్యబడ్డాయి 2500 మంది

సిగరెట్టు పనివాండ్రు సమ్మెదార్లలో ప్రథములు. ఉత్తర జర్మనీ పనులలోని, ఓబర్ షాన్ లోని కార్మికులు ఎర్ర 'మే' దినోత్సవ కమిటీ ఆదేశాన్ని నెరవేర్చింది. హూటాలిమికెడ్ లీవర్ చెప్పుల ఫ్యాక్టరీల కూలీలు మరుసటి దినం సమ్మె చేస్తామని ప్రకటించారు.

77 ఫ్యాక్టరీల ప్రతినిధులతో కూడిన ఫ్యాక్టరీ సంఘము సమావేశమై శనివారంనాడు 24 గంటల నిరసన సమ్మెను చేసేందుకు నిశ్చయించుకున్నారు. కార్మికులలో అధికభాగం తక్షణమే సమ్మెకట్టి, సర్వపారిశ్రామిక కార్మిక సమ్మెను, హర్తాల్ను ప్రకటించ వలెనని కోరిరి. హాంబొరన్, ఐన దైర్న 3 లలోని గని పనివాండ్రు పని చేయ నిరాకరించారు. అరీష్లో కార్మికులు సమ్మెలో పాల్గొంటూన్నట్లు వార్తలు వచ్చాయి. 'మే' రెండవతేదీ సాయంకాలం బెర్లిన్ లో పెద్ద పెద్ద హాలులలో కిటకిట లాడిపోతూన్న సభలు జరుపబడ్డాయి. కమ్యూనిస్టు వీధి సంఘాలన్ని సభలు జరిపాయి. "రోట్ఫ్రంట్ కాంప్ ఫర్ బండ్" రోట్ జంగ్ ఫ్రంటు" గాడు, సమితి సభ్యులందర్నీ ఒకే చోట సమావేశ పరిచారు.

రీచ్స్టాంగ్ సో. డె. పార్టీ తక్కిన బూర్జువా పార్టీలు "మే" దినోత్సవ సంఘటనలను గూర్చి చర్చలు జరుప నిరాకరించిన తరువాత కమ్యూనిస్టులు "కమ్యూనిస్టు అంతర్జాతీయ

విప్లవగీతాన్ని" పాడి ఆసభను చెదరగొట్టారు. అవతల, బెర్లిన్ వీధుల్లో పోలీసులు తుపాకులు ప్రేలుస్తున్నారు.

న్యూకోన్‌లో జరుపబడిన ఒక నిరసన ఊరేగింపులో మరి ముగ్గురు కాల్చబడ్డారు. ఇరవై మందికి అపాయకరమైన గాయము లు తగిలినవి. రీచ్ స్వేర్, సోల్జర్ల పటాలములు, రాత్రికి జరుపవలసిన హత్యాకాండకు సిద్ధంచేయబడ్డారు. పోరాటం సాగిపోతూన్న ది.

---

# అన్నా

పట్టణంలోని అన్ని ప్రాంతాలనుండి వేలకొలది కార్మికులు వీధికివచ్చారు. మస్టీలు హాజరయ్యారు. న్యూకోన్, వెడ్డింగ్‌లలోని అడ్డుగోడలు కార్మికుల వశమందున్నాయి.

ఈసమయంలో హెర్మన్ తిరిగివచ్చాడు. నెట్టెల్‌బెక్ ప్లాజ్‌లో పోలీసులజాడ యేమీలేదు. వీధిగుండా వచ్చేటప్పుడు ఇండ్లమీదవున్న అసంఖ్యాకములైన పిస్తోలుగుండ్ల గుర్తులు చూచాడు.

హెర్మన్ తనకామ్రేడ్స్‌తో "ఎర్రగది" ప్రవేశించాడు.

కర్టు క్లుప్తంగా జరిగినసంగతి చెబుతోంటే హెర్మన్ మాట్లాడకుండా వింటూ మధ్యమధ్య పాల్ వైపు చూస్తున్నాడు. పాల్ స్థానాన్ని కర్టు పూర్తిగా ఆక్రమించుకున్నాడన్న సంగతిని హెర్మన్ పాల్ ముఖవైఖరినిబట్టి గ్రహించాడు. ఎంత గంభీరంగాను సూటిగాను కర్టు మాట్లాడుతున్నది హెర్మన్ గమనిస్తున్నాడు. ఇంతక్రితం ఎంతోసిగ్గుపడుతూండే సిమెంటు పనివానిలో కలిగిన యీఅద్భుతమార్పు ఆశ్చర్యం గొల్పింది. గతరాత్రి ఆతనిని పూర్తిగా మార్చేసింది.

కర్త పూర్తి చేసిన తరువాత 'వీధుల్లో వున్న ప్రజల్తో మాట్లాడావా?' అని హెర్మన్ అడిగాడు. కర్త ఆతని వైపు ఆశ్చర్యంతో చూచాడు. హెర్మన్ చాలా ఖంగారు పడ్డాడు. ఇప్పుడు చెయ్యవలసిన అత్యవసరవిషయం అదే ఆఉద్రేకంలో దాన్నిగూర్చి ఎవ్వరూ తలపెట్టలేదు. వాస్తవమైన పరిస్థితులను తెలియజేసేందుకు ఆవీధికి చేరిన రోట్‌ఫానీప్రతులు సరిపోవు. రోట్‌ఫానీ ప్రతులమ్మే కుర్రాణ్ణి ఆవీధిలోకి తీసుకెళ్ళకుండా పోలీసులు అడ్డగించారు.

"కాని మాలో ఎవళ్ళూ సరిగ్గా మాట్లాడలేదు." అని కర్త తమ అశ్రద్ధను కప్పిపుచ్చేందుకు చూచేడు. పాలిపోయిన కర్త ముఖం చూచి హెర్మన్ నవ్వాపుకోలేక పోయాడు. ఆరాత్రి వాళ్ళేంచేశారో ఆతడు జ్ఞాపకం తెచ్చుకున్నారు. కాని ఉపన్యాసం ఇవ్వడమా? వారుచాలా బెదిరి పోయారు.

కొలదిసేపట్లో కమ్యూనిస్టు అంతర్జాతీయ విప్లవగీతం వీధిలో వినపడుతూన్నది. హెర్మన్, పాలు పెరుగులు తీసుకొచ్చేబండిమీద నిలబడి కార్మికుల కుపన్యసిస్తున్నాడు.

‡ ‡ ‡ ‡ ‡

మే రెండవతేదీ సాయంకాలం సమీపిస్తున్నది.

వస్తూన్న రాత్రి, దగ్గరపడుతూన్న గంటలు ఏమి సంఘటనల్ని తీసుకొస్తాయో, ఎవరూ ఎరుగరు. పోలీసు వెళ్ళి

ణీయం యొక్క వార్తలను బూర్జువా పత్రికలన్నీ, ఏవిధమైన వ్యాఖ్యానమూ లేకుండా ఎక్కించేస్తున్నాయి. వీధిలో జరిగిన యావత్తుసంఘటనలను కండ్లారచూడకుండా, యీవార్తలను చదివినవారందరూ, బెర్లిన్‌నగరమంతా విప్లవం మధ్యవుందనీ, విజయోత్సాహులైన పోలీసులు మాత్రమే దానిని అడ్డగలరనీ నమ్మితీరవలశిందే!

వీధిలో, కమ్యూనిస్టులు ఇండ్లపైకప్పులమీదకూర్చుండి "14 గురు పోలీసుల చేతుల్లో వున్న చిన్న తుపాకులను వారి దేహములకు తగలకుండా, ముక్కుల క్రింద పేల్చి పారవేశారు" అని వార్వర్ట్సు పత్రికలో వ్రాయబడిన వార్తను చదివి, థామస్ కడుపుబ్బ నవ్వేడు. "ఆరివీళ్లతస్సాదియ్య! మనమందరమూ అద్భుతమైన గురిగలవాళ్లమన్నమాట, తుపాకులను పేల్చడంలో మనది అందెవేసిన చెయ్యి!" అన్నాడు.

పోలీసులు అసత్యప్రచారంచేసి, వారిధైర్యాన్ని బలపరచుకొంటూన్నట్లు తోచింది. ప్రతివిషయాన్నీ, అద్భుత కల్పనలతో చాలవికృతం చేయకపోతే, తుపాకులు, మరఫిరంగులు మొదలైన ఆధునిక మారణయంత్రాలను ధరించిన 14,000 మంది పోలీసులకు ఎదురొడ్డి, కొద్దిమంది కార్మికులు పురాతన ఆయుధాలతో 36 గంటలనుండీ ఎదిరిస్తున్నారంటే ప్రజలు నమ్మగలరా?

పోరాటానికి అనుకూలించే స్థితిలో వీధిలేదు. సులభం గా దానిని నాలుగుమూలలనుంచీ మూసివేయవచ్చును; అను కర్తృ వాదనను హెర్మన్ అంగీకరించాడు కాని యీవిధమైన పోరాటాలు ఇట్టి కూలీ గూడెములనుండే ఆరంభమై వృద్ధి పొందుతాయి; ఈప్రాంతములలో స్వరక్షణార్థమై పోరాడే కూలీలకు ప్రజాసామాన్యపు సహాయం లభిస్తుంది. 1923 లో హాంబర్గులో జరిగిన సంఘర్షణలు కార్మికగూడెం ఐన గాంజి వీర్టాల్ లో చాలవరకూ జయప్రదమయ్యాయి. అని హెర్మన్ వాదించాడు.

"ఈవీధిలో వున్న గృహాలన్నీ మీ చేతుల్లో ఉన్నాయి కనుకనే మీరు పోలీసులను ప్రతిఘటించగల్గారు. ప్రజాసమూహం కార్మికులయందు అభిమానం చూపినప్పుడు, కార్మికులకు రక్షణఉంది; పోలీసులు శత్రుప్రదేశంలో వుంటారు. వారు ప్రతిఅడుగుకీ కూడా శత్రువులను ఎదుర్కొనవలసి ఉంటుంది" అని హెర్మన్ ఆతనితో చెప్పేడు.

పిల్లాణ్ణి చంకనేసుకొని అన్నా దొర్లించి వచ్చింది. అన్నా కర్టులు ఒకరినొకరు చాలా అదురుగా చూచుకుంటున్నారు. పదేపదే అన్నా ఆతణ్ణి తారసిల్లుతూన్నది కాని స్వవిషయాలేమీ మాట్లాడకుండా మూకీభావం వహించి ఉంటోంది. మే ఒకటవ తేదీ ఉదయాన్నుంచీ కూడా ఒక్క సారి కూడా ఆమె ఆతనిని వెనుకకు లాగ ప్రయత్నించలేదు.

## అన్నా

నిన్నటిదినం కర్తు ఆపత్సమయంలో ఉన్నప్పుడు కేకవేసి అన్నా కర్తును రక్షించిన విషయాన్ని గూర్చి ఒక్కమాటైనా వాళ్ళిద్దరూ మాట్లాడుకోలేదు. ఆతడింకా సజీవుడైవున్నందుకే అన్నా తృప్తి పొందుతూంది. మరేవిషయమూ ముఖ్యంగా కనపడడం లేదిప్పుడు ఆమెకు. ఎందుచేతో ఆమెకే తెలియడంలేదు.మృగప్రాయులుగావున్న పోలీసులమీద పరమ అసహ్యభావంతో కార్మికులపక్షాన్ని వహిస్తూన్న ఆవీధిలోని అనేక స్త్రీలవలెనే ఆమెకూడా చాలా ఉద్రేకంతో ఉన్నది.

సరళహృదయంతో ఆమెనుచూచి నవ్వుతో "రా, అన్నా, ఆచౌక్‌లో ఏమి జరుగుతూన్నతో చూచివద్దాం" అన్నాడు కర్తు.

తమ పసిబిడ్డను ఇంటివద్దనుంచి వెళ్ళాలని కర్తుకుంది కాని తనతో తీసికెళ్ళి గాలిలో త్రిప్పాలని అన్నా అభిప్రాయపడింది. నిన్నటిప్రొద్దుటినుంచీ ఇంట్లోనే మ్రగ్గిపోతున్నాడు కుర్రాడు.

చీకట్లు బాగా అలముకున్నాయి. వీధి మకాణం వద్ద అక్కడక్కడ స్త్రీలు గుంపులు గుంపులుగా నిలబడి బాతాఖానీ కొడుతున్నారు. ఒక దుకాణంలో పోలీసుల గుండు దెబ్బ ఒక కిరసనాయిలు పీపాకి తగిలి కిరసనాయిలు తక్కిన ఆహారపదార్థాల మీద పడి వాటిని నాశనంచేసింది. ఎవ్వర్కీ

నష్టానికి పరిహారం యిస్తారు? అని చాల ఉద్రేకపూరితంగా సాగించబడుతూన్న చర్చలు వీధిలోకి కూడా వినవడుతున్నాయి. అతిశ్రమపడితేనే కాని నాలుగువేళ్ళా నోట్లోకి పోని, చిన్న దుకాణాదారులికి యిదిచాలా గొప్ప నష్టాన్నికల్గించింది.

రీనిక్కండార్ఫర్ స్ట్రాసీ లోని పెద్ద పెద్ద కిరాణాదుకాణా లన్నీ మూసి వేయబడ్డాయి. నట్బెల్ బెక్ ప్లాజ్‌లో వందల కొద్ది ప్రజలు—, సోషల్ డెమాక్రాట్‌లు కూడా వున్నారు. వారిలో— నిలబడివున్నారు. ట్రాంకార్లు ఆగేచోట ఒక బల్ల మీద యిద్దరు స్త్రీలు కూర్చున్నారు. వాళ్ళని దాటి వెడుతూన్నప్పుడు వాళ్లు మాట్లాడు కోవడంలో, అందులో ఒకావిడ సోషల్ డెమాక్రాట్ పార్టీ సభ్యురాలనీ, మానోలీ షాగారు కంపెనీలో సమ్మె చేసిందనీ గ్రహించాడు కర్టు.

ఆచోకీలోని ప్రశాంతస్థితిని చూచి, యిక ముందు యే అపాయము కలగదు అనే నిర్ణయానికి వస్తారు చూచినవాళ్లు. కాని అక్కడక్కడ ప్రజలు గుంపులు గుంపులుగా నిలబడి మాట్లాడుకుంటూన్నప్పుడు వింటూన్న కర్టు వాళ్ళంతా రోషావేశంతో ఉడికి పోతున్నారనీ ఏమాత్రం రేపినా సరే ఆపలేనంత తుపాను చెలరేగుతుందనీ కర్టు గుర్తించాడు.

తక్కిన కార్మిక గూడాల్లో రక్తం చిందుతూన్నదని మళ్ళీ కబుర్లు వస్తున్నాయి. మరణించిన వారి సంఖ్య

యిప్పుడు పది హేను వరకూ పెరిగింది. పొందూ పోలికా లేకుండా పరస్పర విరుద్ధమైన వార్తలు ఆందోళనని మరీ వృద్ధి చేస్తున్నాయి. బూర్జువా పత్రికల్లోని పోలీసు ప్రకటనలు, వార్వ్ర్ట్స్ సాయంకాల ముద్రణమూ ప్రజల చేత అవహాసింపబడ్డాయి. ప్రజలంతా కావలసినంతా వారే స్వయంగా చూశారు!

క్రమ క్రమంగా చీకట్లు మరీ దట్టమౌతూన్న కొద్దీ మనుష్య సంచారము తక్కువపౌతూన్నది. చాలా చలిగా వుంది. పచ్చటి గాసు దీపాలు ప్రకాశించడం మొదలెట్టాయి.

పది గంటల వేళకే ఫారస్ సావిళ్ళ లోని గంద్రగోళపు సభలన్నీ ముగిశాయి.

దొడ్లో ఒక బహిరంగ సభ జరుప బడ వలసివుంది. హెర్మన్ కూడా హాజరై వీధిలోని పరిస్థితులు తెలియ పరచి వెంటనే మాయమయ్యాడు.

మిగతా ప్రేక్షకులతో పాటే అన్నా కూడా వీధిలో జనులను త్రోసుకుంటూ వీధిలోకి వచ్చి, కర్టుతో యింటికి చేరుకునేందుకు గబ గబా నడుస్తోన్నది. తనతో చంటిబిడ్డని కూడా తీసికొని రావడం ఎంత తెలివి తక్కువ పనో ఆమె యిప్పుడు స్వయంగానే తెలుసుకుంది.

మెల్లిగా ఆగుంపు దొడ్లోంచి బయట పడుతూన్నది. ఉద్రేక పూరితమైన ఆసభను గూర్చి అన్నా కర్టుతో యేదో

చెబుతూన్న సమయాన్ని ఒకళ్ల నొకళ్లు తోసుకోవడం హఠాత్తుగా ఆరంభమైంది. కేకలువేస్తూ, హా హా కారాలు చేస్తూన్న జన సమూహంలో నుంచి అన్నాను బయటికి లాగేందుకు కిట్టు ప్రయత్నించాడు కాని లాభంలేక పోయింది. వాళ్లు నొక్కివేయ బడుతున్నారు. దొడ్లోంచి బయటికి ప్రవహిస్తూన్న ప్రజా సమూహాన్ని అరికట్టి వీధిలో నిలబడ్డ పోలీసులు కిట్టుకు కనపడ్డారు.

సూపరింటెండెంటుతో మాట్లాడాలని ఒక వృద్ధ కార్మికుడు ప్రయత్నించాడు. ఆఉద్యోగి ఉద్రిక్త వదనం ఒక్కటే కనబడుతోన్నది. లాఠీదెబ్బలు వర్షిస్తూ ప్రజల్ని కలవరపెడుతున్నాయి. భీభత్సదృశ్యం!

అల్లాంటి గుంపులో పరిగెత్త కలిగినంతవరకూ ప్రజలు పరిగెత్తారు. ఒళ్లు తెలియకుండా లాఠీలతో చావమోదుతూ పోలీసులు ముల్లర్ వీధిలో ప్రజలవెనక్కాల పడ్డారు. కందగడ్డలాగ వున్న పోలీసు యెర్రిముఖం కిట్టు ముందు సాక్షాత్కరించింది. అతని రివాల్వరు యిటూ అటూ ఆగుంపులో పూగుతూన్నది. ఏక్షణాన్నైనా సరే గుండ్లు జీవితాల్ని బలి పుచ్చుకోవచ్చును.

కిట్టు ఆట్టేసేపు ఆలోచిస్తూ నిలబడ లేదు. అన్నానీ, బిడ్డనీ వెనక్కి లాక్కున్నాడు. తన దగ్గిరగా వున్న పోలీసు వాణ్ణి బలంకొద్దీ గడ్డం దగ్గిర గుద్దాడు. ఆపోలీసు చావ

చుట్టుగా క్రింద పడ్డాడు. కర్టు అన్నాను కేకవేసి ఆసమూ హాంలో అదృశ్యం అయ్యాడు. నేలమీద పడివున్న పోలీసు శరీరం మీద నుంచి ప్రజలు పరిగెత్తారు.

బిడ్డను గుండెకు గట్టిగా అదుముకుని ఏడుస్తూన్న పిల్ల వానితో అన్నా పరిగెత్తింది.

ఆమె వెనుక పోలీసుగుళ్లు ప్రేల్తున్నాయి. ఆవిడ ముం దున్న ఒక చిన్న బాలిక దీనారవం చేస్తూ క్రింద కూలిపోయిం ది. ఒకడు ఆఅమ్మాయిని యెత్తుకొని ఒక యింట్లోకి చొర బడ్డాడు. గాయాలు తగిలిన ఆఅమ్మాయి చేతులు కాళ్ళు వ్రేళ్లాడు తూన్నాయి.

అన్నా పరిగెత్తుతోంది. ఆమెకాళ్ళు ఒణుకుతున్నాయి. అప్పుడప్పుడు కాళ్ళు తడబడి క్రిందకు తూలి మళ్ళీ లేస్తుండేది. ......పరుగెత్తుతోంది ముందుకి ఇంకా ముందుకి. ఆమె వెన క్కాల పోలీసుయీల గింగుర్లెత్తింది. దగ్గరలో కిటికీరెక్కల తలుపులు కిటకిటలాడాయి. ముందు ఎవళ్లూ కనపడటం లేదు. చాలా చలిగాను, నిర్జనంగాను ఉన్నట్లు తోచింది ఆమెకి. ఒక్కత్తే పరిగెత్తుతోంది.

"కదలకుండా నిలబడు......" ఎవరో గర్జించారు. ఆమెకు సమీపంలో పదముల దబదబ ధ్వని వినవస్తూన్నది. భయం, నిస్సత్తువలవల్ల, స్పృహలేకుండా, ఉచ్ఛ్వాసనిశ్వా నాలు బిగపట్టి తూలుతూ మూర్ఛపోతూ పరిగెత్తుతూ

న్నది......ఒక దారుణాఘాతం ఆమె బుర్ర మీద పడింది; చర్మం అంతా తిమ్మిరిచేత బిగుసుకు పోయినట్లు పిడచగట్టుకు పోయింది. కాళ్ళు బలహీనమై పోయాయి. వరుసగా వున్న వీధిదీపాలు ఆమెకళ్ళముందు రాళ్ళబండిలోంచి క్రిందపడే రాళ్ళలాగు దొర్లుకుపోతున్నాయి—పిల్లాడు వ్రాలిపోతున్న చేతుల్లోంచి క్రిందికి జారిపోయాడు.

రెండవదెబ్బ పడటం ఆమెకి తెలియనే తెలియదు. దట్టమైన నల్లటి అగాధపు నీడలో నడిపోతున్నాయి పాలు. మహాభయంకరమైన వేగంతో ఆమె మసకగా ఉన్న అగాధంలో పడిపోతూన్నట్లు భావించింది. — ఆమెజబ్బ పట్టుకుని పైకి లాగి పాదాలమీద నిలబెట్టి బరబరా పోలీసు లాక్కుపోయి దాంట్లోకి త్రోసివేసింది కూడా ఆమెకు తెలియదు. ఆవాన్ అంతా పూర్తిగా క్షతగాత్రులతో నిండి వుంది.

"స్టేషనుకి నడవండి!" ఒక అధికారి ఆజ్ఞయిచ్చాడు. అతని ముఖం ఉద్రేకంతో ఎర్రబడి వుంది. పరిగెత్తుతూన్న లారీ మీదకి పోలీసులు దూకి ప్రక్క తెరలు మూసేశారు. ఆలారీ మహావేగంతో ముల్లర్ స్ట్రాసీ మీదుగా పరిగెత్తింది. ఒక కిటికీలోంచి ఒకరు చప్పట్లు చరిచారు. ఒక తుపాకిగుండు కిటికీలోంచి దూసుకుపోయింది.

గాఢాంధకారమైన వెడ్డింగుస్ట్రాసీని వాను గడిచిపోతూన్నప్పుడు పోలీసులు లారీలో బాగా బుర్రలు వంచి నక్కి కూ

ర్చున్నారు. వెనకని మరఫిరంగి దగ్గిరవున్న పోలీసువాడు ముడు
చుకు పడుకున్నాడు. ఆప్రయాణం పొడుగునా, అదళాధిపతి
యిద్దరు ఖైదీలు కూర్చున్న సీటు వెనక్కాల నక్కారు. ఆ
లారీ టక టక ధ్వనీ, కుదుపూ అన్నాకు మరల చైతన్యం
కలిగించాయి. తల వెనకభాగం దగ్గిర మహాబాధ పెడుతూం
డటం మూలాన్ని యింతవరకూ యేమి జరిగిందో తెలిసికొన
గలిగినంత జ్ఞానం వచ్చింది అన్నాకు. ఆమె చేతులు మొద్దు
బారినట్టువుంది. "ఇదేమిటిరా బాబూ!" అని గొణుక్కుంది
అన్నా.

రంయ్ మని పెడుతూన్న కారు అకస్మాత్తుగా ఒక
మళుపు తిరిగేటప్పుడు పెద్ద కుదుపు కుదిపింది. అప్పుడు
అన్నా తనకి ఎదురుగా వున్న బూటుకాళ్ల మీద పడింది.
హడలిపోయి వెనక్కు వత్తిగిల్లింది. బాధ ఆమెగ్రాణశక్తిని
యింకా పాడుచేశింది. ఏంజరిగింది? కర్టుఏమయ్యాడు? కుర్రా
డెక్కడ? ఓరిభగవంతుడా, కుర్రాడేమయ్యాడు?

"సార్జెంట్, సార్జెంట్—" భయంలో ఆమె బాధను
కూడా మరచిపోయి ఆబూటుకాళ్ళను గట్టిగా పట్టుకుని
అరిచింది.

"ఓసి నీదుంపతెగ!" అంటూ పోలీసు భయంతో వణ
కుతూలేచి నిలబడ్డాడు. ఇంతట్లోనే ఒకవీధి దీపకిరణపు కాం
తిలో పాలిపోయి భయంపుట్టిస్తూన్న అన్నా ముఖంచూచి

బండబూతులు తిడుతూ ఒక్క తన్ను తన్నాడు. "నోరుమూసుకో ముండా!" దబుక్కున ఆమె ముఖం క్రింద పడింది.

ఒక కుదుపుతో లారీ పోలీసుస్టేషన్ ముందు ఆగింది. వెల్తురుగా వున్న ద్వారంలో నుంచి పోలీసులు వచ్చారు. "త్వరగా వెళ్ళిపొండి!"

ఖైదీలని క్రిందకులాగి పశువుల్ని తోలినట్లు తోలుకు పోయారు లోపలికి. "కిటికీలు మూసెయ్యండి!" అంటూ వీధి లోంచి ఒక పోలీసు అరిచాడు. ఒకకిటికీ వెనక ఏదో కదలుతూంటే ఏమిటని ఆలోచించకుండా వెంటనే తుపాకి కాల్చాడు ఆపోలీసు.

వెనకనుంచి ఒకపోలీసు కొట్టిన దెబ్బతో ఒక పెద్ద మనిషి ముందుకు తూలిపోయాడు. ఇంకొకడు చావమోదు తున్నాడు బుర్రమీద. బాధతో మూల్గుతూ అతడు పోలీసు మీద పడ్డాడు. తుపాకి మడమతో దెబ్బలింకా పడుతూనే వున్నాయి. ఆపోలీసు త్రోసేస్తే పెద్ద మూలుగుతో క్రింద చీడీలమీద పడ్డాడు.

"కోతివేషాలు వెయ్యకోయ్ అట్టేను" అని అదమా యించి రెక్కలట్టుకుని గుంజి లేవదీసి తక్కినవారితో లాక్కు పోయాడు ఒక పోలీసు.

లారీలో చివరికి దిగడిన అన్నా యీదృశ్యాన్ని భయ విహ్వలచిత్తయై చూచింది. "దిగను. నేను దిగను. మమ్మల్ని

అందర్ని చావగొడతారు మీరు" అని వెర్రిఅరుపు అరిచింది. ఆమెను పట్టుకొని యువతలకి లాగుతూంటే రాకుండా గిలా గిలా కొట్టుకుంది కాని లాభంయేమిటి? కిందకీడ్చి పార వేశారు.

పోలీసులు పట్టుకుని చావ బాదుతూంటే దెబ్బలుతింటూన్న వాళ్లు యేడ్పేయేడ్పులూ పెట్టేపెడబొబ్బలూ, వీధివీధంతా వినపడుతున్నాయి. పైఅంతస్తు మీద నుంచి "తలుపులు మూసెయ్యండి" అన్న కటువు స్వరం వినపడింది. అప్పుడు మళ్లీ దెబ్బలు కొట్టడం ఆరంభమైనది. క్రొత్తగా అరెస్టయిన వాళ్లు అంతస్తు మీదికి త్రోలబడుతూన్నారు.

అరెస్టు చెయ్యబడినవాళ్లు మొత్తం పదకొండుమంది కార్మికులు. వాళ్లంతా చేతులు ఎత్తిపట్టి వుంచాలి. అన్నా ఒక్కత్తే వాళ్లందరిలోనూవున్న స్త్రీ.

బాగా ఉద్రేకంతో వున్న స్పెషలుపోలీసులు యువకులతోటీ రక్షకభటుల గది నిండి వుంది. కొద్ది గంటలకు క్రితమే వారిక్కడకు సహాయార్థం రప్పింపబడ్డారు.

"ఓహూ అడ్డుకోటలు నిర్మించిన ఘనులు వచ్చారయ్యా, రా బాబూ రా!" ఒక యిరవైయేళ్ల పోలీసుయువకుడు ఒకకార్మికుని ముఖంమీద బలంగా గుద్దాడు. 'ఇదిగోనోయ్, నీకు స్వాగతం ఇది నీకు కానుక' అని మరొక దెబ్బ కొట్టాడు. హా! మహామంచిదెబ్బ!

## ఆ న్నా

బ్రాండెన్‌బర్గు పాఠశాలలో ఏరోజుకు నేర్పుకున్నారు. యీప్రహారప్రయోగకళని మరి. అక్కడైతే తోలుబంతి మీద కొట్టాలి. మాంసకండరాలు తోలుబంతి కంటె మంచివి కాదూ? ఇంకా వాడు కాళ్ల మీదే నిలబడి వున్నాడు కాదూ! ఆప్రతిష్ట ఈదెబ్బతో కింద కూలిపోవాలంటే! "అయిందా, అబ్బాయి! పొర్లుతున్నావా కిందపడి!"

ఆపని చెయ్యడం యెంతచులాగ్గా కనపడుతోంది వాళ్లకి. ఒకపొలంగట్టుమీద నడుస్తూ కర్రతో ముళ్లమొక్కల్ని కొట్టేట్లా కనపడుతూంది. వాళ్ల బలాన్నీ, ధైరాన్ని చూచుకొని ఆపోలీసులు మురిసి పోతున్నారు.

"నాబట్టలన్నీ ఖరాబు చేస్తున్నావురా వెధవా!" అంటూ యూనిఫారమ్‌కి అంటుకున్న రక్తాన్ని తుడుచుకుంటున్నాడు ఒకపోలీసు ప్రక్కనుండి దీన్ని చూస్తూన్న పోలీసులు అదేపనిగా గట్టిగానవ్వారు. 'రండి లోపలికిరండి మాస్కా దారలు.'

రపీ—గాభీ—ఒకకార్మికుడు మూల్గుతూ గోడ మీద పడ్డాడు.

"ఒరివెధవా! ఆకాశంమీదికి ఎగిరిపోదాం అనుకున్నావురా?" ఒకకార్మికయువకుడు స్పృహతప్పి పడిపోయాడు.

"లేవరా, బండవెధవా యింటి దగ్గిర పడుకోవచ్చనుకే!" లాఠీ బలంగా ప్రయోగింపబడింది. మహాక్రోధంతో మరొక దెబ్బ కొట్టాడు.

కార్మిక ఖైదీలని కొరడాలతో బాదుతున్నారు. వాళ్లు బాధ భరించ లేక ఆక్రందనం చేస్తున్నారు.

ఉద్వేగభయాలతో కాళ్ళుచేతులు కదపలేకుండా బాధతో కృంగిపోయి అన్నా తలుపు దగ్గిర నిలబడి పోయింది. ఆమె రెండుకళ్లూ బుర్రలో రెండు అగ్ని గోళాల్లాగు మండి పోతున్నాయి. ఆమె ముఖం సీమసుద్దలా తెల్లబడి పోయింది. వణకుతూన్న చేతుల్ని వక్షస్థలానికి అనుముకుంటూంది. అంద మైన ఆమె కేశాలు నుదుటిమీద పడుతున్నాయి. "హాహాహా!"

మరణభయంతో నిలబడిన అన్నాను చూచి పోలీసులంతా కడుపు చెక్కలయ్యేట్లా నవ్వారు. మనం కొంచెం గమ్మత్తుచెయ్యొచ్చు. అందంగా వుందిరా, ఆపు!"

"రా, దగ్గరకిరా, ముద్దుగుమ్మా నువ్వు కోరుకునే దల్లా దొరుకుతుందిక్కడ నీకు! "వాళ్లలో ఒకడు ఆమెను ముందుకు త్రోశాడు.

కార్మికుల్లో కొందరు మెల్లిగా ముఖాలు వెనక్కి త్రిప్ప చూడబోయారు. "ముఖాలు గోడవైపు త్రిప్పండి, చేతులు ఎత్తండి!" అని గర్జించారు పోలీసులు కానివారిలోని ఒక

కార్మికయువకుడు ముఖం మళ్లించ లేకపోయాడు. అరెస్టయిన ఆకార్మికు లందరిలోనూ అతడొక్కడే కమ్యూనిస్టు అనిల బడిన యువతి కామ్రేడ్ జిమ్మర్ మన్ భార్య అని అతడెరుగును. అతని ముఖము నల్లపడింది. అతడు వ్రేలిగోళ్లతో అరచేతుల్లో గుచ్చుకున్నాడు. ఆపైన ఆపుకోలేక హఠాత్తుగా అతిబిగ్గరగా అరచాడు.

"హంతకులారా! — వెధవల్లారా—పిరికి ముండా కొడుకుల్లారా.— మా చేతుల్లో తుపాకులుంటేనా! "అతడు నోరు మూసుకుని పడుండలేకపోయాడు. ఏం జరుగుతుందో లెఖ చెయ్యలేదు. వేళాకోళం చేస్తు ధుమధుమలాడుతున్న యీపోలీసుల్ని ముఖాలమీద తన నేరారోపణని చేశాడు. తుపాకులు లేని యీకార్మికుల దగ్గర వాళ్లు పెద్దవీరులు. కాని వీథుల్లోనో! అక్కడ శ్రామికుల పిడికిటి పోట్లకి ప్రాణం భయంతో గడ గడలాడి పోవడం లేదూ? అక్కడ దారీ తెన్నూ లేకుండా కనిపించిన దానిమీద అల్లా కాల్చలేదూ?

అతని రోషావేశంతో కూడుకొన్న కేకలు దెబ్బల వర్షంలో మునిగి పోయాయి. ఉరుముతో, ఒక్కదూకు దూకి అతని మీద పడ్డారు ఏడెనమండుగురు పోలీసులు.

"వెధవ, కమ్యూనిస్టువెధవా ?" "చావమోదండిరా దుండిని" "నీకు చూపిస్తాంలే తడాఖా"

అతన్ని బాదేందుకు ఒకళ్ళ నొకళ్ళు త్రోసుకుంటూ దగ్గరకు వచ్చి చెయ్యి విసురుతున్నారు. అతడు నేల మీద

పడి పోయాడు. దెబ్బలు తగలకుండా బుర్రని రక్షించుకోవాలని చేతులెట్టి కాచుకునేందుకు ప్రయత్నిస్తున్నాడు అతడింకా అరుస్తూనే వున్నాడు. అతని ముఖాన్ని కాళ్ళెట్టి త్రొక్కేస్తున్నారు. తాపులు తంతున్నారు. వాడు స్పృహతప్పి పడిపోయేవరకూ లాఠీలతోటీ, రైఫులు మడమలతోటీ మోదుతూనే వున్నారు.

వగరుస్తూ చిట్టచివరకి వీరవిహారం నుంచి విరమించారు. కొందరు చెమట్లు గ్రక్కారు. "ఇప్పటికి — ఆ వెధవ — చచ్చాడు. పని పూర్తైంది!"

ఉద్రేకపూరితులై మాట్లాడలేక పోతున్నారు. కొలది సేపట్లోనే నలిగిన యూనిఫారాలని సరిచేసుగోవడం ఆరంభించారు. పైనుంచి వ్రేళ్ళాడుతూన్న ఎలెక్ట్రిక్ దీపం ముందుకీ వెనక్కీ వూగుతోంది. ఒక మూల క్రుక్కివెయ్యబడిన ఖైదీల నెత్తిమీద ఒక దీపం మిణుకు మిణుకు మంటూన్నది.

ఒక టేబిలు వెనక్కాల అన్నా కూర్చుని, కదలిక లేకుండా బోర్లగిలత పడున్న ఆయువకుని కేసి తదేకదీక్షగా చూస్తూన్నది. ఆయువకుని బిరుసు జుట్టులో నుంచి రక్తం మెడమీదుగా చారికలు కట్టి ఓడుతున్నది. ఈయువకుడు కర్టుతో తిరుగుతున్నప్పుడు ఒకటి రెండు సార్లు అన్నా చూచింది. కర్టుకి శాంతుడు, నమ్మకస్తుడూ ఐన యీయువకుని మీద చాలప్రేమ.

"ఒరి వెధవల్లారా! చూస్తున్నారా — మిమ్మల్ని అందర్నీ అల్లాగేచేస్తాం. మే దినోత్సవం చెయ్యడం నేర్పుతాంరా మీకు!" ఆపోలీసు యువకుని జుగుప్సాకరమైన ముఖం కేసి అన్నా భయవిహ్వలమై చూచింది. అతని కన్నుగుడ్లు పైకి ఉబికి ఉన్నాయి. అతని వేళ్ళమీద రక్తం చారికలు కట్టింది. అన్నాకు మరేమీ తెలియడంలేదు. తనకొడుకు భర్తల కొరకు యింతవరకు పడిన ఆందోళన ఆనర్థాలు మరిచిపోయింది. కార్మికుని రక్తంతో తడిసిన ఆపోలీసు లావుపాటి గుండ్రని చేతిని నిశ్చేష్టితురాలై తదేకదీక్షతో చూస్తూన్నది. జ్వరపీడితమైన ఆమెబుర్రలో రక్తనాళాలు సమ్మెటపోటులా పొడుస్తున్నాయి. హంతకునిచెయ్యి... హంతకునిచెయ్యి... హంతకుని చెయ్యి...

బహుశా అప్పుడే ఆమె పిచ్చిదైపోయివుంటుంది.

---

# ఆన్నా

పదకొండు గంటలైంది.

ఆగల్లీలోని వీధులన్నీ నిర్మానుష్యంగా వున్నాయి. కన్నుమిన్ను కానరానంత చీకటిగా వుంది. ఆకాశంలో నక్షత్రాలు కనపడటం లేదు. రీనిక్కెండార్ఫర్ స్ట్రాసీలో ఒక ట్రాంకారు ఆగింది. దాని దీపాలు ఆర్పివేయబడ్డాయి. అక్కడక్కడ కొన్నిఛాయలు ఇటూ అటూ యిండ్ల ముందు కదులుతున్నాయి. చడీచప్పుడూ లేకుండా అవ్వి యిటూఅటూ తిరిగి మళ్ళీ అంధకారంలో కనబడటం లేదు. ఒక ప్రక్కవీధిలో రెండుమూడు సార్లు తుపాకి గుండ్లశబ్దం వినపడింది. ఆపైని మళ్లీ నిశ్శబ్దం రాజ్యమేలుతూన్నది.

ఒకద్వారం దగ్గిర మాత్రం సిగరెట్టు రాజుకుంటూన్న వెలుతురులో కొద్దిక్షణాలు మాత్రం ఒక కార్మికుని ముఖం కనపడింది. అతడు ఆగల్లీని, వీధిని కాపలా కాస్తున్నాడు. చప్పుడుచెయ్యకుండా ఒకప్రైవేటుకారు వీధిలో జాగ్రత్తగా పైదీపాల నార్పి వెడుతూన్నది. దాని టైర్లు గాజుముక్కల మీద వెడుతూ కటకటమని చప్పుడు చేశాయి. హఠాత్తుగా భయభ్రాంతమైనట్లు అది ఆగింది. కారులోవున్న ఎలెక్ట్రిక్

లై/

దీపం కూడా ఆర్పివేయబడింది. ఆకారు వెనక్కి తిరిగి పూర్తివేగంతో బాంయ్‌మనుకుంటూ పరుగెత్తుకు పోయింది.

ఎదుట నిలబడినవాడు కూడా కనపడనంత దుర్భేద్య మైన గాఢాంధకారపు పొర క్రమ్మివుంది. ఆవీధిలో ఇళ్లలో ఎక్కడా దీపాలు వెలగడంలేదు. "రెడ్ నైటింగేల్"లో ఒక మూల యింటికంతలో నుంచి మాత్రం దీపకిరణం కనపడు తూన్నది. ఆయింట్లోంచి గుసగుసలు వినపడుతున్నాయి. ఆయింటి వెనక గదిలో ఒక సభ చేయబడుచున్నది.

వ్యవధిలేదు. వారేదో నిర్ణయానికి త్వరగా రావలసి యున్నది. విషయానికి సంబంధించకుండా తోచినది మాట్లా డేవాళ్ల నోళ్లు కట్టేస్తున్నారు. అక్కడ కార్మికుల ప్రతిఘటన తీవ్రం అవుతూన్నకొద్దీ, పోలీసుల్ని నిరోధించేందుకు వాళ్లేమీ సిద్ధంగాలేనిదీ, వారిలో సంఘటనలేనిదీ కార్మికులకు గోచర మౌతున్నది.

"సాయుధతిరుగుబాటు" చెయ్యాలన్నారు కొందరు. 'దేనితోటీ' 'చప్పుళ్ళతోటా?' అని సమాధానం యిచ్చారు కొందరు "బహుశా మీరు వెడ్డింగులో అంతర్యుద్ధం లేవ దియ్యా లనుకుంటున్నా రేమిటి?" 'అవునోయ్, థామస్ కమ్యూనిస్టు సర్వసేనాధిపతి ఔతాడు. హెర్మన్‌గారు కోలిన్ పేటలోని ప్రజాప్రతినిధి ఔతాడు!'

అందరూ నవ్వారు. సభ్యుల్లో పిరికితనం పోయింది. వాళ్ళంతా శాంతంగా వింటున్నారు. హెర్మన్ చాలగంభీరంగా చెప్పాడు. "మనపార్టీ మనల్నందర్నీ సాయుధ తిరుగుబాటు లేవతియ్యమని ఆజ్ఞ యిచ్చేటప్పుడు మనం ఏవో ప్రాత పిస్తోళ్ళతోటే వుంటాం అని అనుకుంటున్నారా మీరు? కాని కామ్రేడ్స్, ఆవిధంగానే జరుగవలసివుంటే బెర్లిన్ నగరమంతా యీరాత్రికి మరోవిధంగావుండేది! ఈవేళ యీదోపిడీగాళ్ళ బారినుండి మనం స్వరక్షణార్థమై చేసే ప్రయత్నాలు ఎప్పటికి విప్లవం చెయ్యడం కాజాలదు, విప్లవం చెయ్యాలంటే వుండవలసిన పరిస్థితులు వేరు. ప్రజాసామాన్యం చేసే ఆర్థికసమ్మెలు, రాజకీయసమ్మెలు, మొదలైనవి చెయ్యవలసివుంటుంది కాని యీవిషయాలన్నిటిని గూర్చి మాట్లాడు కునేందుకు ప్రస్తుతం మనకి సావకాశంలేదు.

రాత్రి రెండుఝాము లయ్యేటప్పడికి గాని వాళ్లు అంత్య నిర్ణయానికి రాలేకపోయారు ఆసమయంలో ఒక వార్తాహరుడు రొప్పుతుంటూ వచ్చి పోలీసులు మళ్ళీ ఆగిల్లీసి చుట్టముట్టు తున్నారని చెప్పాడు. "రెడ్ నైటింగేల్" లో యింతవరకు వెలుగుతూన్నదీపం ఆర్పివెయ్యబడింది. కిటికీ తెరలు దించేశారు. ఇరుకు సందుగుండా సమావేశమైన కార్మికులంతా వీధిలోకి వచ్చారు.

కర్టు హెర్మన్ దగ్గిర నిలబడి మెల్లిగా అన్నాను గూర్చి మాట్లాడు తున్నాడు. అన్నాను బుర్రమీద కొట్టాలని లాఠీమెత్తిన పోలీసువాణ్ణి నిరాయుధునిగా చేసిన తరువాత కర్టుకు అన్నా సంగతిసమాచారాలు తెలియలేదు. ఇంతక్రితమే "రెడ్ నైటింగేల్"లో ఒక కార్మికస్త్రీ కర్టుతో అన్నాను అరెస్టుచేసి తీసికెళ్ళారనీ కుర్రాణ్ణి ఒకకామ్రేడ్ తనయింటికి తీసుకొని వెళ్లాడనీ చెప్పింది. పోలీసులు అన్నాను చావగొడుతుంటే చూచామని ఒకళ్లు చెప్పారు. అంతే. ఆపైని యేం జరిగిందో యెవళ్ళకీ తెలియదు అన్నా యేమైందో యెవళ్ళూ నిశ్చయింగా చెప్పలేకపోవడం కర్టుకి పిచ్చెత్తిస్తోంది. ఆమె, రహస్యాలు యేమీ చెప్పివెయ్యదు అనేధైర్యం పూర్తిగావుంది అతనికి. కాని పోలీసులసాక్ష్యంతో, తిరుగుబాటు చేసిందనో దౌర్జన్యం చేసిందనో, వాళ్ళపిండాకూడు, ఏదో కల్పించి యేళ్ళతరబడి కఠినవరకం వేయిస్తారేమో అని మాత్రం ఖంగారు పడిపోతున్నాడు.

పోలీసు స్టేషనుకి వెళ్లి కనుక్కొస్తానని కర్టు పట్టుబడితే హెర్మన్ చాలా కష్టం మీద కర్టుని ఆప్రియత్నం నుంచి మానిపించాడు. కర్టు కమ్యూనిష్టు అని అందరికి తెలిసున్నప్పుడు చేతులారా వెళ్లి జెయిలులో పడటం చాలా తెలివితక్కువ అని హెర్మన్ బోధించాడు. ఎప్పుడు, ఎక్కడ, అన్నాను మళ్లీ కలుసుకోగలుగుతాడో తేల్తే కర్టు కూడా

తనంతట తాను వలలో చిక్కుకునేందుకు యిష్టపడి వుండక పోవును.

కర్రిదూలాలు వీధిలో పడవేయ బడుతూన్న దభీదభీ మను చప్పుడు ఆవీధిలో నివశించే వారి నిద్రకు భంగం కలిగించింది. తలుపులు చప్పుడౌతున్నాయి. ఇళ్లముందు ఖం గారుగా పరిగెత్తుతున్నారు. ఒక కిటికీలో నుంచి "ఆగందరి గోళం యెక్కడ?" అని ప్రశ్నిస్తున్నారు. కొందరు తలుపులు తెరుచుకుని కొవ్వువత్తి దీపాలతో గుమ్మాల ముందు సాక్షా త్కరిస్తున్నారు. కర్రతోటీ, యినపకమ్మీలతోటీ "రెడ్ నైటింగేల్" కార్మికులు పనిచేస్తూండటాన్ని యీగందరగోళం యేమిటో చూద్దామని తలుపులు తీసికొని వీధిలోకి వచ్చిన ఆడాళ్లు లాంతర్ల వెలుతురులో చూచారు. పెద్ద పెద్దగెడలు స్తంభాలు మోసుకొస్తున్నారు. కార్మికులు కొద్దినిమిషాల్లో వాళ్లు తలపెట్టిన పనేమిటో అందరికి బోధపడింది. అందరూ పూనుకొన్నారు. కొద్ది నిమిషాల్లోనే పని మహాజోరుగా సాగి పోతూంది.

"ఒకదీపం యిల్లాతీసుకురా" అని ఒకడు కేక వేశాడు. వాళ్ళ కళ్ల ముందున్న చేతుల్నే చూడలేనంత చీకటిగా వుంది. దీపాలు మిణుకు మిణుకుమంటూ ప్రసరిస్తున్నాయి. ఆవెల్తుర్లో నిన్నను వాళ్ల కట్టిన అడ్డుకోటల శిధిలాలని మళ్లీ బాగుచేస్తు

న్నారు ఇండ్ల ముందు నుంచి పనిచేస్తూన్న ప్రదేశంవరకు అనేక దీపాలు యిటూ అటూ తిరుగుతున్నాయి.

కర్రల్ని ముక్కలక్రింద విరగ గొడుతున్నారు. భవన నిర్మాణ కార్మికుని గుడిసె తలుపును బలవంతంగా వూడదీసి ఒక జట్టు కార్మికులు ప్రవేశించారు. "ఏమిటోయ్! కలలు కంటున్నావ్? లే!" అంటూ అక్కడ వున్న గండ్రగొడ్డళ్ళూ పారలూ, గునపాలూ తీసుకున్నారు. బల్లలు, కర్రలు మొదలైన వాటన్నిటినీ మోసుకొని పోయారు.

మొట్టమొదట వీళ్ళందరూ ఉన్మత్తులై పోయారా అని అనుకున్నాడు హెర్మన్! వీధిలో నుంచి వీటన్నిటినీ మనుష్యులు మోసుకొని పోతున్నారు. ఆడాళ్లు లాంతర్లు పుచ్చుకుని హడావుడిగా యిటూ అటూ తిరుగుతున్నారు కుర్రాళ్లు అంతర్జాతీయ విప్లవగీతాన్ని గొంతుకలు వదలి గట్టిగా పాడ మొదలెట్టారు. అక్కడ వాళ్ళందరూ బ్రహ్మాండమైన ప్రదర్శనం చేస్తున్నారా? అనిపిస్తోంది.

"మీకేం మతుల్లేవ్? పాట కట్టి పెట్టండి. పోలీసుల్ని తక్షణమే వెనక కుడమనేమిటీ మీ వుద్దేశ్యం!" అని కోపంతో అరిచాడు హెర్మన్. నాలుగు మూలలా చుట్టుముట్టి పోలీసులు ఉక్కిరిబిక్కిరి బిగించిన సమయంలో అంతర్జాతీయ విప్లవ గీతాల్ని నిశ్శబ్దంగావున్న ఆవీధిలో పాడటంలో అర్థంవుందా? బహుశా మరఫిరంగులు కొద్ది దూరంలోనే వుండి వుంటాయి.

కాని ఆసమయంలో ఎవరు చెయ్యగలిగింది ఏమీ లేదు! బాగా యెండి నెరలు తీసివున్న భూమి నీటిని పీల్చేటం తొందరగా విప్లవగీతాన్ని అందరూ పాడటం మొదలు పెట్టారు. కిటికీతలుపుల్లోంచి బుర్రలు యివతల పెట్టి చేతులూ పుతూ ఆడాళ్లు హెచ్చరిస్తున్నారు. గబ గబా పరిగెత్తుతూ క్రిందకి వచ్చారు వాళ్ళు. వీధులన్నీ పాడేవాళ్ళతోటీ, నవ్వు తూ కబుర్లు చెప్పుకుంటూన్న వాళ్ళతోటి నిండిపోయి వున్నాయి.

ఒక వృద్ధురాలు గాలి తగిలి దీపం ఆరిపోకుండా అన్ని టికంటె అది చాలా ముఖ్యమైన పనిలాగు చేతిని అడ్డంపెడు తూ తంటాలు పడుతూండటం హెర్మన్ చూచాడు. ఆమె పెదవులు మాత్రం కదలుతున్నాయి. ఆవిడ కూడా విప్లవ గీతాన్ని తక్కిన వారితో కలిసి పాడుతూన్నది.

"పిచ్చి......శుద్ధ పిచ్చితనం!" అని హెర్మన్ అను కుంటున్నాడు కాని అదికాదు. ఆయన లోపలి యుద్దేశ్యం.

ఊరేగింపు పీసెన్ స్ట్రాసీలో ఆగింది. వాళ్లు మోసు కొచ్చిన కర్రలు ఇనపకమ్మీలు, బల్లలు, తుక్కుడబ్బాలు, అన్నీ ఎగిరెళ్ళి అడ్డుకోటల మీాద పడ్తున్నాయి. క్రాష్ క్రాష్......రాళ్ల బాటల్లోని రాళ్ళని గునపాలతోటీ పార ల్తోటీ పూడలాగేస్తున్నారు. పాఱలు రాళ్ళమీాద ఖంగు ఖంగు

మని పడుతోన్నప్పుడు నెరుసులు వస్తున్నాయి. పెద్ద పెద్ద రాళ్ళని దొర్లించుకొచ్చి ఆఅడ్డుగోడని బలపరుస్తున్నారు.

"హల్ ........ హా! హీల్ ........ హా! కామ్రేడ్స్ జాగ్రత్త. కాళ్ళమీద పడకుండా చూచుకోండి. పిప్పయిపోతాయి."

ఖంగ్! ఖంగ్!

ఆవీధిలోని అంధకారంలోంచి ఒక పెద్ద గాసులైటుని ముగ్గురు కూలీయువకులు భుజాల మీద మోసుకుంటూ వచ్చారు.

" చూడండి, తప్పుకోండి, తోవయివ్వండి" ఖంగు మంటూ ఒక పెద్ద యినపపైపు రోడ్డుకడ్డంగా పడింది.

"ఏయ్, ఒక దీపం యిల్లాతీసుకురా. గ్రీటీ, యిల్లారా." స్త్రీలు దీపాలు పుచ్చుకుని ఇటూ అటూ పరిగెత్తుతూ అడిగిన వాళ్ళందరికీ వెలుతురు చూపిస్తున్నారు. హఠాత్తుగా 'తడ్' మని శబ్దం వినపడి ఒక తారాచువ్వ పైకి లేచింది.

"అందరూ క్రింద పడుకోండి" అని ఒకడు అరిచాడు. కొన్ని క్షణాలు ఆవీధి అంతా వెలుర్తో నిండిపోయింది. గబగబా కొందరు యిళ్ళల్లో దూరారు. ఆవెలుతురుబంతి అడ్డుగోడ ముందుపడి బుస్సుమంటూ ఇటూ అటూ కొట్టుకొని ఆరిపోయింది. పోలీసులు ఏంజరుగుతూన్నదో తెలుసుకుని వచ్చేందుకు కొందర్ని ముందుపంపారు. తుపాకులు ప్రేలుస్తే తా

మెక్కడ వున్నామో తెలిసిపోతుందనే భయంతో వాళ్ళు కాల్చడం మొదలెట్టలేదు.

ఇళ్లకి బాగా దగ్గరలో కట్టబడిన అడ్డుగోడ ముందు ముగ్గురు చాలా జాగ్రత్తగా వెతుకుతున్నారు. పీసెన్‌స్ట్రాసీ మలుపులో చప్పుడు లేకుండా గోడకు అంటిపెట్టుకొని ముగ్గురు కార్మికులు పోలీసులు యెక్కడవున్నదీ పరీక్షిస్తు న్నారు. వాళ్లు ఒక తలుపు ముందు పరుగెత్తుతున్నప్పుడు యూనిఫారముల మీద వున్న వెండిబొత్తములు తళతళ లాడి పోలీసుల్ని పట్టిచ్చాయి. వెంటనే అడ్డుగోడ వెనక్కాలున్న దీపాలు ఆరిపోయాయి.

పెంగ్ ..........పెంగ్!

కార్మికులు పోలీసులు ఒకళ్ల మీద ఒకళ్లు తీవ్రంగా తుపాకులను పేల్చుకొన్నాక పోలీసులు కాలికి బుద్ధి చెప్పారు. అడ్డుగోడ వెనక్కాల పని జరిగిపోతోంది... ...

దొంగచాటుగా కార్మికుల్ని పరీక్షిస్తూన్న పోలీసుల్ని బెదరగొట్టిన తరువాత కర్టు తక్కిన యిద్దరు కార్మికులతోటీ వెనక్కి వచ్చాడు. పోలీసులిక్కడ యేమి జరుగుతూన్నది కనిపెడుతూన్నారు కాబోలు అని కొద్దిగా ఖంగారు పడ్డాడు. హెర్మన్‌తో నాలుగు ముక్కలు చెప్పి మళ్లీ చీకట్లో మాయమయ్యాడు.

## అన్నా

"రెడ్ నైటింగేల్" క్రింద అంతా నిశ్శబ్దంగా వుంది. రోడ్డుకి రెండువైపుల వున్న రాళ్లబాటలోని రాళ్లన్నిటినీ కార్మికులు ఊడపీకారు. రోడ్డుమీద పెద్ద పెద్ద రాళ్లు చెల్లా చెదరుగా పడున్నాయి.. కారు యేదీ కూడా యిక్కణ్నుంచి వెళ్లలేదు. కట్టూ వాళ్లకి యిక్కడేమీ సందేహాస్పదమైన విషయం కనిపించ లేదు. జాగ్రత్తగా ముందుకు సాగిపో యాడు. ఒక సందులో కొందరు స్త్రీలు నోళ్లు నొక్కుకుంటూ గుస గుస లాడుకుంటున్నారు. అబ్బ — ఇక్కడ కూడా అంతా సవ్యంగానే వుంది.

రీనిక్కేండార్ఫర్ స్ట్రాసీ చీకటిగాను, నిశ్శబ్దంగానూ వుంది. నెట్టెల్ బెక్ ప్లాజ్ దాటి వీధిలోకి ఒక టాక్సీకాబ్ టక టక మని చప్పుడు చేసుకుంటూ వచ్చింది. అది వెడ్డింగ్ స్ట్రాసీ లోకి వచ్చేటప్పుడు దాని తల దీపాలు వెలిగి ఆవీధినంతా ప్రకాశమానం చేశాయి. "ఏయ్, ఆపు!" అని ఒకరు గద్దిం చారు. తక్షణమే ఆగింది. ఒక రాయి రుంయ్‌మంటూ ఎగి రొచ్చి ఆదీపం అద్దం మీద పడి, ముక్కల్ని చేసింది. తక్ష ణమే ఆదీపాల్ని ఆర్పేసి టాక్సీని వెనక్కి పట్టించి శరవేగంతో పరిగెత్తి మాయమైంది.

అన్నా

కట్టు పళ్లసందుల్లోంచి యీలవేశాడు. దైవవశాత్తు ఆకారు రాలేదు అక్కడికి. నెట్టెల్ బెక్ ప్లాజ్ దగ్గర పోలీసులు మకాంచేశారు యేమిటి? అని అనుకుని వేగంగా వెనక్కి పరుగెత్తాడు.

---

# అన్నా

95 వ పోలీసుస్టేషన్ చీకటి సందులోంచి పోలీసుల ఉక్కు శిరస్త్రాణాలు బయట పడుతున్నాయి. ఇరవై, ముప్పై ముఖాల మీదికి వాలివున్న శిరస్త్రాణాల అంచులు లోపల వున్న ముఖాలను కప్పుతున్నాయి.

వెలుగుతూన్న సిగరెట్టుపీకె క్రిందకు పడింది. దుర్భేద్యమైన అంధకారం పోలీసుల్ని మ్రింగివేసింది. తుపాకులు, సన్నీలు, పటపటమని ధ్వని చేస్తున్నాయి. ఛాయలవరుస ఒకటి బయల్దేరి చడీచప్పుడూ చెయ్యకుండా యిళ్ళదగ్గర్నుంచీ బ్రిడ్జివరకూ నడిచాయి. ఆబ్రిడ్జికావతల వున్న వీధిమలుపులో వీసెన్‌స్ట్రాసీవుంది. అక్కడ ఆగి వేచివున్నారు. బిగుతుగావున్న యూనిఫారమ్ తొడుక్కున్న ఒక బలమైన వ్యక్తి చప్పుడు చెయ్యకుండా ముందుకు కొద్ది అడుగులు వేశాడు.

ఆయుద్యోగస్తుని ముందు నిర్జనమైన అంధకారపు స్ట్రాసీ యున్నది. ఎడంవైపున కొంచెం క్రిందుగా వుంది ఆవీధి! ఆవీధి ఒక వైపున మాత్రము కొద్ది దీపాలు మిణుకుమిణుకు మంటూ అస్ఫుటమైన కాంతినిస్తున్నాయి. అప్పుడప్పుడు అస్పష్టమైన

మాటల్ని మోసుకొస్తున్నాయి మహావాయువులు. ఉక్కు శిరస్త్రాణం క్రిందనుంచి ఒకజత కళ్ళు ముళ్ళని, ముళ్ళపైకప్పులని వెతుకుతున్నవి కాని వృథాప్రయత్నమైంది. భవనాలు ఆకాశము ఒకేఒక మృదువయిన దుర్భేద్యమైన గోడలాగున్నాయి.

అతని వెనుక స్మశాన నిశ్శబ్దత ఆవరించి వుంది. పోలీసులు గొప్పభవనాల అరుగుల మీద చాలా వెనక్కాల వున్నారు. ఆబ్రిడ్జి వెనుక వీధిలోని యిళ్లు అన్నీ ఛాయచాటున అంధకారపు తెరలో చుట్టబడి వున్నాయి.

చేతితుపాకులు పోలీసులబెల్టుల్లో ప్రేళ్లాడటానికిదే మొదటి సారి. వాళ్ళు నడిచేటప్పుడు కదలేటప్పుడు, తుపాకి కర్రమడమలు పొట్టలకి గ్రుచ్చుకుంటున్నాయి.

ఆయుద్యోగస్తుడు వెనక్కితిరిగి వచ్చాడు. వాళ్ళ చెవుల్లో కొద్ది ఆజ్ఞలు గొణిగాడు. తుపాకి యంత్రాలను వెనుకకు లాగారు పోలీసులు. అప్పుడు చిన్నక్లిక్ శబ్దం అయింది.

"వరుసలో నిలబడండి!"

ముందున్న ఐదుగురు చేతితుపాకులను మెడలో తగిలించుకున్నారు. ఎడమప్రక్క నున్నవారిలో ఐదవవాడు సార్జెంటు ప్లాప్స్కిన్స్. అతని చేతులు యిప్పుడు వణకుతున్నాయి. ఒకత్రాడు చివర కట్టబడివున్న చిన్నచైనాబంతి అతని చేతివణుకుమూలాన్ని ఇటూఅటూ ఊగిసలాడ సాగింది.

ఆగుండు ద్వారానే ప్రేల్తుంది. దాన్ని ముట్టుకునేందుకు కూడా హడలి పోయేటంత ఎక్కువగా వణుకుతున్నాడు. దేహం యావత్తూ కంపిలుతూంది. పొరపాటున ఒకరు చెయ్యివిసరుతే యీతనికి ఫెడేలున లెంపకాయ తగిలింది. అతను ఉలిక్కిపడి చేతులోవున్న గుండ్లసంచి జారవిడిచాడు. అవ్వన్నీ కటకట మంటూ క్రిందపడి దొర్లుకుపోయాయి. కోపంతో, మండిపోతూ అధికారి శాపనార్థాలు పెట్టాడు. హఠాత్తుగా ఎడంవైపున అక్కడక్కడ వెలుగుతూన్న దీపాలు కూడా ఆరిపోయాయి. "చచ్చువెధవా! చూడు ఏంచేశావో!" ఆయధికారి వెంటనే తనరివాల్వరు పైకి వూడబెరికాడు. అతని తీవ్రమైన కంఠధ్వని నిశ్శబ్దతను చీల్చుకుని బయటపడింది.

"కాల్చండి"

తుపాకి గుండ్లు రంయ్‌మంటూ వీధివైపు వెళ్ళాయి.

"వాళ్ళమీాదకి నడవండి — ముందుకి! ముందుకి!"

అరుస్తూ నోళ్ళు తెరచి ఆయంధకారంలోకి జొరబడి పరుగెత్తారు. "హూ — హూ — ఓ ...... ఓ! కిటికీ తలుపు మూసెయ్యండి"

ష్లాప్‌స్కినస్ కాళ్ళకి అడ్డంపడింది. అతని శిరస్త్రాణం ఒకడికి తగిలింది. భయంతో వెర్రికేక పెట్టాడు. అతని చేతుల్లోంచి చేతితుపాకి జారి పోయింది. ఆలోచన లేకుండానే పరిగెత్తనారంభించాడు. అతని వెనుక కొద్దిగజాలలో ఒక

బాంబు ప్రేలింది బాటమీద. రాళ్ళముక్కలు, మట్టిబెడ్డలు అతణ్ణి ముంచెత్తాయి.

వీధి ప్రవేశం దగ్గిర చేతితుపాకులపేలుడు శబ్దం చెవులు గింగుర్లెత్తిస్తూంది. ఆవీధి, ఇళ్లు, గోడలు, పైకప్పులు ఆరాత్రి అన్నిటిలోనూ జీవితం వచ్చింది. రాళ్ల బాటమీది రాళ్లు బద్దలౌతున్నాయి. రివాల్వర్ల నిప్పులు కక్కుతున్నాయి. ష్లాప్‌స్నిస్‌కు అతిసమీపంలో ఒక యినప వస్తువేదో పడ్డది. అతని నెత్తిదగ్గిరనుంచి వెళుతుంటే దానిగాలి తగిలింది. అతడు పైకి చూచేందుకు ప్రయత్నించాడు. ఆయిన పక్కల్లాయి క్రింద వుంటే వినపడదు. కనపడదు. బహుశా యిళ్లల్లోనుంచి యేమన్నా విసుర్తున్నారేమో రక్షణ వుంటుందని యిళ్ల దగ్గర్నుంచి పరుగెత్తుతున్నాడు. ఆవీధి చీకటి రంధ్రం లోనుంచి బొబ్బలు యెడతెరిపి లేకుండా వినపడుతున్నాయి... పెంగ్......పెంగ్ టక్—టక్—టక్—టక్......మరపిస్తోళ్లు మానవులనడిని ముంచెత్తేస్తున్నాయి. ష్లాప్‌స్నిస్‌కి అధికారిఆజ్ఞ చాలాదూరంలో వినపడుతూన్నది. ఇప్పుడు ష్లాప్‌స్నిస్‌కు ఎవళ్లూ కనపడలేదు. అతడు భయంతో ఉక్కిరిబిక్కిరౌతున్నాడు. తాను ఒంటరిగా నున్నాననే భావం భయభ్రాంతునిగా చేస్తున్నది. భయంకరమైన ఆవీధి లోనుంచి—నరకం నుంచి బయట పడ్డాడు. ఆసమయంలోనే ఒకఛాయ అతని దగ్గర్నుంచి గబగబా పరుగెత్తింది. వెనక్కి

వెడదామా? ముందుకా? అనేఆలోచనతోచక కొట్టుకుం టున్నాడు.

అకస్మాత్తుగా ఒక దూలం రాత్రిచేత వమనం చెయ్య బడినట్టు బూలధ్వనితో రాళ్ళబాటమీద పడింది. ఇంకా చా లామంది అతని దగ్గరనుంచి పరుగెత్తుతున్నారు. పోలీసులా? కమ్యూనిస్టులా? చప్పట్లుచరుస్తూ వాళ్ళని పిలిచాడు. ఎవ్వరూ వినిపించుకోలేదు. అతనిపాదాలు భూమిమీద తాపటం చె య్యబడ్డాయి. పరిగెత్తలేక పోతున్నాడు. బాంబుప్రేలుళ్లు తుపాకుల ఢాం ఢాంలు అతనిచెవుల్లో గింగుర్లెత్తుతున్నాయి. ఒకరాయి రింవుమంటూ వచ్చి అతనిశిరస్త్రాణానికి తగిలి ఎగిరి క్రిందపడ్డది. "ఏయ్, ఏయ్ ఆగు ఆగు" అని వెర్రికేక పెట్టాడు. వీధికడ్డంగా తూలుతూ పరుగెత్తుతున్నాడు. "నాబుర్రలో ఒకతుపాకి గుండు దూరింది — ఇంకా బుర్రలోనే వుంది — బుర్రంతా పప్పుపప్పైంది — ఇంకేమిటి? చచ్చానురా బాబు......"

బ్రిడ్జి దగ్గరనుంచి ఒకదాని వెనుక ఒకటిగా రెండుసార్లు చాలవేగంగా అధికారి యీల మ్రోగుతోంది. పోలీసులు దూకుతూ వేగంగా వెనక్కి మలుపు దగ్గరకి పరుగెత్తారు. వా ళ్లుచేసిన దాడి నిష్ఫలం అయింది.

ఇరుకు అంతస్తుమీద వున్న కార్మికులు త్రోవయిచ్చి తొలగి నిలబడ్డారు. ఒక క్షతగాత్రుణ్ణి కొందరు మోసుకొచ్చా

రు. ఒకస్త్రీ ఎలెక్ట్రిక్ టార్చి వేసింది. ఇద్దరు కాళ్ళు, నడుము ఒకడు తల వీపు పట్టుకొని మోసుకొచ్చారు.

“అబ్బబ్బబ్బ......ఓ......ఓ!”

ఆమెల్లటి మూలుగు ఆయింట్లో ప్రతిధ్వనిస్తోంది. మొదటిఅంతస్తు మీద హెర్మన్ నిలబడి తలుపు తెరిచాడు. అప్పుడే అక్కడ చాలమంది పడున్నారు.

భయవిహ్వాలులై కిమన్నాస్తిగా నిలవబడివున్న స్త్రీల ముఖాలమీద ఆటార్చిలైటు కాంతి ప్రసరించింది.

“ఆడుగో, అతను, ఆటో” అని తలుపు మూసివేయ బడిన తరువాత ఒకస్త్రీ తక్కినవారితో వినీవినపడనట్లు గొణిగింది.

హెర్మన్ మేజాబల్లమీద ఆహతభాగ్యుని పడుకోపెట్టించాడు. ఒకడు ఒక తలగడ అతని బుర్రక్రింద పెట్టాడు. ఇపుడు సరిగా గాయాన్ని పరీక్షింపగలిగేందుకు వీలుకలిగింది. లాగుక్రింది భాగం తుత్తునియలై రక్తపుమరకల్తో కూడిన పేలికలాగున్నది.

అతడి మడమ పూర్తిగా ముక్కలైపోయింది! హెర్మన్ కట్టుకట్టే నారగుడ్డ బీరువాలోంచి తీశాడు. ఆకట్టు గుడ్డలు యిదివరకు అనేకసార్లు వుపయోగింప బడ్డాయి. మాంసం ముక్కల్ని, చిట్లినయెముకనీ చేతనైనంత బాగాకట్టేందుకు వారుశ్రమిస్తూన్న సమయంలో ఒకపడుచు సీమసుద్దలా తెల్ల

జారిన అతని. దవడలను నిమురుతూన్నది. ఆమె వ్రేళ్ళు చేతులు అన్నీ కపించి పోతున్నాయి.

ఈ కార్మికవడుచు ఎవరో ఎవళ్ళకీ తెలియదు. ఆవిడ ఆవీధితో నివశించడంలేదు. ఈ రాత్రి పిల్లల్ని జోకొట్టి నిద్ర పుచ్చేందుకు, గాయాలు తగిలినవాళ్ళకి కట్లుకట్టేందుకు, అనేక పర్యాయాలు ఆవిడ తిరుగుతూన్నప్పుడు, హెర్మన్‌కు చూచిన జ్ఞాపకం. కొంతసేపైన తరువాత కర్ట హెర్మన్‌ను కలుసుకొని మాట్లాడుతూన్న సందర్భంలో, ఆమె ఒక సోషల్ డెమాక్రాటిక్ పోగాకు కార్మికుని పడతిఅనీ, ఆమె మానాలిస్‌లో నివశిస్తుందనీ, ఆమె ఒక యువక కామేడ్‌తో నెటెల్ బెక్ ప్లాజ్‌లో మాట్లాడుతూన్నప్పుడు చూచాననీ చెప్పాడు.

తెల్లవారుఝాము నాలుగు గంటలు అవవస్తూన్న సమయంలో పోలీసులు, ఓటమినో, విజయాన్నో తేల్చివేయు దాడిని సలిపారు. ఎనిమిది టాక్సీలు ఒకదాని తరువాత మరొకటి మిక్కిలి వేగంతో తిన్నగా అడ్డుగోడలమీదకి పరిగెత్తాయి. నెటెల్ బెక్ ప్లాజ్ దగ్గర కాపుకాస్తున్నవారు సందేహించకుండా వాటిని వెళ్ళనిచ్చారు.

అడ్డుగోడల మీదవున్న కార్మికులు క్రిందకుదూకే నిరపాయస్థలం చేరుకోగలిగే లోపుగానే ఆటాక్సీల్లోనుంచి సాధారణదుస్తులు ధరించిన పోలీసులు క్రిందకుదూకి కాల్చడం ఆరంభించారు. వాళ్ళచేతుల్లో పడిన పదముగ్గురు కార్మికులమీద

తుపాకులు బారుచేసి వుంచి ఆయుడ్డుగోడల్ని పీకివేసి సోదా చెయ్యకపోతే కాల్చేస్తాం అని వారిని ముందుకు పోలీసులు తోసిలారు, కార్మికులు ప్రేల్చేగుండ్లు పోలీసుల మీద పడకుండా ఆఖైదీలు రక్షణగా వున్నారు. మొదటిదాడి జరుగుతూన్న సమయంలో కర్టు దగ్గిర ఒక పిస్తోలు వుంది. అతని పెద్ద చేతుల్లో అదొక ఆట బొమ్మలా వుంది. ఎల్లాఅయినప్పటికీ తాను పూర్తిగా నిస్సహాయుడుగా లేనని ఆనందించాడు. కాని యిప్పుడు జేబులో చూచుకుంటే తాను యినపకమ్మీలని మోసుకొచ్చేటప్పుడు దాన్నెక్కడో పోగొట్టుకున్నట్లు తెలుసుకున్నాడు. మరొకటి చేతికి వచ్చే అవకాశం లేదు. ఎంత తిట్టుకుంటే మాత్రం ఏమి ప్రయోజనముంటుంది? అందుచేత వాళ్లని డబాయించాలి. బుఖాయించాలి, అనుకున్నాడు. "ఆమురా కుందేటి చప్పుళ్లకి కూడా బెదిరి పోతున్నారు" అని అనుకుంటూ నిర్మానుష్యమైన ఆవీథి మధ్యలో మోకాళ్లమీద కూర్చుని యిళ్లని తగలబెట్టే టోపీలు తీశాడు. ఒకదాని మీద మరొకటిగా ఒక చటాకితి మీద పేర్చాడు.

పెంగ్.........పెద్ద ధ్వనిని చేశాయి అవ్వి! తరువాత మరొక దానిని చిన్న రాతితో కొట్టాడు. పెంగ్...! ఆటోపీలని పేల్చి ఢాం ఢాం అని పించడంలో గొప్ప నిపుడయ్యాడు.......! ఆతరువాత మూడు నాల్గు యిత్తడి టోపీల్ని కలిపి కొట్టడం ఆరంభించారు. ఢాం! డాం......!

ఇప్పుడు నిజంగా తుపాకి గుండ్లు పేల్తూన్నట్టే ధ్వని వో తూన్నది.

"స్సస్స......ఫ్ఫ......ఫూ......బాంక్!" అని హెర్మన్ చెవుల చుట్టూ ధ్వని చేస్తున్నాయి పోలీసుల తుపాకి గుళ్లు ఆయి త్తడి టోపీల ఢాం ఢాంలు నిజమైన తుపాకిగుండ్లే అనుకుని పోలీసులు మెడ తెరిపి లేకుండా తీవ్రం గా కాలుస్తున్నారు ఆతనివైపు.

ఎడమ, కుడి వైపుల నున్న రాళ్ళ బాటల మీద, సీసపు గుళ్ళు పడుతూన్నా ఖాతరు లేకుండా కర్ట ఒక్కడే కూర్చున్నాడు. వాళ్ళు అతనివైపు కాల్చడం జోరు చేసిన కొద్దీ కర్టు రెచ్చిపోతున్నాడు. ఆవీధి గాఢాంధకారమయమైన రంధ్రం లాగుంది. కాబట్టి ఏగుండైనా దైవవశాత్తూ తగలవల సిందే కాని గురిచూచి ప్రేల్చ లేదు. తన రెండుచేతుల నిండా కాలిన నల్లటి మచ్చలుండటం చూచుకోనే లేదు. తాను కొట్టి నప్పుడల్లా అవి ఢాం ఢాం అని ప్రేలుతూండటం మాత్రమే గమనిస్తున్నాడు. కాని యింకేదీ అతని యేకాగ్రతను చెదర గొట్ట కలగడంలేదు. ఢాం ఢాం అని పేలుస్తూండటమే ముఖ్య కార్యం, తాను ప్రేల్చినంత కాలమూ ఆపోలీసువెధవలు వీధిలో జొరబడేందుకు సాహసించ లేరు. ఈసమయంలో పోలీసులు వీధి ప్రవేశంలో సురక్షితమైన స్థలంలో నిలబడగలిగారా, సర్వ

నాశనం ఐందన్నమాటే. ఆవిలకలబోనులో నుంచి ఒక్కడు కూడా తప్పించుకు బయటపడలేదు.

ఒక పావుగంట తరువాత పోలీసులు వారి ఖైదీలతో మెల్లిగా వెనక్కి నడిచి వీసెన్ స్ట్రాసె పరిసరాల్లోవున్న యిండ్ల వద్ద మకాం చేశారు. నగంవరకూ శిధిలమైన ఆఅడ్డుగోడ మీద తుపాకి గుండ్లవర్షం కురిపిస్తూనే వున్నారు. ఆఅడ్డుగోడ వెనక్కాల కదలిన ప్రతిఛాయమీద, మరపిస్తోళ్ళు గుండ్లను కురిపిస్తూనే వున్నాయి.

కుయుక్తితో వన్నిన యీసైన్యవిన్యాసంలో చిక్కుకుని ప్రతిఘటించకుండానే కార్మికులు అతిముఖ్యమైన తమ స్థలాన్ని పోగొట్టుకొన్నారు.

‡ ‡ ‡ ‡ ‡

పైఅంతస్థులోకి తడుముకుంటూ మెట్లమీద ఎక్కి వెడుతున్నాడు. హఠాత్తుగా అతని చెయ్యి పాడలుతో ముడుచుకుపోతూన్న ఒకబాలిక వెచ్చటి, మృదువైన ముఖంమీద పడింది. తలవని తలంపుగా జరిగిన యీసమావేశం వారిద్దరిలోనూ శత్రుభావాన్ని రేకెత్తించింది. చల్లటి ఏకాకిత్వం మధ్యలో ఒక మానవదేహం యొక్క సాన్నిధ్యం ఒక క్షణం విచారాన్ని కలిగించింది. మానవదేహం! అది ఎవ్వరిది? అనే

భావానికి తావు లేదు. ఆదేహిసన్నితత్వం అతని యింద్రియా లకి పని కల్పించింది.

ఈక్షణాన్ని రేపు జరుగనున్న సంఘటనలని గూర్చి మొట్టమొదట శాంతంగా వితర్కించుకున్నాడు అతడు పోరాట కార్యక్రమంలో సంపూర్ణంగా తననుతాను మరిచి పోయాడు, కనుక ఒక మరఫిరంగి అక్షయమయ్యే గుండ్లసంచి యీ రెండూ అతడు కోరుకుంటూన్న కోరిక. రాజకీయవాతా వరణంలో, యీసంఘటనలకుండే ప్రాముఖ్యతను గూర్చి అతడు పూర్తిగా మరిచి పోయాడు. ఇప్పుడు ఆఆలోచనలన్నీ అతి స్పష్టంగా అతనికి తట్టుతున్నాయి.

ఒక పావుగంటవరకూ అంతాకూడ కిమ్మన్నాస్తిగా వుంది. వీధిబయట నిశ్శబ్దంగాను, నిర్మానుష్యంగాను, అంధ కారమయంగాను ఉన్నది. ఒక్క పాదధ్వని కూడ వినపడటం లేదు. ఒక్క తలుపు కూడ కిరకిర లాడటం లేదు. ప్రతిచోట చడీచప్పుడు చెయ్యని అగోచరమైన ముఖాలు అంధకారంలోకి పరీక్షగా తదేకదృష్టితో చూస్తున్నాయి. మెట్లమీద, అంత స్థుల్లోను ప్రజలు నిలబడి వేచివున్నారు. ఏదో వినపడటం లేదనే భయంతో హఠాత్తుగా ఊపిరి బిగపట్టినట్టుగా వుంది యిదంతాచూస్తే, కాని అంతా శాంతంగా వుంది — భరింపలే నంత శాంతంగా వుంది. మళ్ళీ కాల్చడం మొదలెడ్తేనే బాగుం డేట్లా వుంది.

గోడకు జార్లబడి నిలబడిన ఆపడతి "ప్రొద్దుపొడిచే లోపుగా పోలీసులు రారు" అని శాంతంగా అంది. "ఏం, వస్తే రావచ్చును."

ఒకళ్ళ కొకళ్ళు కనపడక పోయినా కర్ట్ యింకా ఆమె ముందే నిలబడి వున్నాడు. ఈశాంతమైన గంభీరస్వరం అతనికి ఉపశమనం కలిగిస్తోంది. తన చేతికి తగిలింది అన్నాయే అనుకున్నాడు, ఒకక్షణం. ఆమె యిప్పుడు ఎక్కడవుందో ఎవ్వరు చెప్పగలరు? ఇంతవరకూ అప్పుడప్పుడుగాని ఆమె విషయం జ్ఞాపకమే లేకపోవడం అసామాన్య విషయమే. బహుశా, ఆమె వీధిలో తమ యింట్లోనే వుంటే, ఆమెను గూర్చి ఎక్కువ ఆదుర్దా పడి వుండేవారు. ఇండ్లను వదలి వీధుల్లోకి వెళ్ళినవారు బహుశా మరణించి వుండవచ్చును. ఆఅమ్మాయి కంఠస్వరం ఎప్పుడో విన్నట్లే కర్టుకు తోస్తూ వున్నది. చాలా అలసిపోయి వుండటం మూలాన్ని ఆవిష యాన్ని గూర్చి ఏమీ ఆలోచించ లేకపోయాడు. ఐనా అది అట్టే ముఖ్యమైన విషయంకూడా కాదు.

పైఅంతస్థుమీద తలుపులు తెరవబడి పైన ఎవరో గుస గుస లాడుకుంటూన్న శబ్దం వినపడుతూన్నది. అప్పుడు కొందరు చప్పుడవకుండా అడుగులువేస్తూ క్రిందకు దిగు తున్నారు.

"బహుశా, అటోనే మ్రోసుకు వస్తూండ వచ్చును. అతని తల్లికి యీసంగతేమీ తెలియదు. అటో వార్తాహరుడుగా పంపబడ్డాడని మాత్రమే ఆమెకు చెప్పబడింది"

ఆగదిలో ఒక టార్చిలైటు ప్రసరించింది. పైఅంతస్తు మీద నుంచి ఒక సవారీ మ్రోసుకొని పోబడింది. ఆసవారీని ఆగదిలోంచి దొడ్లోకి, అక్కణ్ణుంచి పాంకీవైపు తీసికెళ్లారు. ఆసమయంలోనే పైని కిటికీ తలుపులు తెరచుకొని ఒకవ్యక్తి వంగి చూచి ఏమి కనుపడటంలేదు కనుక, మళ్లీ తలుపులు వేసుకున్నాడు. ఆక్షతగాత్రుని మోసుకొని పోతూన్నవారు సద్దుచెయ్యకుండా దొడ్డిత్రోవని వెళ్లారు.

"దొడ్లోంచి నువ్వుకూడా ఎక్కడికేనా వెళ్లేందుకు ప్రయత్నించుచు" కర్ట ఆఅమ్మాయితో చెప్పాడు. అతనికేమీ సమాధానం చెప్పకుండానే ఆమె వెళ్లిపోయింది. గమ్మత్తుగావుంది. ఎవరితో తాను మాట్లాడాడో కూడా కర్టకి తెలియదు.

---

# ఆజ్ఞ

"బెర్గెన్, ఇంకా రిపోర్టు ఎందుచేత రాలేదు?"

"ఇప్పుడు పది నిమిషాలు తక్కువ ఆరుగంటలే కదండి అవుత?" అని సమాధానమిస్తూన్న ఉద్యోగి తనకుర్చీలో తిన్నగా కూర్చోవాలని చాలా కష్టంతో ప్రయత్నిస్తున్నా, కునికిపాట్లు తప్పడంలేదు. అనేక టెలిఫోనులు అతని ముందు న్నాయి. అవన్నీ తిన్నగా అలెగ్జాండర్‌ప్లాజ్‌లో వున్న ముఖ్య స్థానానికే కలపబడి వున్నాయి.

అది చాలా విశాలమైన గది. చాలా బాగా అలంకరించబడి వుంది. ఆగదిలో క్రింద పరచబడిన తివాసిమీద అటూ ఇటూ పోలీసు ప్రెసిడెంటు పచార్లు చేస్తూన్నాడు. ఆదుర్దాతోటీ, నిద్రలేమితోను కూడుకొన్న వింతవాతావరణం అతణ్ణి ఆవరించివుంది. నిస్సహాయ, అస్థిరత్వముల చేత ఆవాతావరణపు బిగి మరీయెక్కువైంది. టెంపెల్‌హోఫ్‌లో వున్న పోలీసుప్రెసిడెంటుగారి విలాస గృహంముందు పహరా జోరు చెయ్యబడింది. పహరా జవాన్లు రహస్యంగా మాట్లాడుకుంటూంటే పోలీసుప్రెసిడెంటు గది గుమ్మందగ్గిర ఆగి వినాలని

ప్రయత్నిస్తున్నాడు. దుస్సహమైన ఆరాత్రి నిశ్శబ్దతను చీల్చేందుకూ, ఆరాత్రిని గడపివేశేందుకూ, రేడియోనో, గ్రామఫోన్‌నో వేశి గడపివేశేవాడే!

పడకకుర్చీలో ఉన్న ఉద్యోగి మళ్లీ నిద్రపోయ్యాడు. ఆరాత్రి మొత్తంమీద మూడుసార్లు దేశీయవ్యవహారమంత్రి ప్రెసిడెంటుతో "మీకవసరమైతే రచ్‌స్వేర్‌ను పంపిస్తాం. సైనికులంతా సిద్ధంగావున్నారు" అనిచెప్పినా, ఆతడు నిరాకరించాడు. రాత్రి రెండు ఝాములు దాటినతర్వాత పోలీసు సేనానాయకుడు మే 3 వ తేదీ ఉదయం లోపుగా కార్మికుల్ని ప్రతిఘటించకుండా చావమోదేస్తాం, అని ధైర్యంతో చెప్పాడు. ఒక పది నిముషాల తరువాత పోలీసుకమాండరు, ప్రెశిడెంటు దగ్గరనుంచి సంపూర్ణాధికారాలు తీసుకొని కారులో వెళ్లిపోయాడు. ఇంతవరకూ ఏమిజరిగిందో తెలుకోనేందుకు ఏమీ రిపోర్టులు పంపించలేదు. పరిగెత్తికొని వెళ్లి కనుక్కొని రావాలని వుంది. కాని కమాండరు, ప్రెశిడెంటు రాకూడదు అని పట్టు బట్టాడు.

ఆయన చుట్టను అవతలకు విసిరేశాడు. ఆహొగాకు ఘాటుకి తట్టుకోలేకపోతున్నాడు.

"బెగ్గెన్, టైమెంతైంది?"

ఆఉద్యోగి అదిరిపడిలేచాడు. "రెండునిమిషాలు తక్కువ ఆరండయ్యా!" ఒకక్షణంఆగి "కొంచెం నల్లకాఫీ తాగడం

మంచిదనుకుంటూనండయ్యా!" అన్నాడు. ప్రెశిడెంటు వినిపించుకోలేదు. అంతా సవ్యంగానే జరిగితే, బహుశా, నాకింకో రెండురోజులు అదనంగా శెలవు దొరుకుతుంది. కాని యీ యిన స్థితి వెయ్యేళ్ళకైనా నాకక్కర్లేదు. మహాదొడ్డ సోషల్ డెమాక్రాట్! అని అధికారి అనుకున్నాడు. అటుపైని మళ్ళీ నిద్రతో జోగుతున్నాడు.

ప్రెశిడెంటు కిటికీదగ్గర నిలబడ్డాడు. ముఖమలు తెరను ప్రక్కకు తొలగించాడు. ప్రథమారుణకాంతులు లోపలికి ప్రసరించి, ఎలెక్ట్రిక్ దీపపు పచ్చటికాంతిని కళావిహీనం చేస్తున్నాయి.

ఇనపతలుపులు బయట, మంచుతో ముద్దైపోయిన, గస్తీ పోలీసులు కనిపించారు. మడమలతో నేలమీద తంతున్నారు. వంట్లో వేడిపుట్టేందుకు, భవనం చుట్టూవున్న పూలతోటని అరుణోదయపుకాంతి వెల్లువముంచెత్తింది. మే మూడవతారీఖు!

ఆకిటికీ అద్దాలతలుపుమీద ప్రెశిడెంటు లావుపాటి ముఖాన్ని ఆన్చాడు. పోలీసుప్రెశిడెంటు యిదివరలో రిక్షా కూలీ కనుక పనిలేకుండా గంటలతరబడి వేచివుండటం, మహా ద్రావకంవలె ఆతన్ని పశుత్వంలోకి చొరుచుకుపోయింది.

అరుణోదయపు వెలవెలలాడే కాంతి ఆక్రమించింది. టెలిఫోనుగంట మ్రోగింది.

# అన్నా

ఆడుద్యోగి ఛటాలున ఎగిరి లేచి రిసీవరు తీశాడు.

"హల్లో...... హల్లో ...... ఔను. ప్రెశిడెంటుగారి గది. ఔను......మాట్లాడుతూన్నది......ఔను. ఔను. తక్షణం!" రిసీవరును చేత్తోపట్టుకుని వెనక్కితిరిగాడు.

"ఉత్తరజిల్లానుంచి సైనికులుకూడా పోరాటం సాగిస్తున్నారు!—సార్! ఐదునిమిషాలనుంచీ కాలుస్తున్నారు.

అలసటతో వ్రాలిపోయిన ప్రెశిడెంటుగారి ముఖం కొంచెం తేరుకుంది—ఆయన చిరునవ్వు నవ్వాడు.

3 వ నంబరు గదిలో పెద్దపెద్ద అంగలువేస్తూ గ్రీటీ క్రిందికి దిగుతూన్నది. ఆమె వెనక్కాల మానొలీస్‌నుంచి వచ్చిన కార్మికపడతి దిగుతూంది. ఆమె కేశములు తుమ్మెద రెక్కలవలె నల్లగా వున్నాయి. గది తలుపులులోపల గడియ పెట్టబడివున్నాయి. ఒక యినపబాల్చీ మెట్లమీద పడి ధ్వని చేస్తూ దొర్లుకుపోయింది. అనుగున వీధిలో మరఫిరంగి చేసే బ్రహ్మాండమైన ధ్వని యిళ్ళని ఊపేస్తోంది.

టక్ ...టక్ ...టక్ ...టక్ ...ర్ ర్ టక్ ...అని మొరుగుతోంది ఒక మరఫిరంగి. ఆమార్గంలోని గోడలమీదనుంచి సున్నపుపూత, మట్టిబెల్లులు రాలి పడిపోతున్నాయి. దొడ్లో నుంచి తప్పించుకుని పారిపోదామనే ప్రయత్నంలో గ్రీటీ క్రింది మెట్టుకి వచ్చిన సమయాన్నే ముందుతలుపు దఢాలున తెరు

చుకొని ఒకడు ముందుకువచ్చి తూలిపడిపోయాడు. ఆయిరుకు మెట్లమార్గంలో ఇంకా చీకటిగానే వుంది.

ఆమానవదేహం ముద్ద గట్టుకుపోయి వుంది. జుట్టు చెల్లా చెదరుగా పడివుంది. తెల్లవారుఝాము వెలవెలబోయే వెల్తురులో రక్తంకారి నల్లబడిపోయిన వామహస్తం భయానకంగా వుంది. వార్వర్ట్స్ పేపర్లమ్మే కుర్రాడు పోలీసులచేత కాల్చబడ్డాడు. ఆతనిదే యీవికృతదేహం.

సగంతెరవబడి వున్న తలుపు సందులోంచి అధికారి ఆజ్ఞలు వినిపిస్తున్నాయి. ఇనపకుళ్ళాయిలు, యూనిఫారమ్ వెండిబొత్తాములు, పొగమంచులో తళతళలాడుతున్నాయి. ఆయువతుల ప్రక్కనుంచే దట్టించిన తుపాకితో పరిగెత్తాడు ఒకపోలీసు. హాహాకారాలు చేస్తూన్నట్టీ, ప్రేలుస్తున్నట్టీ మనుష్యులతో వీధి నిండిపోయింది. ఆతలుపును మూసేందుకు గడియ వెయ్యాలని ప్రయత్నించింది గ్రీటీ.

తుపాకి మడమలతో తలుపుమీద బాదుతున్నారు పోలీసులు.

"తెరు—లేకపోతేకాల్చివేస్తాం" అని అవతలనుంచి ఒకరు అరిచారు.

"త్వరగా నువ్వు పారిపో" అంటూ మానోలీస్ యువతి ఆ యినపగడియను మరికాస్త లోపలికి నొక్కుతూంది.

ఆక్షితగాత్రుణ్ణి లాక్కుపోతూంది గ్రీటీ దొడ్లోకి. మానోలీసు కార్మికయువతి తన వెనక్కాల వస్తోందనే గ్రీటీ వుద్దేశ్యం.

మానవాతీతమైన శక్తితో క్రిందకు ఆగడియను నొక్కుతూన్నది. తనచిన్న కంపిత దేహంతో ఆతలుపులను నొక్కుతూన్నది. బయటినుంచి పోలీసులు కొడుతూన్న దెబ్బలతో వూగిపోతూన్నది ఆకర్రతలుపు. వాళ్ళిద్దరూ సురక్షితంగా దాటిపోయేవరకూ తలుపునిలబడితే చాలనేది ఒక్కటే ఆమె మానసక్షేత్రంలో మెలగుతూన్న కోరిక.

అవతల నుంచి తలుపుమీద తగిలిన బలమైన దెబ్బ ఆమె తలకు తగిలి నిస్పృహురాలై క్రింద పడిపోయింది. ఆమెచేతులు మెల్లిగా యినపగడియ మీదనుంచి జారిపోయాయి. తలుపుమీద దెబ్బలూ, కాల్పులూ కలిసి ఆమె చెవుల్లో మెడతెంపిలేని ఉరుముల ధ్వనిలా వినిపిస్తోంది.

తలుపుగడియ ఠంగ్‌మని ధ్వనిచేస్తూ ఊడి క్రిందపడి తలుపు తెరుచుకుంది.

దొడ్లోకి పారిపోదామని ఆవిడ లేచింది. కాని తూలిపోతూన్నది. పెంగ్—ఆమెచేతులు గాలిలో యెగిరిపడ్డాయి. నోటమాట లేకుండా మార్గమధ్యంలో బోర్లపడింది.

ఆమార్గం, దొడ్డికూడ పోలీసులతో నిండిపోయాయి. తుపాకులకోసమని యిండ్లన్నీ గాలించి వేయబడుచున్నాయి. ఆ నేలమీద ఆపొగాకు కార్మికురాలు గంటలతరబడి రక్తంతో

తడిసిన మట్టిలో పడివుంది. పోలీసులు ఆమె చనిపోయిం దనే వుద్దేశ్యంతో ఎవర్నీ దగ్గిరకి రానియ్యలేదు.

కొన్నిగంటల తరువాత ఆపడతి — సోఫీహెర్డర్ — చనిపోయింది

। । । । । ।

గృహాలన్నీ ఆక్రమించుకోనబడ్డాయి. గదులన్నీ వెదక బడ్డాయి. పక్కలమీదనుంచి పిల్లల్ని బయటికి లాగి పార వేశారు. గదులోవున్నసామాన్లన్నీ చెల్లాచెదరుగా చిమ్మేశారు.

"ఎక్కడవున్నారీ కమ్యూనిస్టులు? వాళ్ళతుపాకులు, ఆయుధాలూ, ఎక్కడ వున్నాయ్?" స్త్రీలు నడ్డిమీద చేతు లాన్చి పోలీసుల ప్రక్కనే నిలబడ్డారు. కిక్కురు మనడం లేదు. ఆచోకీ యేమీ యివ్వడం లేదు.

"మీకాక్కావాలంటే తుపాకులుకాల్చిన కార్మికుల్ని మీరే వెతుక్కోండి!"

"నీ మొగుడెక్కడ ఉన్నాడు?"

"నాకెల్లా తెలుస్తుంది? నేనతనికి పాలిచ్చే దాదినా?"

"ఈఅంతస్తులో ఆయుధాలేమన్నా ఉన్నాయా?"

"లేకేం. బోలెడన్ని. చంచాలు, చాకులు, కత్తెరలు, కుండలు వున్నాయి. దెయ్యాలు!"

ఆరవనంబరు గది కెదురుగుండా మరఫిరంగిమోటారు ఆపబడివుంది. దాంట్లో డిప్యూటీ నిలబడి పోలీసులు నిరంతు

శంగా అరెస్టులు చెయ్యకూడదని నెత్తి, నోరు బాదుకుంటు న్నాడు. ఆయన అక్కడ వుండటం మూలాన్ని, ఆవీథుల్లోనే అరెస్టు కాబడినవారిని మెత్తగా చావబాదకుండా పోలీసులు ఆగారు. చేతులకందిన వాళ్ళందర్నీ పోలీసులు విచక్షణలేకుం డా అరెస్టు చేశారు. ఆధునిక మారణయంత్రాలతో వీరవిహా రం చెయ్యనిశ్చయించుకొన్న వేలకొలది పోలీసుల్ని మూడు రోజులు నిలవరించి కొద్దిమంది కార్మికులు పోరాడారనే మా ట బెర్లిన్ నగరవాసులు ఘాసుక్రింద తీసుకోకుండావుండాలి, అంటే అనేక అరెస్టులు చెయ్యవద్దూ!

"ఆయుతా యింకా యెక్కడో ఇంట్లో దాక్కునే వు న్నారండి అయ్యా—నేను పందెమేస్తున్నాను చూడండి" అని డిప్యూటీతో చెప్పి ఆఉద్యోగస్తుడు రోషావేశంతో ప్రక్క యింట్లోకి పరిగెత్తాడు.

ఆవీధిసందుల్నీ, దొడ్లన్నీ, దోవల్నీ, కర్టు పూర్తిగా యె రుగును. అతడు ఒకయింట్లోంచి మరొకయింట్లోకి దూరి తప్పు కుంటున్నాడు. తానున్న యింట్లోకి పోలీసులు వస్తూన్న చప్పు డు వినపడగానే ప్రక్కయింట్లోకి ఏదోదారిగుండా వెళ్ళేవాడు. కర్టు పారిపోయేందుకు ఒక తుక్కుడబ్బా యెక్కి గోడదూకి పారిపోవడానికి ప్రయత్నిస్తూన్నప్పుడు ఒక ఉద్యోగస్తుని కంట బడ్డాడు. తోడనే వాడు తుపాకి ప్రేల్చాడు. అవతలిప్రక్క అతను క్రింద దిగాక అతని మీద గోడబెల్లులూడి పడ్డాయి.

ఇప్పుడాతడు వాళ్ళకంటబడ్డాడు. కొద్దినిమిషాల్లో ఆ యిల్లుకూడా సోదాచెయ్య బడుతుంది. తాను పట్టుబడితే వా ళ్ళేంచేస్తారో ఆతడెరుగును. ఊఫర్‌స్టేషన్‌లో యీాతని పుట్టు పూర్వోత్తరా లందరికీ బాగా తెలుసును.

అంతస్థుమీాదికి కొద్దిఅంగల్లో వెళ్ళి ఎడమవైపున ఒక ఉద్యమాభిమాని నివశిస్తూన్న యింట్లోకి వెళ్ళాలని వుద్దేశిం చాడు. ఆగదితలుపు చాలా క్రిందగావుంది. అపరిచితులకు అక్కడ తలుపు వుందన్నవిషయం తెలియదు. అప్పుడే దొడ్లో బూట్ల టక్, టక్ శబ్దం వినవడుతూన్నది. ఆతలుపు మెల్లిగా తెరిచి లోపలికి వెళ్ళి మూాశాడు. "ఈదెబ్బతో రక్షింపబడట మో, బోనులో చిక్కుకోవడమో జరుగుతుంది" అని అను కున్నాడు.

ఆయిరుకుగదిలో ఒక చిన్నకిటికీ వుంది. వెల్తురు వచ్చేందుకు మరేసాధనమూా లేదు. అక్కడేదో కదిలింది. ఉలిక్కిపడ్డాడు. ఆతనొక్కడే కాదక్కడున్నది. ఇద్దరూ వూపిరి బిగబట్టి కొట్టుకుంటూన్న గుండెల్తో నిరీక్షిస్తున్నారు. ఆచీకటికి క్రమంగా కళ్ళు అలవాటుపడ్డాడు ఒకమూాల కదల కుండా మెదలకుండా ముడిచిపెట్టుకునివున్న ఒకదేహపుమూాట వుంది.

పోలీసులు దొడ్లో తుపాకులు ప్రేలుస్తున్నారు. క్రింద అంతస్థులో ఒక కిటికీ ముక్క ముక్కలై క్రిందపడింది. కళ్ళు

దాక్కొన్న గుహ కిటికీ బయట ఎవరో ఆగారు. అందుచేత గుహలోకి వచ్చే కొద్దివెల్తురు కూడా నిరోధింపబడ్డది.

"ఈవెధవలు ఎక్కడో దాక్కొనివుంటారింకా" అని ఒక పోలీసు బిగ్గరగా అన్నాడు. ఆగుహావద్దకు వచ్చే మెట్ల మీద నుండి పోలీసు దిగుతున్నాడు. అతని ఉచ్ఛ్వాస నిశ్వాసాల శబ్దం కట్టకు వినవస్తూన్నది. ఆమూలవున్న ఆనల్లటి ముద్ద కదలిక లేకుండా పడుంది.

ఆగుహ కెదురుగా వున్న గది తలపుమీద తంతూ "ఏయ్! తలుపు తియ్యి! నేను పోలీసుని" అని అరుస్తున్నాడు పోలీసు.

శాపనార్థాలు పెట్టుకుంటూ ఒక స్త్రీ వచ్చి ఇక్కడె వళ్ళాలేరు. మాఆయన హాల్లోవున్నారు" అని అంది.

ఆగదిలోవున్న సామాన్లని తిరగేశారు. తిట్టుకుంటూ పోయారు పైకి పోలీసులు. ఐదునిమిషాల తరువాత.

"బలే అదృష్టంకాదు?" కొంచెంసేపుఆగి అన్నాడు మూలనున్న ఆవ్యక్తి. వాడోయిల్లు వాకిలి లేని నిర్భాగ్యుడు. వాడు పట్టుబడితే పోలీసువాణ్ణి కూడా "తిరుగుబాటుదారు" అని చర్య తీసుకొని వుండరు.

బయట యింకా కాలుస్తూనే వున్నారు. ఆనిమిషం వరకు కట్ట రక్షింపబడ్డాడు. ఒక ఖాళీపెట్టె మీద కూర్చుని చేతుల్తో ముఖాన్ని కప్పుకున్నాడు. హెర్మనెక్కడున్నాడు?

అన్నా యెక్కడుంది? గతరాత్రి మార్గంలో తారసిల్లిన పిల్ల ఎక్కడుంది? తక్కినవాళ్ళంతా ఎక్కడ? దొరక్కుండా పారిపోయారా లేక వాళ్ళచేతుల్లో పడ్డారా? అవతల ఏంజరుగుతోంది? అన్నా ఏమైంది? ఇంకా వాళ్ళెందుకు తుపాకులు కాలుస్తున్నారు—ఎవరిమీద? అటుతరువాత ఏంజరుగుతుంది? చూసీ చూడనట్టు వూరుకుంటారా యింతజరిగాక? రేపు మళ్లీ పత్రికలు నానాఅబద్ధాలు కూస్తాయి. రేపే? ఔను. రేపే మళ్లీ సిమెంటు మోసేందుకు తనపనికి పోవాలి. బెర్లిన్ కార్మికులు మాట్లాడకుండా నోళ్ళు మూసుకుని పడివుంటారా? తక్షణం బయల్దేరి వాళ్ళకళ్ళు తెరవాలి. సంగతి సందర్భాలు చెప్పాలి. ఇదంతా ఎల్లాజరిగిందో చెప్పాలి. సోషల్ డెమాక్రాట్ కార్మికులంతా ఏమంటారు?

గుహాలో ఉక్కిలి బిక్కిరౌతున్నారు. దీంట్లోంచి తప్పుకుని బయట పడాలి.

“నీకేమన్నా పిచ్చెత్తిందా? ఎక్కడికెడుతున్నావు?” అన్నాడు, రెండవవాడు.

“తక్కిన కామ్రేడ్సును చూశేందుకు!” అని కట్టు సమాధానమిచ్చి తలుపు తెరిచాడు.

---

# ఆన్నా

4 మే 1929 (పోలీసురిపోర్టు)

"శుక్రవారం నాడు, శనివారంరాత్రి యీక్రింద పేర్కొనబడిన వారు చాల అపాయకరమగు గాయాలతో బాధపడు తూన్నప్పుడు మ్యునిసిపల్ ఆసుపత్రికి కొనిపోబడ్డారు. తరువాత వారచ్చట మరణించారు. హెర్మన్ లాంజెండర్జర్: 25 సంవత్సరముల వయస్సు; చిరునామా తెలియదు; గుండెలలో కాల్చబడి చనిపోయాడు. ఎరన్సుమాస్‌లోష్. 20 సంవత్సరముల వయస్సు చిరునామా తెలియదు. కడుపులో కాల్చబడ్డాడు. మార్టిన్ బాలెడావిస్కీ 21 యేండ్ల వయస్సు; హార్జర్ట్రాసీ 21. గుండెమీద కాల్చబడ్డాడు. మాకే, 46 సంవత్సరముల వయస్సు, పత్రికా విలేఖరి. పొత్తి కడుపులో గుండుదెబ్బ తగిలింది. ఈమనుష్యులందరూ బర్కో ఆస్పత్రిలో మరణించారు. వీరే కాకుండా ఆటోఎంజల్, 19 యేండ్ల యువకుడు. విర్షో ఆస్పత్రిలో చనిపోయాడు.

"ఇంతేకాకుండా పోరాటం జరిగిన స్థలం దగ్గర తక్షణమే చనిపోయినవారు ముగ్గురు. ఆస్పత్రులలో 29 గురు క్షతగాత్రులున్నారు. మరణించినవారిసంఖ్య 25"

3 మే 1929 (వార్వర్ట్స)

"పోలీసుప్రెశిడెంటుగారి ప్రకటన. డాస్‌రోట్‌ఫానీ, డాస్‌లోక్‌షో పత్రికలు రెంటిని మూడువారములు, 23 వ తేదీ వరకు ప్రకటించకుండా పోలీసుప్రెశిడెంటు నిషేధించాడు. ఈరెండు పత్రికలు చట్టబద్ధమైన రీష్‌యొక్క ప్రజాస్వామిక స్థానాన్ని పోగొట్టేందుకు జర్మన్ కమ్యూనిస్టులు చేసిన ప్రయత్నాలకు చాల గొప్ప సహాయం చేశాయి."

4 మే 1929 (హాంబర్గర్ నాఖ్రిష్టెన్)

"ఒక తిరుగుబాటు దారు చంపబడ్డాడంటే 1,00000 మంది పౌరులు రక్షింపబడ్డారన్నమాట! అన్న నెపోలియన్ వాక్యాన్ని మాపాఠకులకు జ్ఞాపకం చేస్తున్నాము. అనేక వందల అరెస్టులు, కొద్ది (!) మరణాలు కాకుండా అనేక వందలమరణాలు, కొద్ది అరెస్టులు జరిగియుండినట్లైతే మధ్య తరగతి ప్రజలు ప్రస్తుత ప్రభుత్వంలో విశ్వాసం ఉంచగలిగి వుందురు"

4 మే 1929 (వార్వర్ట్స)

"వసంతఋతువు ఆరంభమౌతున్నది."

"..........ప్రేమ, అందమ్ముకల సౌరభాల రోజులు ఆరంభమైనాయి. ఆనందజ్యోత్స్నలో తేలియాడుతూన్న మనం ఆపరమాత్ముసకు ధన్యవాదాలర్పిద్దాం"

వసంతకాలం—అనంత ఆనందగీతం, ఆరంభమాతూన్నది. హీనరిష్‌బ్రాం

4. మే 1929 (ప్రత్యేకరిపోర్టు)

"నిన్నసాయంకాలమూ, రాత్రి చాలతీవ్రమైన పోరాటం జరిగిన అశాంతి కేంద్రాలైన వెడ్డింగ్, న్యూకోన్‌లలో, యీవిధమైన చర్య తీసుకోవలసిందని నేనాజ్ఞాపించాను.

"పైనచెప్పిన వీధులలో రాత్రి 9 గంటలనుండి తెల్లవారుఝాము 4 గంటల వరకూ వీధులలో ట్రాఫిక్ అంతా నిషేధింపబడింది. వైద్యులు, నర్సులు, ఆంబ్యులెన్సుమనుష్యులకు మాత్రం యీనిషేధపుటుత్తరువు వర్తించదు. గుమ్మాం మెట్లమీద, వీధిఅరుగులమీద, మళుపుల్లోనూ మూలల మూలల మనుష్యులెవ్వరూ తిరగకూడదు. వీధివైపునవున్న కిటికీ తలుపులు పై చెప్పబడిన గంటలలో మూసివేయబడవలయును. వీధివైపునవున్న గదుల్లో దీపాలు కూడా వుండరాదు. ఆజ్ఞల ధిక్కరించిన పేటవాస్తవ్యుల కిటికీలు పోలీసుల గుండ్లకు గురికాబడతాయి.

పగటివేళలో ఎవ్వరూ పేటల్లోనూ, వీధుల్లోనూ, మళుపుల్లోనూ, గృహప్రాంగణాల్లోనూ తిరుగకూడదు. అవసర

మైనదానికంటె ఎక్కువసేపు వీధుల్లో ఎవ్వరూ నిలవకుండా చేయుటకు పోలీసులకు ప్రత్యేకాధికార మియ్యబడినది. చేరుకోవలసిన గమ్యస్థానం లేకుండా వీధుల్లో తిరుగుతూండే ప్రజలు అరెస్టు చెయ్యబడతారు. ముగ్గురుకాని అంతకంటె యెక్కువకాని కలిసి తిరుగకూడదు. సైకిలుత్రొక్కుట నిషేధింపబడింది. ఈపేటలలో వున్న ధర్మశాలలు, కాఫీహోటళ్ళు రాత్రి 9 గంటలకు మూసివేయబడతాయి

పోలీసుప్రెశిడెంటు

(సంతకం) జార్జిబెల్ (ముద్ర)

5 మే 1929 (వాక్స్ జీటింగ్)

"......పోలీసుప్రెశిడెంటుచేత నిన్నటిదినమున పోలీసుల కీయబడిన "ప్రత్యేకఅధికారాలు" పోలీసులలో ప్రజలను అకారణంగా కాల్చివేయాలనే వెర్రికోరికను బలమిచ్చింది. పోలీసులు ఉన్మాదంతో విచ్చలవిడిగా మారణహోమాన్ని సాగిస్తున్నారు. ఈవిధంగానే జరిగేటట్లైతే పరిస్థితులు యిప్పటిలాగే వుండటం అసంభవం"

6 మే 1929 (పోలీసురిపోర్టు)

"పోలీసుప్రెశిడెంటు ప్రకటన.

"........అపాయస్థలంలోకి రావద్దని నేను చేసిన ప్రకటన, అనుసరించక పోయినట్లైతే ప్రాణాలు పోగొట్టు

కుంటారని నేను యిచ్చిన సలహా అనేకమందిచేత పెడచెవిని పెట్టబడింది. దానిఫలితాన్ని వారు అనుభవించారు...... ఏపక్కనుంచి తుపాకి పేల్చబడిందో నిర్ధారణ చెయ్యబడలేదు.

6 మే 1929.

"మేడే వుత్సవాలలో చనిపోయినవారి మృతకళేబరాలను వశపర్చుకునేందుకు బెర్లిన్ పబ్లిక్ప్రాసిక్యూటర్లు నిశ్చయించుకున్నారు. పంచాయతి జరిపిన తరువాతగాని ఉత్తర క్రియలు జరుపబడవు.

ప్రాంతీయన్యాయకోన్, బెర్లిన్ వెడ్డింగ్ మేజస్ట్రేట్ల సమక్షంలో ఇద్దరుడాక్టర్లచే మృతకళేబరములు పరీక్షింపబడును.

ప్రిష్యాదేశీయ మంత్రి, II, 1420, V

బెర్లిన్, 3 మే, 1929

ఆర్. యఫ్ బి. కార్యదర్శులకు.

డీడ్ ఎనాక్ట్మెంటు.

"21 జూలై 1922, 2 జూన్ 1927 తేదీలయందు ప్యాసుకాబడిన ప్రజాస్వామ్య ప్రభుత్వరక్షణ చట్టములోని, 14, 7 సేరాల ననుసరించీ, 19 ఏప్రిల్ 1908 జాతీయ సంఘ నిర్మాణచట్టము ననుసరించీ, రోట్ఫ్రంట్కాంఫెర్బండ్, రోట్ జంగ్ఫ్రంట్రోట్మారైన్లు వాటివాటిసంస్థలన్నిటితో స్వాతం

ప్రష్యా సరిహద్దులలో రీచ్ ప్రభుత్వానుజ్ఞతో, ఆసంస్థల చర్యలు పైనచెప్పబడిన చట్టములకు విరుద్ధముగా నున్నవి కాబట్టి రద్దు పరచబడినవి.

ప్రజాస్వామిక ప్రభుత్వ రక్షణ చట్టములోని 18 వ పేరానుసరించి వాటి ఆస్థులన్ని ప్రభుత్వము వశముచేసి కొనుచున్నది. ప్రాంతీయ పోలీసులు ఆఆస్థులను వశము చేసు కుందురు.

(సంతకం) జెసింస్కి.

మే 12 వతేదీని జర్మన్ కమ్యూనిస్టుపార్టీ కార్యదర్శు లకు గతవారంలో కోలిన్‌స్ట్రాసీ కార్మికులలో 180 మంది వీధిసంఘంలో చేర్చుకోబడ్డారను వార్త తెలుపబడింది. పోలీ సులచేత కాల్చబడిన షాఫర్ అనేకార్మికుని ఐదుగురు అన్న దమ్ములుకూడ "పగతీర్చుకుంటాం!" అనేప్రతిజ్ఞతో పార్టీలో చేరారు. వీధిని అంతట నీశోకసూచక చిహ్నలతోనూ, ఎర్ర జండాలతోనూ అలంకరించాడు.

"ప్రజాస్వామిక ప్రభుత్వ చట్టములోని 7, 21 పేరాల ననుసరించి 'డైరోట్‌ఫానీ' డాస్‌గీసెషా, ఓక్‌షాట్ పత్రిక లను నాలుగు వారముల కాలము, జూన్ 22 వరకు నిషే ధించు చున్నాను."

---

# అన్నా

మే 28 తేదీ సాయంకాలం కర్టు యింటికి రాగానే, 'మే' దినోత్సవం నాటినుండి, అంధకారమయంగానే వున్నట్లు ఆతని గదులు చీకటిగానున్నవి. పోలీసు ముద్ర వేసివున్న ఒక ఉత్తరాన్ని హాఫ్‌మన్ భార్య ఆతనికందించింది. వంటయింటి లోని దీపమును వెలిగించి తనచేతులలాగే వణుకుచున్న, ఆదీపకాంతిలో దానిని చదువ ప్రయత్నించేడు. కొద్దినిముషములు తటపటాయించి, కవరుకాగితాన్ని చించి, లోనున్న పోలీసు కార్యాలయ కాగితాన్ని తీసి, చదివేడు.

జెయిలుహాస్పిటలు, బెర్లిన్, లెర్టర్ స్ట్రాసీ.

బెర్లిన్, మే 27–12–1929

కర్టుజిమ్మర్‌మన్, బెర్లిన్, కోలిన్ స్ట్రాసీ, 6

“6 మే 1929 వ తేదీన మీరు వ్రాసిన ఎంక్వైరీకి యీసమాధానం వ్రాయుచుంటిమి. అరెస్టు కావింపబడిన కోలిన్ స్ట్రాసీ 6 వ గదిలో నివసిస్తూన్న, అన్నా జిమ్మర్‌మన్ లెర్టర్ స్ట్రాసీలోని జెయిలు హాస్పిటలులో 4 వ గదిలో 32 వ మంచము మీద నున్నది.

"చూడదలచుకొనినవారు జైయిలు గవర్నరుగారికి 3 రోజులు ముందుగానే దరఖాస్తు పెట్టుకొనవలయును.

జయిలు—హాస్పిటలు—అడ్మినిస్ట్రేషను.

హెర్మన్, జెస్టిజ్ వాద్మష్టర్.

కర్టుకు భోజనాది సదుపాయములు చేయుచున్న హెర్మన్ భార్య ఒకగంట తరువాత వచ్చి తొంగి చూడగా రెండుచేతులతోనూ, తలపట్టుకొని అవుత్తరముకేసి నిశ్చేష్టితుడై రెప్పలు మూయకుండా చూస్తున్న కర్టు కనపడ్డాడు.



3 రోజుల అనంతరం ఒక జయిలు వార్డ్రెస్ వెనుక నడుస్తూ, రెండువైపులను రోగుల మంచములు పరచబడిన ఒక పెద్దగదిలో కర్టు ప్రవేశించాడు. ఒక రోగి మీద నుండి మరొక రోగి మీదకు కర్టు చూపులు ప్రసరించాయి. మాసిన తువ్వాలును చంటిబిడ్డవలె చేసి, ఆడిస్తూ ముద్దు పెట్టుకుంటూన్న దొకస్త్రీ. ఆమెప్రక్క నున్న మరొకస్త్రీ వెర్రినవ్వు నవ్వుతూన్నది.

కుడివైపున ఉన్న చివరిప్రక్కవద్ద వార్డ్రెస్ ఆగి "ఆమెకు జ్వరమీరోజుననే తగులలేదు. లేనిచో, నిన్ను రానివ్వక పోయేవారు. నీకు పదినిమిషాలే వ్యవధి." అని కర్టుతో చెప్పింది.

ఆమె చెపుతోన్నది కర్టు చెవుల పడటమే లేదు. కర్టు అన్నా వైపు చూపులు మరల్చుకోలేకుండా తదేకధ్యానంతో నిశ్చేష్టితుడై చూస్తున్నాడు. ఆమె ముఖము పాలిపోయింది. కణతల వద్దనున్న పచ్చరక్తనాళాలు కనపడుతున్నాయి. దించుకుపోయిన కండ్లలోనుండి, అనూహ్యమైనట్టి, నవీనమైనట్టి కాంతిని వెలువరించే చూపులు ప్రసరిస్తున్నాయి.

ఈమె—అన్నాయేనా?

నేడే, ఆమె పరిపరిధమమున సంపూర్ణ చైతన్యమును కలిగియున్నది. ఇంతకాలమూ, రాత్రింబగళ్లు ఘోరమైన జ్వరంతో వడలు తెలియక పడివుంది. తానచ్చటికెట్లు వచ్చిందో కూడా ఆమెకు జ్ఞాపకము లేదు. నీరసించిన ఆమె హస్తమును చాలా జాగ్రత్తగా కర్టు తన చేతుల్లోనికి తీసికొన్నాడు. వారి సంభాషణను అనేకసార్లు ఆపవలెనని వార్డెన్ ప్రయత్నించింది. తమవీధిలో వున్న వారిని గూర్చి అనేక ప్రశ్నలను అన్నా వేసింది. సంగతులు తెలుసుకునేందుకు ఆమెకేమీ పత్రికలు దొరకలేదు. తాను అరెస్టయిన తరువాత బెర్లిన్‌లో యేమిజరిగిందో ఒక క్రొత్తరోగి ఈఉదయాన్నే చెప్పింది. తమ పార్టీకి చెందిన ఒకవకీలు తనను హాస్పిటలులో జేర్పించాడు అని అన్నా కర్టుతో చెప్పింది. ప్రభుత్వాధికారమును ప్రతిఘటించి, తిరుగుబాటు చేసిందనే

నేరం తనమీద మోపబడిందని చెబుతోన్నప్పుడు దరహాస చంద్రిక ఆమె వదనము నుద్దీపింప జేసినది.

"కాని, అన్నా, అది శుద్ధపిచ్చితనం"

"కాదోయ్ — ఇదివరకు నేను చాలా తెలివితక్కువగా ప్రవర్తించేదాన్ని. కాని, నువ్వెందుచేత చెప్పేవాడవు కాదు? "ప్రభుత్వాధికారాన్ని ప్రతిఘటించటం" అని నేను కూడా ఇదివరకు అనుకోలేదు. నీ కేసు ఆపద వస్తుందో అని మొట్టమొదట, నేను కూడా, ప్రదర్శనంతో వచ్చాను. అటు తర్వాత — నాలో చాలా మార్పు వచ్చింది. ఇంతవరకూ రాజ్యాంగము నిష్పక్షపాతమైనదీ పార్టీల కతీతమైనదీ అని అనుకున్నాను కాని అదికూడ వర్గసంఘర్షణలో ముఖ్యమైన భాగమని నేనెరుగను. కార్మికులు హక్కులకొరకు పోరాడు ప్రతి పోరాటంలోనూ యీరాజ్యాంగాన్ని యెదుర్కోవలసి వుంటుందని నేను తెలుసుకున్నాను. ఏనాడు పోలీసు స్టేషనులో విల్లీని చావమోదేరో—, కర్టు, అప్పుడే ప్రభుత్వాధికారమంటే ఏమిటో గ్రహించాను."

"మీరీవిధంగా మాట్లాడుకోకూడదు" వార్డ్రెస్ వారిని మందలించింది. కాని ఆమె స్వరము కఠినముగా లేదు. ఆమె శ్రద్ధగా తమ సంభాషణను ఆలకించుచుండుటను కర్టు చూచాడు, 10 నిమిషాల గడువుదాటి చాలసేపైంది.

"నేను చెప్పదలచుకున్నది పూర్తికానియ్యి!" అన్నా అంది. న్యాయమూర్తి ముందు నేనింకా యెక్కువ చెప్ప దల చుకున్నాను. ఎవరైతే యీనాడు ప్రభుత్వాధికారాన్ని కలిగి యున్నారో, వారు కార్మికుల ప్రబలశత్రువులు. వారు ప్రభు త్వాధికారమున్ను, పెట్టుబడిదారుల ప్రయోజనమును రక్షించేం దుకును, కార్మికుల హక్కుల నణచేందుకును ఉపయోగి స్తారు. కోర్టులో, సోషల్ డెమాక్రాటిక్ కార్మికులతో మనం బ్రతకాలంటే, యీరాజ్యాంగ నిర్వహణానికి సహాయమొనర్చే వారినాయకులను కూడా నాశనం చెయ్యాలని చెబుతాను. ఈ సంవత్సర మే దినోత్సవం రోజున యీవిషయాన్ని నేర్చు కున్నాను."

"అన్నా మన అబ్బాయి యేవిధంగా వున్నాడో, అడి గావు కాదేం?" ఆమె ఆలోచనలను మార్చుటకు కర్టు ప్రశ్నించాడు. పాలిపోయిన ఆమెవదనం జ్వరంతో సల సల కాగిపోతూన్నది..

"కుర్రాణ్ణి గూర్చి చాలాసేపు అనుకుంటూ వుండే దాన్ని. వాడికంటె యెక్కువగా మనకామ్రేడ్సు నాకు జ్ఞాప కం వస్తున్నారు. అందులో చాలమంది పేర్లు కూడా యెరు గను. వారి ముఖపరిచయం మాత్రమే వుంది. కర్టూ, నావంటి చెడ్డ కామ్రేడ్ నీకున్నందుకు నాకు సిగ్గుగా వుంది?"

ఆమె రెండు చేతులను, కర్టు తన చేతులలోనికి తీ కొని మృదువుగా వ్రేళ్ళతో నిమురుతున్నాడు.

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA 102B136 |
| పుస్తకం పేరు | GnQ |
| తారీఖు | 25/10/24 |
| ముందు అట్ట | YCS |
| వెనుక అట్ట | YCS |
| మొత్తం పేజీలు | 293 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | C1, BC1 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | thasin |
| పేజీలు విడదీసినది | nandini |
| స్కాన్ చేసినది | Hima |
| పరీక్ష చేసినది | nandini |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | no |
| పరిస్థితి | good |